అపరాధ పరిశోధన అనుబంధం—33

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## "దేవతామూర్తి"

రచన : సుజనశ్రీ

## నకిలీ జన్మ

రచన : శ్రీరాజ్

## ప్రేమ లేఖలు

రచన : హుసేన్ బాషా

## ప్రేమ పూజారులు

రచన : వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంట్—33
సెప్టెంబర్, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. పీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

Ranga Rao
30/8/71

గి.డా రంగారావు

# "దేవతా మూర్తి"

సుజనశ్రీ

మైత్రా కళ్ళు చికిలించుకుని ముందుకు చూశాడు.

చుట్టూ ఎటు చూసినా అంతం కనిపించని ఇసుక ఎడారి కనుపిస్తూ ఉన్నది. ఇప్పటికే తన అనుచరులు ముగ్గురూ దాహానికీ, ఎండ వేడికి అల్లాడిపోతున్నారు. ఏం చేయాలో తోచటంలేదు మైత్రాకు.

రాజస్థాన్‌లోని జైపూర్‌లో హోలీ పండుగ రోజున పెద్ద వేడుక జరుగుతుంది. అప్పుడు మహావీరుని విగ్రహానికి అపూర్వమైన తొమ్మిది వజ్రాలను అలంకరిస్తారు. అవి మాజీ మహారాజుకి చెందినవి. అతడు చనిపోతూ వాటిని మహాదేవుని ఆలయానికి అర్పించాడు.

బాస్ మాటల ప్రకారం ఆ వజ్రాలకు అమెరికాలో

కోటి రూపాయల విలువ లభిస్తుంది. అందుకే బాస్ ఎన్నో పథకాలు వేసి, శ్రమకు ఓర్చి తమను పంపాడు.

మైత్రాతోబాటుగా మరో ముగ్గురు అనుచరుల్ని కిషన్, నరేన్, అరుణ్‌కుమారులను తోడిచ్చి పంపాడు బాస్. వారంతా ఆరితేరిన ఘటాలు.

తాము వచ్చిన పని సులభంగానే నెరవేరింది. ఆ తొమ్మిది వజ్రాలూ తమ పరమైనవి.

తన కోటు లోపల జేబుల్లో లెదర్ తిత్తిలో తొమ్మిది వజ్రాలు, భద్రపరచబడి ఉన్నాయి.

"దాహం! దాహం!" అనరిచాడు నరేన్.

తిరుగు ప్రయాణంలో నలుగురూ నాలుగు తిత్తులతో నీళ్ళు తెచ్చుకున్నారు. తమ ప్రయాణం నాలుగుగంటల సేపు పట్టవలసిందే! కానీ మధ్యలో ఇసుక తుఫాను ఎదురైంది. దాన్ని దూరంనుంచే పసిగట్టి, మరో దిక్కుగా ఒంటెల్ని పరుగెత్తించారు.

ఇసుకతుఫాను బారినుంచి తప్పించుకోగలిగారు కానీ, మార్గం తప్పిపోయారు. ఎంతదూరం ప్రయాణించినా దరీ, దోవ కనుపించటంలేదు.

తమ వెంట తెచ్చుకున్న నీళ్ళు అయిపోయినయ్. అందరికీ నాలుకలు పిడచగట్టుకు పోతున్నయ్. ఈ ఎడారిలోనే తాము సమాధి అయ్యేలా వున్నారు.

"మైత్రా! నరేన్ పడిపోయాడు!" వెనకగా వస్తున్న కుమార్ కేక వేశాడు.

మైత్రా వెనక్కు తిరిగిచూశాడు. నరేన్ ఒంటెమీద నుంచి క్రింద పడిపోయాడు. దాహంతో పిడచగట్టుకు పోయిన అతడి నోరు తెరుచుకునే వుంది. కళ్ళు తెరుచుకుని ఉండగానే అతడి ప్రాణాలు అనంతవాయువుల్లో

కలిసిపోయాయి. ఆకలికీ,దప్పికకూ అతడు బలైపోయాడు. అతడిని ఆ ఎడారిలో పూడ్చేసి, తిరిగి బయలుదేరారు ఒంటెలమీద.

## 2

"అదుగో మిలటరీ విమానాశ్రయం!" అనరిచాడు మైత్రా.

మిగతా ఇద్దరూ అటుకేసి చూశారు.

దూరంగా ఖర్జూరపు చెట్ల గుంపులో ఒయాసిస్ కన బడింది. దాని ప్రక్కనే మిలిటరీ ఎయిరోడ్రోమ్ ఉంది. నాలుగైదు చిన్నసైజు విమానాలు ఆగి ఉన్నయ్.

ఒంటెలమీదనుంచి దిగారు ముగ్గురూ. ఆయుధాలూ, అమ్యూనిషన్ ఉన్న తోలు సంచుల్ని భుజాన వేసు కున్నారు.

మైత్రా సరికొత్త రకమైన తెల్లని పోలిథిన్ సూట్ని వేసుకున్నాడు. చూడటానికది రెయిన్కోటులాగుంటుంది. కానీ అది బుల్లెట్ ప్రూఫ్ పోలీథిన్తో తయారు చేయ బడినది. మెషిన్గన్ బుల్లెట్స్ సైతం దాన్ని ఛేదించ లేవు. బాస్ అమెరికా వెళ్ళినపుడు, ఆ సూట్ని రహ స్యంగా కొని తెచ్చాడు.

బైనాక్యులర్స్తో విమానాశ్రయాన్ని క్షుణ్ణంగా పరిశీ లించి చూశారు. రన్వేని శుభ్రం చేస్తున్నవారితో గూడ కలిపి పదిమందికన్న లేరు.

"కిషన్! నీవు దారితప్పిన ప్రయాణీకుడిలా ఒంటరిగా వెళ్ళు! అందర్నీ ఆకట్టుకొని మాట్లాడుతుండు! వెనుకనుంచి మేం వాళ్ళని ఎటాక్ చేస్తాం. అదే సమయానికి నీవూ, నీ పిస్తోలు తీసి టపటప వాళ్ళని కాల్చెయ్!" మైత్రా ఆజ్ఞ జారీ చేశాడు.

కిషన్ సరేనని తలూపాడు. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ విమానాశ్రయం వేపుగా నడిచాడు.

మరో వైపుగా ప్రయాణించి ప్రాకారం వెనుకకు చేరుకున్నారు మైత్రా, అరుణ్‌కుమార్‌లు.

కిషన్ సైనికుల దృష్టిలో పడగానే, సైనికులు కొందరు తుపాకులు గురిచూపుతూ అతడ్ని చుట్టుముట్టారు.

కిషన్ దాహం అన్నట్టుగా సైగ చేశాడు. ఓ సైనికుడు నీళ్ళు తెచ్చి అందించాడు. కిషన్ ఆత్రంగా త్రాగేశాడు. ఇంకా కావాలన్నట్టు అడిగాడు.

సరిగా అదే టైమ్‌లో మెషిన్‌గన్ ప్రేలింది.

సిపాయిలు ప్రమాదాన్ని పసిగట్టేలోపలే ఒక ప్రక్క నుంచి అరుణ్, మరో ప్రక్కనుంచి మైత్రా, ఇద్దరి చేతుల్లోని మెషిన్‌గన్స్ ప్రేలుళ్ళకు సిపాయీలు క్షణాల్లో పిట్టల్లా రాలిపోయారు.

మైత్రా, అరుణ్, కిషన్‌ల ఆనందానికి అంతులేదు.

ఉన్నట్టుండి, కిషన్ "అమ్మా!" అంటూ చేతిని గుండెల దగ్గరుంచుకున్నాడు. చూస్తూండగానే క్రింద పడిపోయాడు. అతడి చేయి రక్తంతో తడిసిపోయింది.

చాటున పొంచి ఉండి, ఎవరో సిపాయి కాల్చాడు. ఆ దెబ్బకు కిషన్‌సింగ్ మరణించాడు.

అరుణ్ ఎడమచేయి జేబులోకి వెళ్ళింది. మరుక్షణంలో హ్యాండ్ గ్రెనేడ్‌ని తీసి, కాల్పులు జరిపిన సిపాయి దాక్కున్న చోట విసిరాడు.

"హా!" అంటూ సిపాయి ఆ ప్రేలుడులో ఎగిరి ఇవతల పడిపోయాడు. అతడి శరీరం ముక్కలు ముక్కలయిపోయింది.

మైత్రా మరోసారి అంతటా కలయజూశాడు. ఇంక ఎవరూ మిగిలినట్లు లేరు అనుకున్నాడు.

"అరుణ్! ఎందుకైనా మంచిది! నీవొకసారి అంతటా చూసిరా! ఈలోపల నేను ప్లేన్‌ని చెక్ చేసి, రెడీ చేస్తాను," అన్నాడు మైత్రా.

"అలానే బాస్!" అంటూ, చేతిలోని మెషిన్‌గన్‌ని పొజిషన్‌లో ఉంచుకుని ముందుకు నడిచాడు అరుణ్ అతి జాగ్రత్తగా, అన్ని వేపులా పొంచి పొంచి చూస్తూ.

ఈలోపల మైత్రా విమానాల్ని చూశాడు. నాలుగింటిలో ఒకటి మాత్రమే ప్రయాణానికి సిద్ధం చేయబడి ఉంది. పెట్రోల్ చెక్ చేసుకుని, పైలట్ సీట్‌లోకి ఎక్కి కూర్చున్నాడు. తలకు హెల్మెట్ తొడుక్కున్నాడు. అతడి పెదవులమీద చిరునవ్వు వెలిసింది.

కోటి రూపాయిల విలువగల వజ్రాలు తన జేబులో అతి పదిలంగా ఉన్నయ్. వాటిని బాస్‌కి అప్పజెప్పితే "సెభాష్" అని వీపు చరుస్తాడు. ఒక లక్ష రూపాయలు తన మొహాన కొడతాడేమో!

అలాంటి సన్మానాలకూ, పొగడ్తలకు పొంగిపోయే రోజులు వెనుకబడిపోయినయ్. తనవలన బాస్ అంచెలంచెలుగా, ఒకొక్క మెట్టు ఎక్కి, ఎంత ఉన్నతస్థాయికి చేరుకుంటున్నాడో తనకూ, బాస్‌కీ, ఆ దేవుడికీ మాత్రమే తెలుసు.

ఎల్లకాలమూ తను బాస్ మోచేతిక్రింది నీళ్ళు త్రాగాల్సిందేనా? అవకాశమూ, అదృష్టమూ కలసి వస్తే, తనే బాస్ ఎందుకు కాకూడదూ? ఈ ఆలోచన అతడి మెదడుని ఎన్నాళ్ళనుంచో తొలుస్తూ ఉన్నది.

తన వెంట వచ్చిన ముగ్గురిలో ఒకడ్ని ఎడారి బలి తీసుకుంది. మరొకడ్ని ఇక్కడి సంఘర్షణ బలిగొంది. ఇక మరొక్కడు మిగిలిపోయాడు.

అరుణ్ అన్నివేపులా వెదికి వెనక్కి తిరిగి వస్తున్నాడు.

విమానంలోంచి మైత్రా మెషీన్‌గన్‌ని గురిపెట్టి కాల్చాడు అరుణ్‌ని. ఈ ఫీల్డులో హత్యలు చేస్తేగాని పెద్దవాళ్ళవలేరు. అరుణ్ పెద్దగా అరుస్తూ కుప్పలా కూలిపోయాడు.

ఆ తర్వాత విమానం ఇంజన్ను స్టార్ట్ చేశాడు. రన్‌వే మీద పరుగెత్తి గాలిలోకి లేచింది.

'ఈనాటినుంచీ నేను కోటీశ్వరుడ్ని. టు హెల్ విత్ బాస్! ఈ వజ్రాలతో మైత్రా పరారయ్యాడని తెలిసిన తక్షణం బాస్‌కి గుండె ఆగినా ఆగవచ్చు!' అనుకుని మరోసారి ఆనందించాడు మైత్రా!

# 3

విమానం అరేబియా సముద్రం మీదుగా ఎగురుతోంది.

వాచీవంక చూసుకున్నాడు మైత్రా. అప్పుడే తను బయలుదేరి గంటపైనే అయింది.

ఆకాశంలో మబ్బులు క్రమ్ముకుంటున్నయ్. గాలి వేగాన్ని పుంజుకుంటోంది.

క్రింద ఎక్కడా భూభాగం కనుపించటంలేదు. ఎటు చూసినా సముద్రమే!

మైత్రా జేబులోంచి మ్యాప్‌ని లాగి, దాన్ని తెరిచాడు. కొంత రిస్కు తీసుకుని, ముందుకు పోగలిగితే, లక్ష దీవులు వస్తయ్. తను ఏదో దీవిలో దిగవచ్చు. అడవులూ, ఆటవికులూ ఉన్న దీవులయితే ఇంకా మంచిది!

ఎటూ బాస్ తనకోసం తప్పకుండా వెదికిస్తాడు. నాగరిక ప్రపంచంలో అయితే, ఎక్కడున్నా వెదికి పట్టుకుంటాడు.

కనుక ఆటవికుల మధ్యలో తను అజ్ఞాతంగా గడపగలిగితే, కొంతకాలం గడిచాక బాస్ తనపై ఆశ వదలుకుంటాడు. అప్పుడు తను మరో దేశం పారిపోయి, తన దగ్గరున్న వజ్రాల్ని సొమ్ము చేసుకొని హాయిగా బ్రతకవచ్చు.

మేఘావృతమైన గగనతలంలో విమానం పయనిస్తున్నది. గాలి ఉధృతానికి విమానం అటూ ఇటూ ఊగుతూ పోతోంది.

నల్లని కారు మబ్బులు చీల్చుకుంటూ కళ్ళు మిరుమిట్లు గొలిపే మెరుపులు మెరుస్తున్నయ్ ఉండి, ఉండి!

విమానంలోంచి క్రిందకు చూశాడు మైత్రా. చిన్న చిన్న దీవులు వేగంగా వెనక్కుపోతున్నాయ్. చాలా దీవుల్లో దీపకాంతి గూడ కానరావటం లేదు.

మైత్రా ఒంటికి వేడి తగిలింది. ఆశ్చర్యపోతూ వెనక్కు తిరిగి చూశాడు. విమానం వెనుకభాగంలో మంటలు ప్రజ్వరిల్లుతున్నయ్. అవి ఎలా వచ్చాయో అర్థంకాలేదు అతడికి. అయినా ప్రమాద కారణాన్ని విచారించే వ్యవధి అసలే లేదు. విమానం ఏదో దీవిమీదుగా ఎగురుతోంది.

వీపుకి కట్టుకున్న పారాఛూట్ కిట్‌ని మరోసారి తడిమి చూసుకున్నాడు మైత్రా. క్రింద చెట్ల గుబుర్లలో కాగడా వెలురు మాత్రం మసక మసకగా కనబడుతోంది. ప్లేన్ డోర్ తెరుచుకుని క్రిందకు దూకేశాడు మైత్రా.

ప్యారాఛూట్ తెరుచుకుని, మైత్రా క్రిందకు దిగి

పోతున్నాడు. విమానం అంతటా మంటలు అలము కున్నయ్. మండుతున్న అగ్నిగోళంలా వెళ్ళి సముద్రంలో పడిపోయింది.

చెట్లకు తగులుకుని దెబ్బలు తగలకుండా జాగ్రత్త పడుతూ తప్పుకుంటూ క్రిందకు దిగుతున్నాడు మైత్రా.

మైత్రా ఓ ఎత్తయిన బండమీద దిగబడ్డాడు.

చుట్టూ పరిసరాలు చూస్తూనే అతడు దిగ్భ్రాంతి చెందాడు.

అతడికి ప్రక్కన కొద్ది దూరంలో పెద్ద విగ్రహం ఉంది. దాని ఆకృతినిబట్టి అది బహుశా ఏ కొండదేవరదో అయి ఉండాలనుకున్నాడు.

చుట్టూరా కాలభైరవుల్లా, నల్లని రూపాలతో ఆటవి కులు నిలబడి తనవంకే ఆశ్చర్యంగా చూస్తున్నారు.కొందరి చేతుల్లో కాగడాలు వెలుగుతున్నయ్. మరికొందరి చేతుల్లో తప్పెట్లున్నాయ్.

బహుశా కొండదేవరకు తప్పెట్లూ తాళాలతో కొలు వులు చేస్తూ ఉండాలి అనుకున్నాడు మైత్రా.తన రాకతో వాళ్ళు దిగ్భ్రాంతి పొంది, చేష్టలుడిగి నిలబడిపోయారు కాబోలు! ఆటవిక స్త్రీలు మొలకు ఏదో ఎండిన ఆకుల్ని చుట్టుకున్నారు. వక్షోజాలమీద ఎటువంటి ఆచ్ఛాదనా లేదు.

ఎవరిదో కీచుగొంతు మారుమోగింది ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ. ఆటవిక యువకులు విల్లంబులు ఎక్కుబెట్టి బాణాలు వదిలారు.

## 4

మైత్రా తనవైపు మృత్యుదేవత కోరల్లాగ దూసుకు వస్తున్న బాణాల్ని చూడగానే, అక్కడ్నుంచి క్రిందికి

దూకి పారిపోవాలనుకున్నాడు.

అంతలోనే అతడికి స్ఫురణకు వచ్చింది. తన శరీరం మీదున్న సూట్ బుల్లెట్ ప్రూఫుదనీ, తలకు అదే రకమైన గాజు శిరస్త్రాణం ఉందనీ, అందువలన ఆటవికుల బాణాల వలన తనకేం ప్రమాదం జరగదనీ గుర్తుకు తెచ్చుకుని, అలాగే నిలబడిపోయాడు.

నలుగురు ఆటవికులు నాలుగు బాణాలు వదిలారు. రెండు బాణాలు గమ్యం తప్పి, మైత్రాను దూసుకుంటూ వెళ్ళిపోయాయి. మరో రెండు బాణాలు ఒకటి బొడ్డు క్రిందుగానూ, మరొకటి ఎడమ రొమ్ముమీద వచ్చి తగిలినయ్.

బుల్లెట్ ప్రూఫ్ సూట్‌లో ఉండటంవలన, బాణాలు అతడి డ్రెస్‌కి ఢీకొని క్రింద పడిపోయాయి.

గంభీరంగా నలుగురివంకా కోపంగా చూశాడు మైత్రా. జేబులోంచి సైలెన్సర్‌ని బయటకు లాగాడు.

ఆటవికుల్లో కలకలం రేగింది.

"నేను చెప్పలా? అతడు మనిషి కాదని! ఏ దేవలోకం లోంచో వచ్చివుంటాడు!" ఎవరో గొణుక్కుంటున్నట్టుగానే పైకి అన్నాడు.

"కాకపోతే మన 'శరవేగం'గాడి బాణానికి కూడా చావకుండా ఉండగలరా ఇంకా?"

ఆటవికుల నాయకుడు చేతులు పైకెత్తి మైత్రా ముందుకు వచ్చాడు. దండంపెడుతూ, సాష్టాంగపడ్డాడు. అతడితోపాటు మిగతా అందరూ సాగిలపడ్డారు.

"మహాప్రభో! మీరు ఏ లోకంనుంచి వస్తున్నారో తెలియని మా మూఢులు మీపై బాణాలువేసి అపచారం

చేశారు. వాళ్ళని క్షమించమని వేడుకుంటున్నాను!" అన్నాడు నాయకుడు.

"మీ బాణాల ప్రభావం చూపించారుగదా? నా వజ్రాయుధం తడాఖా చూద్దురుగానీ! మీలో ఎవరి ప్రాణాల్ని తీయమంటారో మీరే తేల్చి చెప్పండి!" మైత్రా కోపంగా అరిచాడు.

అతడి కోపానికి గజగజలాడిపోయారు ఆటవికులు. ఆ గుంపులోంచి ఆడవాళ్ళూ, యువతులూ ముందుకు వచ్చారు.

"ఓ దేవతామూర్తీ! మా వాళ్ళను కాపాడండి!" అని ఏకకంఠంతో అరిచారు.

మైత్రా క్షణాల్లో పరిస్థితి అర్థంచేసుకున్నాడు. ఆ అమాయకులు తనను దేవతామూర్తిగా భావిస్తున్నారు. కానీ ఈమాత్రానికే తను లొంగిపోయినట్టు కనబడితే తను వాళ్ళకు లోకువయిపోతాడు.

"అలా వీల్లేదు. నా వజ్రాయుధం బయటకు వచ్చిందంటే రక్తం చవిచూడవలసిందే! పోనీ మనిషి కాకపోతే ఏదైనా జంతువో, మృగమో!" అంటూ అంతటా కలయజూశాడు మైత్రా.

ఒక ప్రక్కగా మేక కనుపించింది. "అడ్డం తొలగండి! ఆ మేకను హతం చేస్తాను!" అంటూ సైలెన్సర్‌ని అటుగా గురిపెట్టాడు.

ఆటవికులు అంతా ఒక ప్రక్కకు తప్పుకున్నారు.

మైత్రా మేకను షూట్ చేశాడు. గిలగిల తన్నుకుంటూ రక్తపుమడుగుల్లో పడిపోయింది మేక.

ఆటవికులంతా మరోసారి అతడిముందు మోకరిల్లారు.

"అయ్యా! తమరే లోకంనుంచి వస్తున్నారు? స్వర్గం నుంచా? కైలాసంనుంచా?" నాయకుడు మళ్ళీ అడిగాడు.

"గంధర్వలోకంనుంచి! ఇంద్రసభలో నృత్యంచేసే ఒక గంధర్వకన్యతో నేను సుఖిస్తూ కాలం గడుపుతున్నాను. నా పొందులో ఆమె సర్వాన్ని మరిచిపోయింది. ఇంద్రుడి సభలో నృత్యం చేయవలసిన సమయాన్ని గూడ విస్మరించింది.

ఈ విషయం గమనించి, ఇంద్రుడు నాకు శాపమిచ్చాడు, మానవలోకంలో కొంతకాలం గడిపి రమ్మని. అందుకే నేను నేరుగా గంధర్వలోకంనుంచీ ఇక్కడకు దిగాను."

"అయ్యా! మీరిక్కడకు రావడం మా పుణ్యం. మా ఆతిథ్యాన్ని స్వీకరించండి" అన్నాడు వాళ్ళ నాయకుడు.

## 5

ఆ గూడెంలో రెండతస్తుల మట్టిమిద్దె అదొక్కటే! బహుశా అది నాయకుడిదై ఉండాలనుకున్నాడు మైత్రా. దానిని క్షణాలలో శుభ్రపరచి అతడికి ఏర్పాటు చేశాడు.

ఆటవికుల నాయకుడు కొద్దిగా ముందుకు వచ్చాడు. "మీ చర్మం ఎంతో నున్నగా, స్ఫటికంలా అందంగా ఉంది. ఒకసారి దాన్ని తాకిచూడాలని ఆతృతగా ఉంది" అన్నాడు.

మైత్రా పెద్ద పెట్టున నవ్వాడు. "అలాగే తాకిచూడు నాయకుడా!"

నాయకుడు అతడ్ని సమీపించాడు. కుడిచేయి ముందుకు జాపి మైత్రా శరీరానికున్న బుల్లెట్ ప్రూఫ్ సూట్‌ని తాకిచూశాడు. నున్నగా ఉన్న ఆ కృత్రిమ చర్మాన్ని తాకి త్రాచుపామును ముట్టుకున్నంత బెదురుతో ధడాలున

చేతిని వెనక్కి లాక్కున్నాడు మళ్ళీ.

తృప్తిగా, చిరునవ్వుతో వెనక్కి వెళ్ళాడు నాయకుడు.

ఠీవిగా అడుగులు వేసుకుంటూ ముందుకు నడిచాడు మైత్రా.

"ఇక మీరంతా వెళ్ళిపొండి. ఎవరైనా నన్ను కలుసుకోవాలంటే గుమ్మంమీద రెండుసార్లు తట్టండి. నేను రమ్మనేవరకూ ఎవరూ లోపలకు రాగూడదు."

నాయకుడు తలూపాడు.

"నా కోసం ప్రత్యేకంగా ఇందాక నేను కాల్చి చంపిన మేకను వండి తీసుకురండి! పోతే, నాకు పరిచర్యలు చేయటానికి ప్రాయంలో ఉన్న యువతి కావాలి! స్వర్గంలో అప్సరసలతో గడపటానికి అలవాటుపడ్డ వాళ్ళం! తోడుగా స్త్రీ లేనిదే ఉండలేము" అంటూ మైత్రా అక్కడున్న యువతుల సమూహంలోకి చూశాడు. పదిహేడేళ్ళ ప్రాయంలో ఉన్న ఒక యువతిని వేలెత్తి చూపించాడు.

జుట్టు నెరిసిన ఒక వ్యక్తి ముందుకు వచ్చాడు.

"అయ్యా, గంధర్వుడుగారూ! ఆమె మా అమ్మాయే! ఈ నెలలోనే ఆమెకు వివాహం నిశ్చయమయింది. పైగా మాలో వ్యభిచారమన్నది చాలా పెద్ద తప్పు!" అన్నాడు అతడు.

"పెళ్ళి నిశ్చయమైతేనేం? లక్షణంగా చేసుకోమను! ఆమెను నేను అనుభవించినంత మాత్రాన, వివాహం ఎందుకు ఆగిపోవాలి! అది వ్యభిచరించటం' క్రిందకు వస్తుందనే భయం అక్కరలేదు. ఎందుకంటే, నేను మానవ మాత్రుడ్ని కాదు గనుక! మీ మానవుల ఆచారాలు మా దేవతలకు వర్తించవు! తెలిసిందా!" మైత్రా గద్దించి

పలికేసరికి, ఆ వ్యక్తి కిక్కురుమనలేదు.

"ఇదుగో అమ్మాయీ! నీవు నా మందిరానికి వెళ్ళి అన్నీ సిద్ధం చేయి! వెంటనే వెళ్ళు! నా ఆజ్ఞ ధిక్కరిస్తే, ఆ మేక గతే పడుతుంది ఎవరికైనా?" అన్నాడు మైత్రా హుందాగా.

అతడి మాటకు ఎవరూ ఎదురు పలుకలేదు. ఆటవికుల నాయకుడు ఆ యువతివంక చూసి, వెళ్ళమన్నట్టు సైగ చేశాడు. ఆటవిక యువతి బెదురుతూ లోపలకు వెళ్ళింది.

మైత్రా లోపలకు వెళ్ళి తలుపులు మూసుకున్నాడు. బయట అందరూ వెళ్ళిపోతూన్న అడుగుల చప్పుడు వినిపించింది.

ఎత్తయిన మిద్దె అవటంవలన గాలి బాగా వస్తూన్నది. మబ్బులు విడిపోయి, చంద్రుడు బైటకు వస్తూన్నాడు.

ఆటవిక యువతి బెదురుతూ ఒక ప్రక్కగా నిలబడింది. ఆమెను తినేసేలా చూస్తూ, చిరునవ్వుతో ఆమెను సమీపించాడు.

"అలా బెదిరిపోతావెందుకు? దేవతలతో సంపర్కం అంటే మాటలా? ఆ అవకాశం నీకే వచ్చిందంటే, నీవెంతో పుణ్యం చేసుకుని ఉండాలి!" అంటూ ఆమె చుట్టూ చేతులువేసి కౌగిట్లోకి తీసుకున్నాడు మైత్రా.

ఆ యువతిలో భక్తికన్న భయం ఎక్కువగా ఉంది. అతడి వద్దనున్న ఆయుధం శక్తివంతమైనది. కాదంటే తనను గూడ మేకను చంపినట్టు చంపేయగలడు. అందుకే కాదనలేదు అతడ్ని.

"ఇది మాత్రం అడ్డం ఎందుకు?" అంటూ ఆమె మొలకు చుట్టి ఉన్న చిన్న వస్త్రాన్ని లాగివేశాడు మైత్రా.

మైత్రాకు మాత్రం స్త్రీదాహం అమితంగా ఉంది. సరైన ఆడదాన్ని అనుభవించి రెండు నెలలు దాటింది. ఈ వజ్రాలను దొంగిలించే పథకాన్ని తయారుచేయటంలో నిమగ్నుడైపోయి, మరో సుఖానికి నోచుకోలేదు.

"స్త్రీని అనుభవించే సమయాల్లో నా దేవతాచర్మాన్ని వలిచేసి మామూలు మనిషిలా మారిపోతాను నేను!" అంటూ మైత్రా తన శిరస్త్రాణాన్ని ఊడదీశాడు. తన డ్రెస్ విప్పి భద్రంగా ఒక మూల దాచాడు. సైలన్సర్ని మాత్రం అందుబాటులో ఉండేలా తలగడ దగ్గరే ఉంచాడు.

"పడుకో!" అన్నాడు మైత్రా.

ఆ యువతి వెల్లకిలా పడుకుంది. భయంతో.

లేడిమీదకు దూకే పులిలా ఆమె మీదకు వాలి, ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు మైత్రా.

ఒక గంట తర్వాత వేడిగా, వాసనలు వెదజల్లే మేక మాంసం పంపబడింది. అవురావురుమంటూ తిన్నాడు మైత్రా.

కడుపు నిండాక, మైత్రా మళ్ళీ ఆ యువతిని ప్రక్క మీదకు లాగాడు.

# 6

మైత్రా ఒళ్ళుమరిచి నిద్రపోతున్నాడు.

అతడున్న మట్టిమిద్దె క్రింద గూడెంలోని పెద్దలందరూ గుంపుగా చేరారు. ఆటవికుల మంత్రవేత్త ఊరి శివార్లలో ఉన్న దేవీ ఆలయానికి వెళ్ళాడట! ఆ వచ్చినాయన నిజంగా గంధర్వుడు అవునో, కాదో కనుక్కొని రావటానికి వెళ్ళాడట అతగాడు.

అతడి రాకకోసం ఎదురుచూస్తూ, జనం అంతా గంధర్వుడు విడిసిన మిద్దె క్రిందభాగంలో సమావేశమైనారు. మంత్రవేత్త వయసు మళ్ళినవాడు. దేవీ గుడికి వెళ్ళి రావాలంటే ఆరుమైళ్ళు నడవాలి రానూ, పోనూ! అందుకు చాలా వ్యవధి పట్టవచ్చు.

ఆటవికుల్లో చాలామంది గంధర్వుడికి ప్రార్థనలు చేయసాగారు మనసులోనే. కొందరు పంటలు బాగా పండేలా చేయమని వేడుకుంటున్నారు. మరికొందరు తమ దీవికి శుభం కలగజేయమని కోరుతున్నారు.

ఆడపిల్లల తల్లిదండ్రులు మాత్రం "అయ్యా! గంధర్వుడుగారూ! మీరేమయినా కోరండి, మా అమ్మాయిల్ని మాత్రం అడగకండి!" అని దణ్ణాలు పెట్టుకుంటున్నారు.

ఒక మూలగా అందాల యువతి, నాయకుడి ఏకైక కుమార్తె 'జియ్యా' నిలబడి వుంది. ఆమె ప్రేమికుడు 'శరవేగం' గుంపులోనుంచి వచ్చి ఆమెను సమీపించాడు.

"జియ్యా! ఒకసారి అలా దేవతావృక్షం దగ్గరకు పోదాం రా! నీతో మాట్లాడాలి!" అన్నాడు శరవేగం.

జియ్యా చిలిపిగా చూసింది అతడివంక. "ఇప్పుడా? అక్కడికి వెళ్ళటం! మంత్రవేత్త తిరిగివచ్చే వేళయింది!" అంది.

దేవతావృక్షం చాటున ఇద్దరూ తనివిదీరా సుఖించేవారు. మళ్ళీ అందుకే పిలుస్తున్నాడు గాబోలు అనుకుంది జియ్యా. వాళ్ళిద్దరికీ ఏనాడో మనువు నిశ్చయమైపోయింది గూడా.

"అదికాదు జియ్యా! ఒక విషయం గురించి నీతో మాట్లాడాలి!"

జియ్యా అక్కడ్నుంచి కదలక తప్పలేదు. 'శరవేగం'ని అనుసరించింది.

గూడేనికి ఫర్లాంగు దూరంలో పెద్ద మఱ్ఱివృక్షం ఉంది. దాన్ని ఆటవికులు దేవతావృక్షం అని పిలుస్తారు. ఇద్దరూ ఆ చెట్టుచాటున ఒకరినొకరు ఆనుకుని కూర్చున్నారు.

"ఏమిటి నాతో మాట్లాడాల్సిన విశేషం?" అనడిగింది జియ్యా.

"అదే! నిన్న రాత్రి మన గూడెంలో దిగిన వ్యక్తి నిజంగా దేవలోకంనుంచి వచ్చినవాడేనంటావా?" తన మనసులోని శంకను బయటపెట్టాడు.

"అలా దేవతల్ని అనుమానించరాదు!" జియ్యా భయంగా అంది.

"తప్పేముంది? మనకు పూర్తిగా తెలియనిదాన్ని అనుమానించటంలో తప్పులేదు."

"ఇంతకీ నీవనేదేమిటి? అతడు దేవుడు కాదంటావా? మనందరం చూస్తూండగానే, అతగాడు అగ్నిగోళంనుంచి ఊడిపడ్డాడు. రథంలో ఆకాశంనుంచి భూమికి దిగాడు. అతడి చేతిలోని ఆయుధాన్ని చూశావుగా! నిప్పులు గ్రక్కుతూ వచ్చి మేక ప్రాణాల్ని తీసింది. ఎంతో దూరంనుంచి అతడు మేకను సునాయాసంగా చంపాడు. అలాంటి ఆయుధాన్ని వజ్రాయుధం అని ఒప్పుకోక తప్పదు. పైగా మన ఆయుధాలు అతడిని ఏమీ చేయవాయె!"

"కానీ నాకెందుకో అతడు గంధర్వుడని ఒప్పుకో బుద్ధికావటంలేదు."

"అందుకు ఏమైనా ఆధారాలున్నాయా?"

"లేవు. కానీ నా మనసుని నేను నమ్ముతాను."

"చూడు 'శరా'! మన దీవిలో నీకు శత్రువులు జాస్తి ఉన్నారు. ఇప్పుడు కొత్తగా వచ్చిన ఆ గంధర్వుడితో కూడ విరోధం తెచ్చుకున్నావంటే, నిన్ను నేను శాశ్వతంగా కోల్పోవలసిన ప్రమాదం వస్తుంది."

"నేను చనిపోతానన్న భయం ఎప్పుడూ లేదు. కానీ నాకిదో కొత్త భయం పట్టుకున్నది!"

"ఏమిటది?"

"ఆ గంధర్వుడు మన సంతతిలోని యువతులనందర్నీ అనుభవించనిదే ఊరుకోనేట్టు లేదు. నా అందాల జియ్యా అతడి చేతుల్లో పడటాన్ని నేను ఊహించలేకుండా ఉన్నాను. అతడి కళ్ళు నీమీద పడకముందే, మనిద్దరం ఈ దీవి వదలి ఎటన్నా పోదామా జియ్యా?" శరవేగం ఆవేశంగా పలికాడు.

"అమ్మో! అలా పారిపోతే ఇంకేమన్నా ఉందా? ఆటవికుల నాయకుడి కూతురు మరో యువకుడితో పరారయిందన్న అపఖ్యాతి వస్తుంది. పైగా అలా పారిపోతే, మనిద్దరిపై వ్యభిచార నేరం మోపబడుతుంది. ఈ చుట్టుపట్ల దీవుల్లో ఎక్కడ దాక్కున్నా, వెదికి పట్టుకుని శిక్షిస్తారు మన పెద్దలు."

జియ్యా ఇంకా ఏదో చెప్పబోయింది. అంతలోనే ఆటవికుల్లో రణగొణ ధ్వని రేగింది. ఇద్దరూ అటుగా తొంగిచూశారు. మంత్రశక్తి దేవీ ఆలయాన్నుంచి తిరిగి వస్తున్నాడు.

జియ్యా ఎగిరి దూకింది ఇవతలకు. "అడుగో మంత్రాల తాత వచ్చాడు. రా పోదాం!" అంటూ లేడిలా పరుగెత్తింది.

శరవేగానికి కూడా ఆమెను అనుసరించక తప్పలేదు.

ఇద్దరూ గుంపుదగ్గరకు చేరారు. జనంలోంచి రెండు కళ్ళు మాత్రం అప్పుడే అక్కడకు చేరిన వారిద్దరి వంకా తీక్షణంగా చూస్తున్నయ్. అతడు నాయకుడి బావమరది. పేరు చక్రేణుడు.

చక్రేణుడు కురచగా ఉంటాడు. నల్లగా బలిష్ఠంగా ఉండి, ఒక కాలు అవిటి అవడంవల్ల కొంచెం కుంటుతూ నడుస్తాడు.

వాడికి తల్లీ దండ్రీ లేరు. నాయకుడి పోషణలోనే పెరుగుతున్నాడు. కానీ వాడు కుదురుగా ఒకచోట పది కాలాలపాటు ఉండే రకం కాదు. ఇతర దీవుల్లోకి తరచూ పారిపోయేవాడు. అలా ఒకసారి చక్రేణుడు వేరే దీవికి పారిపోయినప్పుడు శరవేగంతో జియ్యా మనువు నిశ్చయమైపోయింది.

ఎప్పటికైనా జియ్యా తనదవుతుందనీ, తనే ఆ దీవికి నాయకుడవుతాడనీ కలలు గంటున్నాడు చక్రేణుడు అంతదాకా. అతడి ఆశలు అడియాసలయిపోయాయి. అందమూ, అవయవాల పొందికా ఉన్న జియ్యా పరుల పాలయింది. అటు నాయకత్వమూ దక్కలేదు.

అందుకే వాడు కొన్నాళ్ళనుంచీ ఎక్కడికీ కదలకుండా దీవినే అంటిపెట్టుకొని ఉన్నాడు. ఏదైనా అవకాశం వస్తే, శరవేగంతో నిశ్చయమైన మనువుని చెడగొట్టాలని చూస్తూన్నాడు. అటు శరవేగాన్ని మట్టుపెట్టటానికైనా వెనకాడేవాడు కాదు చక్రేణుడు.

కానీ శరవేగం అంటే దీవిలో చాలమందికి అభిమానం ఉంది. శరవేగంగాడు నీతిపరుడు, గుణవంతుడు. అతదే

ఆ దీవికి నాయకుడిగా తగినవాడని దీవిలోని ప్రజల అభి ప్రాయం. అందుకే చక్రేణుడి పన్నాగాలేవీ పారలేదు.

## 7

మంత్రాల తాత ఉరఫ్ మంత్రవేత్త దీవి చివరలో చిన్న కొండగుట్టమీదున్న దేవీ ఆలయానికి వెళ్ళాడు.

దేవి విగ్రహం దగ్గర పుష్పాన్నుంచి అయిదు నిముషాల పాటు ప్రార్థిస్తాడు. ఈలోపల పుష్పం క్రిందకు రాలిపోతే దేవి సమాధానం వ్యతిరేకమన్నమాట! పుష్పం అలానే నిలిచిపోతే దేవి అనుజ్ఞ ఇచ్చినట్లే లెక్క!

మంత్రవేత్త అలవాటు ప్రకారం పుష్పాన్ని దేవి పాదాలవద్ద ఉంచాడు. మోకరిల్లి నమస్కరించాడు. కొద్ది క్షణాలపాటు అలాగే ఉండిపోయాడు, అతడి రాకకోసం ఎదురుచూసే ప్రజలు మెదిలారు. ఆతృత ఎక్కువయింది.

కళ్ళు తెరచి చూశాడు మంత్రవేత్త! పుష్పం అలానే దేవి పాదాలవద్దనే ఉంది. అదే దేవి సమ్మతి క్రింద తీసు కుని హడావిడిగా లేచాడు. నిర్ణీత గడువు కాకుండానే పైకి లేచి, గుడి బయటకు వచ్చి తలుపులు మూసేశాడు.

వడివడిగా నడుస్తూ, గూడెం చేరుకున్నాడు.

"మన అదృష్టం బాగుండబట్టే దేవలోకవాసి మన మధ్య కొంతకాలం నివసించేందుకు వచ్చాడు!" అన్నాడు మంత్రవేత్త అందరివంకా చూస్తూ. ఎవరైనా మరో విధంగా వ్యాఖ్యానిస్తారేమో అని ఎదురుచూశాడు అతడు.

"అందుకు మనం వెనుక జన్మలో ఎంతో పుణ్యం చేసి ఉండాలి!" మరో వ్యక్తి అన్నాడు,

"కాకపోతే ఈ చుట్టుపట్ల ఇన్ని దీవులుండగా, అతడు మన దీవిలోకే ఎందుకు దిగాలి?" ఇంకో వ్యక్తి గంథ

ర్వుడిన్ని సమర్థించాడు.

"అతడికి ఏ లోటూ రాకుండా, అతిథ్యం ఇవ్వాలి మనం!" నాయకుడు గూడ అంగీకరించాడు.

అంతలో మరో ఆడగొంతు పలికింది. "ఏమిటి అదృష్టం? మనువు నిశ్చయమైన ఆడకూతుర్ని గంధర్వుడు బలిమితో అనుభవిస్తుంటే గుడ్లప్పగించి చూస్తుండడమేనా?"

"అవును! ఒక పెళ్ళికుమార్తె తల్లిదండ్రులం అడుగుతున్నాం!" ఆ యువతి తండ్రి ముందుకు వచ్చాడు.

గుంపులో ఎవరూ మాట్లాడలేదు. భయాశ్చర్యాలతో ఎవరికి వారే మౌనంగా ఉండిపోయారు. నాయకుడో, మంత్రవేత్తో ఎవరన్నా సమాధానం చెబుతారని చూస్తున్నారు.

అందరూ మౌనంగా ఉండటం గమనించిన శరవేగం నొక్కి అడిగాడు. "వాళ్ళ ప్రశ్నకు బదులిచ్చే నాథుడే లేడా?"

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. ఈ సంగతి గంధర్వుడికి తెలిస్తే అతడు కోపంతో ఎందర్ని చంపుతాడో అని భయపడుతున్నారు.

"అయితే సమాధానం చెప్పగల ప్రశ్న అడుగుతాను సరా?" నిశ్శబ్దాన్ని చీలుస్తూ మళ్ళీ శరవేగం అన్నాడు.

"ఏమిటా ప్రశ్న?" నాయకుడు కనుబొమలు ముడిచి అడిగాడు.

"మన అతిథి నిజంగా దేవలోకం వాడేనా అని?" శరవేగం నింపాదిగా అడిగాడు. ఎనలేని స్త్రీవ్యామోహం ఉన్నవాడు దేవుడంటే అతడు నమ్మలేకపోతున్నాడు.

ప్రక్కలో త్రాచుపాము పడ్డట్టుగా ఉలిక్కిపడ్డారు అందరూ.

కొందరు తమ సంభాషణను గంధర్వుడు వింటున్నాడేమో అని భయంగా మిద్దెపైకి చూశారు.

"మెల్లగా మాట్లాడండిరా! మన గోలకు గంధర్వుడు లేచి, మన తెలివితక్కువ సంభాషణను వినగలడు!" కొందరు పెద్దలు కసిరారు.

గుంపులో అంతవరకూ మౌనంగా సంభాషణను వింటున్న చక్రేణుడు ముందుకు వచ్చాడు.

"అసలు శరవేగాన్ని ఇక్కడనుంచి పంపివేయటం మంచిది. అతడి అనుమానాలతో గంధర్వుడికి కోపం తెప్పించటం ఖాయం. ఆయన మన దీవిని బూడిదచేయటం ఖాయం!" శరవేగంపై అభియోగాన్ని బలపరచి, అతడ్ని ఇక్కడనుంచి తొలగించటానికి మంచి అదను దొరికింది చక్రేణుడికి.

ఆ గంధర్వుడి మాటకు ఈ దీవిలో ఎదురులేదు. కనుక తను ఎలాగైనా అతిడి ప్రాపకం సంపాదించి, శరవేగంపై ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పి, కోపం తెప్పించితే, మరు క్షణంలోనే శరవేగం, గంధర్వుడి వజ్రాయుధం తునకకు బలి అవడం ఖాయం. దీవికి నాయకత్వం, జియ్యా వెచ్చని కౌగిలీ రెండూ లభిస్తాయి. ఒక దెబ్బకు రెండు పిట్టలు.

"అతడు దేవత అయివుండడని నా అభిప్రాయం! ఏ పిశాచమో, దయ్యమో ఈ రూపం ధరించి వచ్చిండేమో?"

ఆటవికుల్లో కొందరు అతడ్ని కొట్టడానికి ఉద్యుక్తులయారు.

నాయకుడు వాళ్ళను శాంతపరిచాడు.

"అందుకు నీకు నిదర్శనాలేమున్నాయ్ శరవేగం?" నాయకుడు ప్రశ్నించాడు.

"నా మనసు అలానే చెబుతోంది. లేదా అతడు మరో ప్రాంత మనిషి అయివుంటాడేమో! ఉత్తరదేశాల్లో మనుష్యులు మంచి వర్చస్సు, దేహచ్ఛాయ కలిగివుంటారని వినలేదూ?"

"ఇలా లేనిపోని అనుమానాల్ని సృష్టించి మా మతులు పోగొట్టకు! అతడు దేవుడు కాడని ధృవపరచే నిదర్శనం చెప్పు చూద్దాం!" మంత్రవేత్త కోపంగా అడిగాడు.

"అతడు నిజంగా గంధర్వుడు అయితే అమృతం త్రాగి ఉండాలి కదా? అలాంటివాడికి ఆకలిదప్పులవుతాయా?"

"ఓరి పిచ్చివాడా! ఇదా నీ చచ్చుప్రశ్న. దేవతలు మానవ లోకంలోకి వచ్చినప్పుడు అచ్చం మనుష్యులులాగే ప్రవర్తిస్తారు. మనలాగే తిని, త్రాగి నిద్రిస్తారు. మనిషిగా మారినపుడు మనిషిలాగే ఉండాలి కదా?" ఆటవిక వృద్ధుడొకడు బదులు చెప్పాడు.

మిగతావాళ్ళు వృద్ధుడ్ని బలపరిచారు.

"గంధర్వుడికి గూడా స్త్రీని అనుభవించాలనే వ్యామోహం ఎందుకుంటుంది?" శరవేగం మళ్ళీ అడిగాడు.

"దేవలోకంలో దేవతాస్త్రీలతో ఎల్లప్పుడూ సుఖిస్తుంటారు వాళ్ళు. అందువల్లనే అతడు ఇక్కడకు రాగానే, అపూర్వంకన్న స్త్రీనే ఎంచుకున్నాడు" మంత్రవేత్త మళ్ళీ చెప్పాడు.

"బాగానే ఉంది మీ అభిప్రాయం! ఇవాళ ఒక యువతీ, రేపు మరో యువతీ, ఇలా దీవిలోని స్త్రీలనంతా అతడు అనుభవిస్తుంటే మనం చూస్తూ ఊరుకోవలసిందేనా? మన నియమాలూ, కట్టుబాట్లూ మంటగలపాల్సిం

దేనా?'' శరవేగం ఆవేశంతో అన్నాడు. అతడి దృష్టిలో జియ్యా శీలత్వమే తారాడుతోంది.

"గంధర్వుడే చెప్పలా? మానవుల నియమాలు దేవతలకు వర్తించవని?'' గుంపు చివరలో వున్న వ్యక్తి అరిచాడు.

"ఈ శరవేగంగాడే మన దీవికి చేటు తెచ్చేలా ఉన్నాడు'' అని ఒక వృద్ధుడు కోపంగా అన్నాడు.

"మనలో మనం అనుమానాల్ని నివృత్తి చేసుకోవడంలో తప్పులేదు. అలానే ఇప్పుడూనూ! కొద్ది రోజులు శరవేగానికి గడువు ఇద్దాం! అప్పటికీ అతడూ గంధర్వుడు దేవుడు కాడని ఋజువు చేయలేకపోతే అతడ్ని మన ఆచారప్రకారం శిక్షించవలసివస్తుంది'' అన్నాడు నాయకుడు అందరినీ శాంతపరుస్తూ.

నాయకుడి మాటకు అందరూ కట్టుబడ్డారు.

అంతలో గంధర్వుడు నిద్రలేచాడన్న వార్త రావటంతో అక్కడ్నుంచి అందరూ ఎటు వాళ్ళటు వెళ్ళిపోయారు.

నాయకుడూ, మంత్రవేత్తా గంధర్వుడ్ని చూసేందుకు మిద్దె ఎక్కారు.

"నేను ముందే చెప్పానా? నీ మూర్ఖపు ప్రశ్నలకు విసిగి మన ప్రజలే నిన్ను హతమార్చి ఉండేవాళ్ళు, గంధర్వుడి దాకా నీ విషయం పోకముందే!'' జియ్యా కసిగా అంది శరవేగం వంక చూస్తూ.

శరవేగం అదోలా నవ్వాడు. "ఈ శరవేగం ఒంటరిగా చావడు. తనతో కొందర్ని చంపుతాడు. లేదా ఈ జియ్యా కోసం ప్రాణత్యాగం చేస్తాడు.''

"ఓయబ్బో! మాలావు వీరుడొచ్చాడు!" అంటూ జియ్యా తన ఇంటివేపు పరుగెత్తింది.

# 8

తమ కుమార్తెలు గంధర్వుడి దృష్టిలో పడకుండా ఉండాలని వాళ్ళని బయట తిరగనీయడంలేదు, ఆడపిల్లల తల్లిదండ్రులు. ఇంట్లోంచి బయటకు కదిలేందుకు వీల్లేకుండా కట్టడిచేశారు. దాంతో జియ్యా శరవేగాన్ని కలుసుకోవటానికి వీల్లేకపోయింది.

ఎత్తయిన దిబ్బమీద కూర్చున్నాడు శరవేగం. అతడికెదురుగా జియ్యా ఇల్లు ఉంది. ఏ కిటికీలోనుంచి అయినా ఆమె చిరునవ్వు కనబడుతుందేమో అని ఆరాటపడుతున్నాడు.

ఈ గంధర్వుడు రావటంవల్ల, దీవికి మేలు జరిగే మాటెలా ఉన్నా, తమ ప్రేమాయణానికి అడ్డుతగిలినందుకు అతడ్ని మనసులోనే తిట్టుకోసాగాడు శరవేగం.

"ఏం ఇక్కడ కూర్చున్నావ్? పిట్టల్ని కొట్టటానికా?" వెనకవైపునుంచి చక్రేణుడు అడిగాడు.

"ఓ! నువ్వా? నన్ను వెదుక్కుంటూ వచ్చావేం? ఏమిటో సంగతి?" శరవేగం ఈసడించాడు.

"నువ్వు నాకు బద్ధశత్రువువి కనుక!"

"నేను నీకేం ద్రోహం చేశానూ?"

"నాదనుకున్న జియ్యాను మాయజేసి నీ వలలో వేసుకున్నావ్! నాకు రావలసిన నాయకత్వం పదవికి నీవు అడ్డులుజాస్తున్నావ్!"

"జియ్యాలాంటి అందగత్తె నీలాంటి వికారినీ, అవిటివాడ్ని ఎలా చేసుకుంటుందనుకున్నావ్? అందచందాల్లో,

రూపసౌందర్యాల్లో నేనే ఆమెకు తగినవాడ్ని!" శరవేగం దూకుడుగా చెప్పాడు.

"అయితే ఆమెకోసం మనలో ఒకరం మరొకర్ని చంపుకోవాల్సి వస్తుందన్నమాట!" చక్రేణుడు ఇన్నాళ్లూ తన మనసులో అణచివుంచిన నగ్నసత్యాన్ని వెలికి గ్రక్కేశాడు.

"నేను నిన్ను చంపను!"

"అయితే నేనే చంపుతాను నిన్ను!"

శరవేగం అదోలా నవ్వాడు. "శౌర్యంలోనూ, పరాక్రమంలోనూ నీవు నాకు సాటివాడవు కావు! సమఉజ్జీ అయినవాళ్ళతో నే ఈ శరవేగం యుద్ధం చేస్తాడు!"

"నీ కండకావరం అంతవరకూ వచ్చిందన్నమాట. అయితే కాచుకో! ఇప్పుడే నిన్ను చంపుతాను!" అంటూ బొడ్లోంచి కత్తితీసి శరవేగంమీదకు వచ్చాడు చక్రేణుడు.

శరవేగం కదల్లేదు, మెదల్లేదు. "చూద్దాం అదీను!" అన్నాడు కూర్చున్న చోటునుంచి నింపాదిగా.

అతడి స్థైర్యాన్ని చూసి చక్రేణుడే ఆశ్చర్యపోయాడు.

ఎదురుతిరిగి పోరాడినా ఆశ్చర్యంలేదు అనుకున్న చక్రేణుడు, శరవేగం మౌనంగా ఉండటాన్ని చూసి మళ్ళీ వెనక్కి తగ్గాడు.

"ఎందుకింత శ్రమపడతావ్! జియ్యా, దీవి నాయకత్వం! ఈ రెంటిలో మనం చెరొకటి పంచుకుందాం! జియ్యా నాది! నాయకత్వం నీది! సరేనా?" శరవేగం మళ్ళీ అడిగాడు.

"నీ కపట నాటకాలు నా దగ్గర కాదు శరవేగం! జియ్యాని చేజిక్కించుకున్నాక, నాయకత్వాన్ని కబళిస్తావ్! నీవి పాము నాలుకలు!"

"అయితే ఏం చెయ్యమంటావు నన్ను? జియ్యా మనసుని నీ వైపు మళ్ళించుకో! ఆమె మనస్ఫూర్తిగా నిన్ను అంగీకరించిన రోజున, ఆమె నీదవుతుంది. మీ ఇద్దరి మార్గానికి అడ్డురాను నేను!" శరవేగం ఉపాయం చెప్పాడు.

"నీవు బ్రతికుండగా జియ్యా నన్ను అంగీకరించదు. అందుకే నిన్ను నా మార్గంనుంచి శాశ్వతంగా తొలగిస్తాను. ఈ భూమ్మీద నాలుగు కాలాలపాటు బ్రతకాలని ఉంటే, ఈ దీవినుంచి పారిపో!" చక్రేణుడు హెచ్చరికగా అన్నాడు. ఆ తర్వాత వడివడిగా అక్కడ్నుంచి కదలి పోయాడు.

# 9

గంధర్వుడు నిద్రలేచాడని తెలియగానే మంత్రవేత్త, ఆటవికుల నాయకుడూ అతడ్ని కలుసుకునేందుకు వెళ్లారు.

మంచంమీది పరుపుపై కాలుమీద కాలు వేసుకొని కూర్చున్నాడు మైత్రా. అతడికి నమస్కరించి ఒక ప్రక్కగా నిలబడ్డారు ఇద్దరూ.

ఆటవిక యువతి మైత్రా కాళ్ళదగ్గర కూర్చుని పాదాలు వత్తుతోంది. ఆమె ముఖం దించుకునే ఉంది, అవమానభారంతో.

నీతిగా బ్రతికే తనను గంధర్వుడు యథేచ్ఛగా అనుభవించాడు. ఇక అతడికి విసుగు కలగగానే తనను వెళ్ళగొట్టేస్తాడు. ఈ దీవిలో ఏ యువకుడూ తనను వివాహమాడేందుకు అంగీకరించడు. తను జీవించి మాత్రం ఉపయోగం ఏమిటి?

"నాకు ఈ రోజు ఆహారంగా రెండు కోళ్ళను వండించండి. తర్వాత ఈ చలిమిడి ముద్దలాంటి యువతి నా

కోదు. చలాకీగా ఉండే మరో యువతిని పంపండి. ఇక మీరు వెళ్ళవచ్చు!'' అన్నాడు మైత్రా దర్పంగా.

ఇద్దరూ తలలూపి బయటకు వచ్చారు. ఊరంతా గాలించి మరో యువతిని గంధర్వుడిని సంతోషపెట్ట టానికి పంపారు.

మొదటి యువతి పులిబోనులోంచి బయటకు వచ్చిన దానిలా ఇంటికేసి పరుగెత్తింది. తల్లి ఒడిలో తలదాచుకుని భోరున ఏడ్చింది.

శరవేగం ఆమెను పిలిచాడు. అక్కడే ఉన్న యువతి తల్లిదండ్రుల వంక చూస్తూ, ''నే నీమెతో ఒక రహస్యం మాట్లాడాలి! మీరు కాసేపు బయటకు వెళ్ళండి!'' అన్నాడు.

యువతి తల్లిదండ్రులు బయటకు వెళ్ళిపోయారు.

''నీతో అతడెలా ప్రవర్తించాడు? దేవుడి ప్రత్యేకత ఏమైనా కనుపించిందా? లేక మామూలు మనిషిలానే ప్రవర్తించాడా?''

ఆ యువతి ఒక్క క్షణం సందేహించింది. భయంగా అతడిని చూసింది.

''నీకేం భయం లేదు. అతడు దేవుడు కాదని నిరూపించేందుకు ఏవైనా ఆధారాలు దొరుకుతాయేమో అని వెదుకుతున్నాను. నీవు తెలిసిన సత్యాన్ని దాచకుండా చెప్పు. లేకపోతే ఆ మోసగాడు నిన్ను చేసినట్టే, ఈ దీవిలోని మిగతా యువతుల్ని బలవంతంగా అనుభవించ గలడు. దాన్ని నివారించాలనే నా తాపత్రయం!'' శర వేగం ఆమెకు నచ్చచెప్పాడు.

చివరి మాటకు ఆ యువతి చలించిపోయింది. తను

ఎటూ పాడయిపోయింది. కనీసం ఇతర యువతులనన్నా రక్షించగలిగితే బాగుండును అనుకుంది.

"గంధర్వుడు నాతో గడిపేటప్పుడు తన చర్మాన్ని ఉడుపులు విప్పినట్టుగా విప్పి, ప్రక్కనే ఉంచేవాడు. తలకున్న శిరస్త్రాణాన్ని గూడ తీసేసేవాడు! అతడి ప్రవర్తన సామాన్య మానవుడిలానే ఉంది." యువతి బెదురుతూనే చెప్పింది.

"మంచిది! నేనీ విషయం అడిగినట్టూ, నీవు నాకు ఈ సమాచారం చెప్పిన సంగతే మరచిపో! ఇక వెళ్ళు!" అన్నాడు శరవేగం.

# 10

నాయకుడూ, మంత్రవేత్తా ఆకాశంకేసి చూస్తున్నారు. ఎక్కడా మబ్బుతునక లేకుండా, ఆకాశం నిర్మలంగా ఉంది. ఎండవేడి నిప్పులు చెరుగుతున్నది.

"వానలు లేక పైరు ఎండిపోయేలా ఉన్నాయ్. ఇంకా వారంవరకూ వాన పడకపోతే త్రాగేందుకు నీళ్ళు గూడా ఉండవ్!" నాయకుడు విచారంగా చెప్పాడు.

"అంతదాకా ఎందుకు? రేపే 'సర్పనృత్యం'కై ఏర్పాట్లు చేద్దాం!" మంత్రవేత్త సమాధానం పలికాడు.

"అంతకన్నా గత్యంతరం లేదు!" అంటూ చుట్టూ ఉన్న పరివారంవంక చూశాడు ఆటవికుల నాయకుడు.

వాళ్ళంతా తలో దిక్కు పరుగెత్తారు. కొండగుట్టలూ, పుట్టలూ, కలుగులూ వెదికి రకరకాల పాముల్నీ పట్టుకొచ్చారు. అందుకోసం బుట్టల్లాంటివాటిని ఉపయోగించే ఆచారం లేదు వాళ్ళకు. పాము తోకబుచ్చుకుని తలక్రిందులుగా వ్రేలాడదీస్తూ తీసుకువస్తారు. మరో చేతిలో గరుడ

ఈకతో పాము తల పైకెత్తకుండానూ, తమను కరిచేందుకు యత్నించకుండానూ దాన్ని అదిలిస్తుంటారు.

ఆటవికులు తెచ్చిన పాముల్లో కాళింగసర్పాలూ, పచ్చటి నీటిపాములూ, కట్లపాములూ, అఖరుకు త్రాచుపాములు సైతం ఉన్నాయ్. వాటికి కోరలు పీకేసే ఆచారం వాళ్ళకు ఏనాడూ లేదు. అవి వానదేవుడికి చుట్టాలనీ, సర్పనృత్యం చేస్తే వాన తప్పకుండా పడుతుందనీ అక్కడి ఆటవికుల విశ్వాసం.

సేకరించుకువచ్చిన సర్పాలనన్నిటినీ ఒక ఇంట్లో బంధించారు. మంత్రవేత్త చుట్టూ అన్ని వేపులా గీతలు గీసి అవి పారిపోకుండా కట్టుబదేశాడు.

స్త్రీలందరూ నృత్యవాటికను శుభ్రంగా చిమ్మి, నీళ్ళు జల్లి చదునుచేశారు. నాయకుడూ, మంత్రవేత్తా, గంధర్వుడూ కూర్చునేందుకు ఎత్తయిన బండల్ని పేర్చారు.

మంత్రవేత్త నృత్యవాటికకు నాలుగువైపులా ఇసుకను చల్లి ఏవో మంత్రాలు చదివాడు. పాములు ఇసుకను దాటిపోలేకుండా మంత్రకట్టు కట్టాడని ఆటవికుల అభిప్రాయం.

ఆటవిక యువకులు ఒళ్ళంతా రంగు పూసుకుంటారు. ఆ తర్వాత తలా ఒక సర్పాన్ని తీసుకొని నృత్యంచేస్తారు.

పామును తలక్రిందులుగా వ్రేలాడదీసి, దాని తోకను పెదాల మధ్య ఇరికించుకుంటారు. పాము క్రిందకు వ్రేలాడేలా కొద్దిగా ముందుకు వంగుతారు. రెండు చేతుల్లోనూ గరుడపక్షి ఈకల్ని పట్టుకుని పాము తలవైపే దృష్టి ఉంచి, అది తమను కరిచే పరిస్థితి రాకుండా, ఈకలతో దాన్ని అదిలిస్తూ, భీకరంగా మ్రోగే తప్పెట్లకు లయగా

చిందులు త్రొక్కుతూ, వలయాకారంగా తిరుగుతుంటారు. ఇదే సర్పనృత్యం.

నృత్యవాటిక తయారయింది. ఆటవిక యువకులు పాముల్ని తేవటానికి ఉద్యుక్తులయారు.

అందులో చారకుడనే యువకుడ్ని ఇవతలకు పిలిచాడు శరవేగం.

"ఈ రోజు నేను గంధర్వుడి ప్రక్కనే కూర్చుంటాను" అన్నాడు శరవేగం.

"అతడు గంధర్వుడు కాదన్నావే?"

"ఆ విషయం నీ ద్వారానే ఇవాళ అటో, ఇటో తేలిపోవాలి!" శరవేగం రహస్యం చెప్పేవాడిలా పలికాడు.

"అదెలాగ?" చారకుడు ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"వలయాకారంలో తిరిగేటప్పుడు నీవు గంధర్వుడి సమీపంలోకి రాగానే, నీ నోట్లోంచి పాముని క్రిందకు జారవిడువు అతడి పాదాలమీద పడేలాగ. అతడు దాన్ని చూసి బెదిరితే అతడు కపటవేషం వేశాడన్నది ఋజువై పోగలదు!"

"అమ్మయ్యో! అతడికి కోపం వచ్చి, వజ్రాయుధంతో నన్ను చంపేస్తేనో?"

"నేను అతడి ప్రక్కనే ఉంటాను గదా? పొరబాటున పాము జారిందని సర్ది చెబుతాను సరా!"

"నీవు చెప్పినట్టే చేస్తాను. నాకేం మాట రాకుండా చూసే బాధ్యత నీది!" చారకుడు తలెగరేస్తూ వెళ్ళిపోయాడు.

## 11

ఒక ప్రక్క నాయకుడూ, మరో ప్రక్క మంత్రవేత్తా వెంటరాగా గంధర్వుడు తన బుల్లెట్‌ప్రూఫ్ డ్రెస్‌లోనే

వచ్చాడు. అతడి నడుముకి సైలెన్సర్ అందరికీ కనుపించేలా ఉంచుకున్నాడు. శిరస్త్రాణం మాత్రం ధరించలేదు. దాని అవసరం అంతగా లేదనుకున్నాడు గంధర్వుడి పాత్రలో ఉన్న మైత్రా.

ఇక్కడ తనకు ఏ లోటూ లేకుండా జరిగిపోతున్నది. అందరూ తనని దేవుడిలా కొలుస్తున్నారు. తన మాట వేదవాక్కులా ఆచరిస్తున్నారు. కడుపునిండా తిండీ, కోరిన స్త్రీ కౌగిలీ, కలకాలం అక్కడే ఉండిపోవాలనిపిస్తున్నది మైత్రాకు అప్పుడప్పుడు.

రాతి ఆసనంమీద కూర్చున్నాడు మైత్రా. తన ప్రక్కనే శరవేగం కూర్చోవటం అతడికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"నీవూ యువకుడివే కదా? నీవు నృత్యంలో పాల్గొనవా?" అని అడిగాడు గంధర్వుడు.

"మీకు తెలిసే ఉంటుంది. ఈ దీవిలో ప్రజలు కొలిచే దేవుళ్ళంటే నాకు నమ్మకం లేదు. అందుకే దేవతా ప్రార్థనల్లో, కొలువుల్లో నన్ను పాల్గొననివ్వరు." శరవేగం సంశయిస్తూ చెప్పాడు. "అంతేకాక దేవుడిలో నమ్మకం లేనివాళ్ళనే పాములు కరుస్తాయట! వానకోసం ఈ నృత్యం జరుగుతోంది. అందులో నేను పాల్గొంటే, దేవతలకు అనుగ్రహం కలగదు. అందువలన వర్షం రాకుండా ఆగిపోతుంది. దీవిలో కాటకం ఏర్పడుతుంది."

గంధర్వుడు ఒక్క క్షణం అతడి కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. శరవేగం చూపుల్లో తుష్కారభావం గోచరిస్తున్నది. చూపులతోనే అతడ్ని అంచనా వేశాడు గంధర్వుడు.

ఇంచుమించు శరవేగం గూడా తనంత ఎత్తూ, లావూ ఉన్నాడు. కాకపోతే మోటుగా ఉన్నాడు.

అనేకమంది ఆటవికులు తప్పెట్లతో వచ్చి నిలిచారు. ఇద్దరు వ్యక్తులు పిల్లనగ్రోవి నోటిదగ్గర పెట్టుకున్నారు. అవి పిడుగురాలిన చెట్టునుంచి తయారుచేయబడినవని చెప్పాడు మంత్రవేత్త.

చెవులు చిల్లులుపడేలా మ్రోగుతున్నాయ్ తప్పెట్లు. సర్పనృత్యంలో పాల్గొనేవారు ఒంటినిండా పాము ఆకృతులను చిత్రించుకున్నారు. కాళ్ళకు గజ్జెలు కట్టుకున్నారు. ఆ గజ్జెలు మ్రోగుతుంటే, చిటపట వాన చినుకుల ధ్వని వస్తోంది.

మంత్రవేత్త ఒక్కొక్కని దగ్గరకూ వచ్చి ఆతడి నోరు తెరచి పెదాల మధ్య పాము తోకను ఉంచాడు. వాళ్ళు వాటిని పెదాలతో నొక్కి పట్టారు. అలా అందరికీ తలా ఒక పాముని పంచాడు.

సర్పనృత్యం మొదలయింది. నృత్యం చేస్తూన్నవాళ్లు అడుగులు వేస్తూనే, తమ చేతిలోని గరుడపక్షి ఈకలతో పాము తలల దగ్గర విసురుతున్నారు. తప్పెట్ల ధ్వనికే పాములన్నీ భయంతో బిక్కచచ్చిపోతయ్. గరుడపక్షి ఈకలు చూసేసరికి వాటికి అసలే దిక్కుతోచదు. ఆ రకంగా పాములు తమను కాటువేయడానికి వీల్లేకుండా వాటిని అదుపులో ఉంచుతారు ఆటవికులు.

డప్పుల మ్రోత, శరీరం గగుర్పొడిచేలా, భయం కలిగించే సర్పాలూ, విచిత్ర ఆకారాల్లో ఆటవికులు, వాళ్ళ పాదాల చప్పుడికి నేల అదరటం ఇవన్నీ చూస్తుంటే చూపరులంతా మంత్రం వేసినట్టుగా స్థాణువుల్లా నిలబడిపోయారు.

అలా మూడు దఫాలు నృత్యం సాగింది. నాలుగో దఫాలో ఒక ఆటవికుడు తన ప్రియురాలి వేపు చూస్తూ ఒక్క క్షణం పాముని ఏమారాడు. అది వెంటనే అతడ్ని కాటు వేసింది. అతడి నోటి పట్టు సడలింది. పాము నేలకు జారి జరజర ప్రాకుతూ పోతోంది.

పాము కాటు వల్ల గంట్ల పడిన చోట నుంచి బొట్లు బొట్లుగా రక్తం స్రవించింది. అయినా ఎవరూ హాహాకారాలు చేయలేదు. గందరగోళం పడలేదు. నృత్యం అంతకన్నా ఆగలేదు.

మంత్రవేత్త వచ్చి పాముని పట్టుకున్నాడు మళ్ళీ. గాయపడిన ఆటవికుడు నోరు తెరిచాడు. అతడి పెదాల మధ్య పాముని ఉంచాడు మంత్రవేత్త. నెత్తురు కారుతున్నా, ఏమీ జరగనట్టే అతడు నృత్యంలో లీనమై పోయాడు, ఆ ఆటవికుడు. భగవంతుడిపై సంపూర్ణ విశ్వాసం ఉంటే, పాముకాటు కూడా తమనేం చేయదని వాళ్ళ విశ్వాసం.

ఒక్కోసారి తమ ప్రియురాలికి తన ప్రగాఢ ప్రేమను వ్యక్తం చేయడానికి గూడ ఆటవికులు అలా చేస్తుంటారని గంధర్వుడికి వివరించాడు మంత్రవేత్త. ఆమె ప్రేమ కోసం తను పాముకాటుని గూడ లెక్కచేయను, అని బుజావు చేయడానికే నట అది!

సర్ప నృత్యం అయిపోవచ్చింది. ఆఖరు దఫా నృత్యం అది! శరవేగం కళ్ళతోటే చారుకుడికి సంజ్ఞ చేశాడు. పాదాలతో నేలను తట్టుతూ, లయగా అడుగులు వేస్తూన్నాడు అతడు. గంధర్వుడి ముందుకు రాగానే అందరూ అతడివైపు తిరిగి అభివాదం చేస్తున్నట్లుగా, పాముని అలానే ఉంచుకుని, మరికొద్దిగా ముందుకు వంగుతున్నారు. తర్వాత మళ్ళీ నృత్యం లయలో పడుతున్నారు.

చారుకుడు అభివందనం చేస్తున్నట్టుగా గంధర్వుడి ముందర కొద్దిగా వంగాడు. అలా వంగటంలో అతడి నోట్లోంచి పాము జారి క్రింద పడింది. అది సరిగ్గా అతడి పాదాల ముందర పడింది.

ఆ సంఘటనకు గంధర్వుడి కిరుప్రక్కలా కూర్చున్న నాయకుడుగానీ, మంత్రవేత్తగానీ తొణకలేదు. గంధర్వుడు మాత్రం ఉలిక్కిపడి కాళ్ళు వెనక్కి లాక్కున్నాడు. జేబులోంచి రివాల్వర్‌ని తీసి పాముని కాల్చివేద్దామనుకున్నాడు. అంతలో అతడికి గుర్తుకు వచ్చింది. తన శరీరానికున్న ప్రత్యేకమైన డ్రెస్‌వలన, పాము కరిచినా తనకేమీ కాదని! దాంతో కూర్చున్న చోటు నుంచి కదలకుండా అలానే ఉండిపోయాడు.

మంత్రవేత్త లేచాడు. గరుడపక్షి ఈకను చూపుతూ, పాముని అదిలించాడు. దాని తోకను దొరకబుచ్చుకుని మళ్ళీ చారుకుని నోట్లో ఉంచాడు. గంధర్వుడు కోపగించి, ఏదైనా శిక్ష వేస్తాడేమో అని భయపడుతున్న చారుకుడు బ్రతుకుజీవుడా అంటూ నృత్యంలో లీనమై ముందుకు జరిగిపోయాడు.

సరిగా అదే సమయానికి మైత్రా దృష్టి స్త్రీల వరుసలో చాటుగా కూర్చున్న జియ్యామీద పడింది. ఆమె అందం అతడిలో రాక్షసప్రవృత్తిని రేపింది. తను దీవిలో దిగిన రోజునే ఆమెమీద కన్నేశాడు. కానీ ఆమె నాయకుడి కుమార్తె అని తెలిశాక కొంచెం నిదానించాడు. ముందే ఆమెను వాంఛిస్తే కథ అడ్డం తిరగొచ్చు.

అందుకని మిగతా యువతులు కొందరి వంతు అవంగానే, ఆమెకోసం కబురుచేయాలి. అప్పటికి ఆటవికులంతా

తన పద్ధతికి అలవాటుపడి ఉంటారు. ఎలాంటి గొడవా చేయకుండా నాయకుడి కుమార్తెను శోభనం పెళ్ళి కుమార్తెలా ముస్తాబుచేసి తన దగ్గరకు పంపుతారు.

మిగతా ఆటవికుల గుంపులోకి చూశాడు మైత్రా. అందరి దృష్టి సర్పనృత్యంమీదే ఉంది. శరవేగం చూపులు మాత్రం మాటిమాటికీ జియ్యామీదే నిలుస్తుండటాన్ని మైత్రా గమనించాడు.

శరవేగంవంక అసూయగానూ, జియ్యావంక ఆశగానూ చూస్తూన్న చక్రేణుడు కూడ గంధర్వుడి దృష్టిలో పడ్డాడు.

సర్పనృత్యం అయిపోయింది. స్త్రీలు ముంతల్లో పాలు తెచ్చి, మట్టిప్రమిదల్లో పోసి నేలమీదుంచారు. పాముల్ని వదిలేయించగానే, అవన్నీ అలిసిపోయి ఉన్న కారణాన, ఆవురావురుమంటూ పాల మూకుళ్ళ దగ్గరకు పోటీపడి పరుగులు దీసినయ్. పాలు గటగట త్రాగినయ్.

ఈ వింతచర్యలన్నిటినీ మందహాసంతో విచిత్రంగా చూస్తున్నాడు మైత్రా. ఎక్కడా కనీ వినీ ఎరుగనీ ఈ సర్పనృత్యం అతడికి విభ్రాంతిని కలిగిస్తోంది.

ఆటవిక యువకులు పాముల్ని తిరిగీ తీసుక వెళ్ళి పుట్టల దగ్గరా, గుట్టల్లోనూ వదిలేసి వచ్చారు.

అందరూ గంధర్వుడి చుట్టూ చేరారు.

"ఓ దేవదేవా! మా కొలుపులకు వానదేవుడు సంతోషించాడా? మా మీద అతడికి దయ గలిగిందా? త్వరలో వర్షం కురిపిస్తాడా?" మంత్రవేత్త అర్థిస్తున్నట్టుగా అడిగాడు.

"మీరు దేవలోకవాసులు గదా! మీ దేవతల ఆలోచనలన్నీ మీకు ఇక్కడున్నా గానీ తెలుస్తాయి గదా!" నాయ

కుడు గంధర్వుడి ప్రతిభను గుర్తు చేశాడు.

"అవునవును! ఎందుకు తెలీవు!" అంటూ తలూపాడు, గంధర్వుడు.

అతడి ముఖం మీద చిఱునవ్వు విరిసింది. "మీ పూజకు దేవతలు ప్రీతి చెందారు. వర్షం కొద్ది రోజుల్లో పడి తీరుతుంది!" అన్నాడు పెద్ద యోగీశ్వరుడిలా.

ఆ తర్వాత మళ్ళీ ఆకాశంవంక చూశాడు గంధర్వుడు. ఆకాశంలో నల్లమబ్బు కాదుగదా, తెల్లమబ్బు తునక కూడా లేదు. మరి వర్షం ఎప్పటికి రాను? తన మాట పొల్లుపోతే తన గతి ఏమవుతుందో?

గంధర్వుడు తిరిగీ తన మందిరానికి చేరుకున్నాడు. సుష్టుగా తిని, తనను సుఖపెట్టటానికి ప్రత్యేకించబడిన యువతి కౌగిలిలోకి ఒరిగిపోయాడు.

# 12

ఆ రోజు వేడుకలలో ఆటవికులందరూ బాగా అలిసి పోయారు. అందుకని రాత్రయేసరికి అందరూ గాఢనిద్రలో మునిగిపోయారు. రోజూ కన్న దీవి సద్దుమణిగింది—

మంత్రాల చెట్టు చాటున శరవేగం, జియ్యా తప్పించి. మంత్రవేత్తకు మాత్రం నిద్రపట్టలేదు. తన మంత్ర దండం చేతబట్టుకుని రచ్చబండమీదే కూర్చున్నాడు ఆకాశంలోని నక్షత్రాల్ని లెక్కిస్తున్నవాడిలా.

అర్ధరాత్రి కావస్తుండంగా ఝంఝామారుతంగా గాలి వీయసాగింది. ముత్యాల ముగ్గులు తీర్చినట్టుగా నక్షత్రాలతో మెరుస్తున్న ఆకాశాన్ని కారుమబ్బులు ఆక్రమించినయ్. పెద్ద పెట్టున ఉరుములతో, కళ్లు మిరుమిట్లు గొలిపే మెరుపులతో వర్షం ప్రారంభమయింది.

వర్షంలో తడుస్తూ, ఏవేవో మంత్రాలు వల్లిస్తూ, అలానే కూర్చుండిపోయాడు మంత్రవేత్త.

ఆ రాత్రి మొదలైన వాన, వరుసగా రెండు రోజులూ కుంభవృష్టి కురిసింది. దీవిలో అనకట్ట పైభాగంమీదనుంచి నీళ్ళు పొంగి పొర్లసాగాయి. చెరువులూ, బావులూ నిండి పోయాయి. గట్టునే ఉండి చేయి జాపితేనే అందు తున్నయ్ నీళ్ళు.

ఆటవికుల ఆనందానికి అంతులేదు. గత అయిదేళ్ళలో ఎరగనంత వాన పడింది.

ఇంత పెద్ద పెట్టున వాన పడటం గంధర్వుడి దయ వలననే అని ఆటవికులు నమ్మారు. ఫలాలు, తేనె మొద లైన కానుకలతో అతడి దర్శనానికి గుంపులుగుంపులుగా వచ్చారు. మరికొందరు తమ కుమార్తెల్ని సైతం వెంట బెట్టుకుని వచ్చారు, గంధర్వుడ్ని తృప్తిపరచేందుకు.

గంధర్వుడిపై ఆటవికుల్లో మరింత విశ్వాసం పెరగ టంతో శరవేగం పని మరీ ఇరకాటాన పడిపోయింది. గంధర్వుడ్ని ఏమాత్రం నిరసించినా, తనను ఆటవికులు నిలువునా చర్మం వలిచేటంత ఉద్రిక్తులుగా ఉన్నారు.

ఈ దీవిలోని ఆటవికులంతా సముద్రంలోకి దూకి చావనీయ్ గాక! తనకేం విచారం ఉండదు. కానీ గంధ ర్వుడి చేతిలో జియ్యా మలినమవటాన్ని మాత్రం తను జీవించి ఉండగా సహించలేడు, అనుకున్నాడు శరవేగం వేడి నిట్టూర్పులు విడుస్తూ.

అందుకే నిర్ణీతసమయాల్లో తప్ప ఇల్లు వదలి రావద్దని జియ్యాను అర్థించాడు శరవేగం. అలాగైనా ఆమె గంధ ర్వుడి దృష్టిలో పడకుండా ఉంటుందని అతడి అభి ప్రాయం.

కానీ జియ్యా గంధర్వుడి మనసులో ఏనాటినుంచో కల్లోలం రేపుతున్నదని అతడికి తెలియదు.

# 13

చక్రేణుడు చెట్టుక్రింద కూర్చున్నాడు ఏకాకిగా. అంబుతో నేలమీద పిచ్చిగీతలు గీస్తున్నాడు. గంధర్వుడి ప్రాపకం సంపాదించి, అటు నాయకత్వాన్నీ, ఇటు జియ్యానీ దక్కించుకోవాలనుకున్నాడు. కానీ రోజులు దొర్లిపోతున్నాయేగానీ, గంధర్వుడి దృష్టిలో పడలేదు తను. ఎప్పుడూ ఆయన వెంట నాయకుడూ, మంత్రవేత్తా అంటిపెట్టుకుని ఉంటారు. ఇక తను ఏకాంతంగా ఆయన్ని కలుసుకునే అవకాశం ఎక్కడుంది?

ఆటవిక యువకుడు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"నిన్ను గంధర్వుడు రమ్మంటున్నాడు!" అని చెప్పాడు రొప్పుకుంటూ.

చక్రేణుడు ఆశ్చర్యపోయాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టయింది. ఉన్నత శిఖరాల్ని ఎక్కినంతగా సంబరపడ్డాడు. అయినా తన సంబరాన్ని వెలిబుచ్చకుండా, విచారంగా చూశాడు.

"ఎందుకు? నేనేం తప్పు చేయలేదే?" అమాయకంగా అడిగాడు.

"అదేమో నాకు తెలియదు. ఉన్నపళాన నిన్ను పిలుచుకు రమ్మని ఉత్తరవు!"

అతడ్ని అనుసరించాడు చక్రేణుడు.

ఆటవిక యువతి ఒక మూలగా కూర్చుని ఉంది, చక్రేణుడు లోపలకు అడుగుపెట్టేసరికి. తెల్లని స్ఫటికం లాంటి ఉల్లిపొర చర్మంతో గంధర్వుడు ఇంకా అందంగా

కనుపించాడు అతడి కళ్ళకు. పరుపుమీద కాలుమీద కాలేసుకుని తనకోసమే ఎదురుచూస్తున్నాడు గంధర్వుడు.

చక్రేణుడు సాష్టాంగపడి నమస్కారం చేశాడు. తర్వాత వినయంగా చేతులు కట్టుకుని ఒక ప్రక్కగా నిలబడ్డాడు.

"దేవతల అభిప్రాయం ప్రకారం నీవే ఈ దీవికి నాయకుడివవుతావ్! కానీ నీకీ దీవి విషయాలే పట్టనట్టుగా తిరుగుతావేం?"

గంధర్వుడి మాటలకు చక్రేణుడు తబ్బిబ్బయిపోయాడు.

"ఏం చెప్పను స్వామీ! నా మనసుని ఒక యువతి ఆకట్టుకుంది. ఆ యువతిని మరో ద్రోహి వశం చేసుకున్నాడు. ఆమె దక్కలేదన్న విచారంతో నాయక పదవిపై వ్యామోహం గూడా తగ్గిపోయింది. ఇవన్నీ మీకు తెలుసుననుకుంటాను. కానీ నా బాధను వివరించుకున్నాను. ఆ తర్వాత తమ అనుగ్రహం!"

"ఎవరా యువతి? ఆమెను ఆకట్టుకుని నీకు ద్రోహం చేసినవాడెవడు?" గంధర్వుడు కోపంగా చూశాడు.

"మా నాయకుడి కుమార్తె జియ్యా, స్వామీ! ఆమెను తనవైపు మరల్చుకున్నాడు శరవేగంగాడు!"

"ఇదిగో! చిన్న నాయకా! నేను నీకు హామీ ఇస్తున్నాను. జియ్యా నీది. ఇందుకెవరన్నా అడ్డువస్తే, వాడ్ని నా వజ్రాయుధానికి బలిపెడతాను సరా!"

"తమని యావజ్జీవితం నా ఇలవేల్పుగా కొలుచునుంటాను!" అంటూ చక్రేణుడు మోకాళ్ళమీద కూర్చుని గంధర్వుడి పాదాలను కళ్ళకద్దుకున్నాడు.

"అయితే ముందుగా నీవొక పని చేయాల్సివుంటుంది. ఈ యువతిని పంపేయి. నీవే స్వయంగా వెళ్ళి జియ్యాను

నా మందిరానికి తీసుకురా! మూడు రాత్రుల్లో ఆమె మన సుని నీ మీదకు మళ్ళిస్తాను. ఆ తర్వాత శాశ్వతంగా జియ్యా నీది. దీవి నాయకత్వం నీది!'' అంటూ గంధర్వుడు సునిశితంగా చక్రేణుడివంక చూశాడు, జియ్యాను తన కప్పజెప్పేందుకు అతడేమైనా అభ్యంతరం చెబుతాడేమోనని.

కానీ చక్రేణుడు ఇది తనకు దొరికిన మహాదవకాశం క్రింద భావించాడు.

''తమ ఆజ్ఞను ఇప్పుడే నెరవేరుస్తాను!'' అంటూ అక్కడున్న ఆటవిక యువతిని వెంటబెట్టుకుని బయటకు నడిచాడు.

చక్రేణుడు నేరుగా నాయకుడివద్దకు వెళ్ళాడు. గంధర్వుడి ఆజ్ఞను వినిపించాడు. ఆ మాటలకు ఎవరూ ఆశ్చర్యపడలేదు. గంధర్వుడి మాటను కాదనగల ధైర్యం ఎవరికీ లేదు.

నాయకుడి కుమార్తె జియ్యా సైతం మారుమాటాడలేదు. గంధర్వుడి ఆచారానికి ఆటవికులంతా అలవాటు పడిపోయారు. పైగా గంధర్వుడి అనుగ్రహంకోసం ఎదురుచూస్తున్నారు చాలామంది కన్నెలు.

# 14

శరవేగం తన మిత్రుడితో దీవిలోని అడవుల్లోకి వెళ్ళాడు. వెదురుబొంగు నొకదాన్ని విరగదీసి దానికి ఏదో పసరు పూశాడు. దాంతో వెదురుబద్ద మంచి టెంక్షన్లోకి వచ్చింది. అడవిపిల్లి నారితో వెదురుబద్దను బలంగా వంచి విల్లుని తయారుచేశాడు. ఆ విల్లు అతడికన్న ఎత్తుగా ఉంది,

తరువాత అడివి అంతా శోధించి బాణాలకు సరిపోయే సన్నని గుండ్రటి కర్రల్ని సేకరించాడు. ఎండుపుల్లలతో నిప్పు రాజేశాడు. ఆ మంటలో ఇనుప ములుకుల్ని కాల్చి, సాగదీసి మొంచి వాడిగా ఉండేలా తయారుచేశాడు. ఆ ములుకుల్ని బాణాలకు గుచ్చాడు.

మిత్రులిద్దరూ ఆరుబయలులోకి వచ్చారు. మిత్రుడు తన చేతిలోని ఈటెను తన బలమంతా ఉపయోగించి గాలి లోకి విసిరాడు.

వాళ్ళ ఎదుట జువ్విచెట్టు ఒకటి ఉంది. ఈటె చెట్టు మీదుగా ఎగిరి చాలా దూరాన పడింది.

శరవేగం తను తయారుజేసిన వింటిని సారించి బాణం వదిలాడు. అది కూడా చెట్టుని దాటుకుని వెళ్ళిపోయింది. ఆ బాణాన్ని వెతుక్కుంటూ వెళ్ళారు మిత్రులిద్దరూ. ముందుగా ఈటె వాళ్ళకు దొరికింది. ఈటె ప్రయాణించిన దూరానికి రెట్టింపు దూరంలో బాణం దొరికింది.

శరవేగం తృప్తిగా చిరునవ్వు నవ్వాడు. మిత్రుడు అడవిలోకి వేలు పెట్టి చూపించాడు. దూరంగా లేళ్ళమంద పోతున్నది. లేడికి మనిషి వాసన తగిలితే చాలు, శర వేగంతో అందకుండా పారిపోతుంది.

శరవేగం మళ్ళీ తన బాణానికి పని చెప్పాడు. రివ్వున దూసుకువస్తున్న బాణం ధ్వనికి లేళ్ళమంద పరుగుతీసింది. ఒక లేడి నేల కూలింది.

శరవేగం, అతడి మిత్రుడూ ఇద్దరూ పరుగుదీశారు. లేడి శరీరంమీద బాణం లేదు. అతడు విడిచిన బాణం లేడి కడుపులోంచి దూసుకుపోయి అవతలెక్కడో పడింది.

శరవేగం బాణం అంచుకున్న లేడి రక్తాన్ని చూసి గర్వపడ్డాడు.

"ఓ బాణమా! నీవు గురితప్పకుండా పోవాలి ఈసారి! గురి తప్పిందో నా ప్రాణాలే పోతయ్!" అని బాణాన్ని ముద్దుపెట్టుకున్నాడు శరవేగం.

అతడి మిత్రుడు శరవేగం చర్యలకు అర్థం బోధపడక వింతగా చూస్తున్నాడు.

మరో బలమైన వెదురు కర్రకు లేడిని వ్రేలాడగట్టుకుని, కర్రను చెరొక వైపూ భుజాన మోస్తూ, తమ గూడెం వైపుగా నడిచారు ఇద్దరూ.

లేడిని చూస్తూనే ఆటవికులు నోరు చప్పరించసాగారు.

"శరవేగం ఇంట్లో ఇవాళ మాంఛి విందు అన్నమాట!" అనుకోసాగారు.

కొందరు మాత్రం శరవేగం చేతిలో ఉన్న కొత్త విల్లుని అసూయగా చూశారు.

"ఈ లేడిని గంధర్వుడి గారికి వండి పంపితేనో!" మంత్రవేత్త సూచించాడు. అందరూ అతడ్నే బలపరిచారు.

శరవేగం దృష్టి గంధర్వుడి మందిరంవైపు మరలింది.

జియ్యా వెంటరాగా చక్రేణుడు మందిరంవైపుగా వెళ్తున్నాడు. క్షణంలో పరిస్థితి అవగాహన అయింది శరవేగానికి.

## 15

"జియ్యా! ఆగు! ఎక్కడికి?" అంటూ ముందుకు పరుగెత్తాడు శరవేగం.

చక్రేణుడూ, జియ్యా ఆగిపోయారు స్థాణువుల్లా.

ఆటవికులంతా ఏం జరుగుతుందో అన్న ఆదుర్దాతో మందిరం చుట్టూ చేరారు.

ఠీవిగా మెట్లు దిగుతున్నాడు మైత్రా. జేబుల్లో చేతులు పెట్టుకుని, శరవేగం వంక క్రూరంగా చూశాడు. జియ్యా వైపు ఆకలిగా చూశాడు. చక్రేణుడి వంక హామీ ఇస్తున్నట్టుగా చూశాడు.

"జియ్యా! మెట్లెక్కి లోపలకు వెళ్ళు!" శాసిస్తున్నట్టుగా కంచు కంఠంతో పలికాడు మైత్రా.

జియ్యా మొదటి మెట్టు ఎక్కింది.

"జియ్యా! ఆగు! ఎక్కడికి! ఈ శరవేగం బ్రతికుండగా, నీపై ఎవరూ అధికారం చెలాయించలేరు!" శరవేగం ధైర్యం చూసి ఆటవికులే అబ్బురపడ్డారు.

జియ్యా ఆగిపోయి, వెనక్కి చూసింది. "నా కోసం నీ ప్రాణాల్ని బలి పెట్టుకోకు శరవేగం!" దిగులుగా అంది.

"నీవు వెళ్ళటానికి వీల్లేదు. అంతే కాదు! ఈ నాటి నుంచీ ఈ కాముకుని పశువాంఛను తీర్చేందుకు ఏ యువతిని వెళ్ళనీయరాదు" గంధర్వుడి వంక చూస్తూ ఆవేశంగా అన్నాడు శరవేగం.

"ఎంతమాట! సాక్షాత్తూ దేవుడ్ని పట్టుకుని ఇంతేసి మాటలంటావా? నీకు చావు తధ్యం. జియ్యా ఆ దేవుడ్ని తృప్తి పరచి పవిత్రతను సంపాదించుకోవటం కోసమే వెళ్తోంది," చక్రేణుడు మధ్యలో కలుగ జేసుకున్నాడు.

చక్రేణుడ్ని పురుగుని విదిలించినట్టుగా విదిలించి పారేశాడు శరవేగం.

"పోయే కాలం దాపురించిన వాళ్ళు దేవుడి మీదే కత్తి గడతారు. అయినా ఎందుకో నిన్ను చంప బుద్ధి

కావటం లేదు నాకు!" తన చేతిలోని సైలెన్సర్ అటూ ఇటూ సుతారంగా త్రిప్పుతూ అన్నాడు.

"చేతులు రాక కాదు. చేతకాక! మా దీవికి శనిలా నీవు దాపురించావు. ఏవో నూతన ప్రక్రియల ద్వారా మమ్మల్ని మాయ జేసి దేవుడ్నని చెప్పుకుంటున్నావ్!" శరవేగం ఆవేశంగా పలికాడు. "మా బాణాలు నిర్వీర్యం చేయలేకపోయానని గర్విస్తున్నావేమో! ఈ విల్లు ధాటికి నిలు చూద్దాం నీ బలం ఏ పాటిదో?" సవాలు చేశాడు శరవేగం.

మైత్రా వికటంగా నవ్వాడు. "నీ వెధవ బాణాలు దేవుడ్ని ఏం చేయగలవని?"

"దేవుడి జోలికి పోలేక పోవచ్చు. కానీ మనుష్యుల్నయితే చీల్చి చెండాడతయ్. ధైర్యముంటే నిలబడు నాతో ధాటిగా!"

"ఎంత పొగరు!" అంటూ పళ్ళు కొరుకుతూ తన వజ్రాయుధాన్ని అతడికి గురిపెట్టాడు.

"చంపు నన్ను! నాతో పోటీకి నిలువలేక, నన్ను చంపావని మా ఆటవికులు అప్పటి కన్నా గ్రహిస్తారు!" అన్నాడు శరవేగం.

గంధర్వుడు కళ్ళు చికిలించి చూశాడు. శరవేగం మాటల్లో దాగి వున్న నిజాన్ని గ్రహించాడు.

"సరే! నీ బాణాల్ని పరీక్షించుకో!" అంటూ గంధర్వుడు నిటారుగా నిలబడ్డాడు.

తన శరీరాన్ని బాణాలు ఛేదించలేని అత్యాధునిక తొడుగుని వేసుకుని ఉన్నాడు.

శరవేగం, గంధర్వుడి వంక చూశాడు. అతడి నెత్తికి శిరస్త్రాణంలేదు. దేవతా వస్త్రాలు తొడుక్కుని వున్నాడు.

అతడికీ తనకూ మధ్య వేగాన్ని అంచెనా వేసు కున్నాడు. గంధర్వుడి శరీరానికున్న తోడుగు ఎంత దుర్భేద్యమైనదైనా, తన బాణం ఛేదించుకుపోగలదన్న ధీమా ఉంది. తను కొత్తగా నిర్మించిన ధనస్సు అంత తెంపరిమీద ఉంది. లేడి శరీరంలో తూటుపొడిచి, అవతలి వేపుకి దూసుకుపోయిన బాణాన్ని స్మరణకు తెచ్చు కున్నాడు శరవేగం.

చుట్టూ రెండు వైపులా చేరిన జనం వంక చూశాడు శరవేగం. నాయకుడూ, మంత్రవేత్తా, జియ్యా, అందరూ ఉన్నారు. మరోప్రక్క చక్రేణుడు చేతిలో బల్లెంపుచ్చు కుని క్రూరంగా చూస్తూ నిలబడ్డాడు.

గంధర్వుడు తూష్ణీభావంతో చిరునవ్వు నవ్వుతు న్నాడు.

శరవేగం నారిని సవరించాడు. అంబుల పొదిలోంచి బాణాన్ని లాగి ధనస్సులో సంధించాడు.

"త్వరగా కానియ్!" అంటూ గంధర్వుడు తొందర చేశాడు.

విల్లుని పైకెత్తి, నారిని ఆకర్ణాంతం లాగాడు శరవేగం. ఊపిరి బిగబట్టాడు. గుండెల్లో వేలకొలది బాకాలు మ్రోగు తున్నయ్.

బాణం రివ్వున గాలిలో దూసుకుపోయింది. వేగంతో వెళ్ళి గంధర్వుడి కడుపులో తగిలింది. అందరూ ఆతృతగా చూస్తున్నారు. బాణం గంధర్వుడికి తగిలి, అతడి పాదం చెంతనే క్రింద పడిపోయింది.

జనం అందరూ గొల్లుమన్నారు. గంధర్వుడు సిగ్గి నందుకు కొందరు అరిస్తే, మరికొందరు శరవేగం దురదృష్టా నికి గేలిచేశారు.

అయితే శరవేగం ఇవేవీ ఆలోచించే స్థితిలో లేడు. అతడికీ, మృత్యువుకూ మధ్య చాలా కొద్ది క్షణాలే ఎడం ఉంది. ఈ కొద్ది క్షణాలే తనకు అపురూపమైనవి.

విజయగర్వంతో గంధర్వుడు అట్టహాసం చేస్తున్నాడు. అతడి చూపులు జియ్యా మీద కేంద్రీకరింపబడినై. చూపులతోనే ఆమెను తినేసేవాడిలా చూస్తున్నాడు.

రెప్పపాటులో కన్నుమూసి తెరిచేంతలో మెరుపులా పనిచేశాడు శరవేగం. అతడు తన అంబుల పొదిలోంచి మరో బాణాన్ని తీయటంగానీ, దాన్ని సంధించి వదలటం గానీ ఎవరూ గమనించలేదు.

శరవేగం విడిచిన రెండో బాణం అతడు నిర్ణయించుకున్న లక్ష్యానికి తగిలింది సూటిగా!

అనుకోని ఈ హఠాత్సంఘటనకు గంధర్వుడు గావుకేక పెట్టాడు. ఇనుపములుకు గల బాణం అతడి కంఠాన్ని ఛేదించుకుపోయింది. అతడి తల సగం తెగి, మొండెం నుంచి వ్రేలాడుతోంది రక్తం స్రవిస్తూ. ఎంతో భీభత్సంగా కనబడే ఆటవికులకు సైతం ఆ దృశ్యం చూస్తుంటే గుండె లవిసిపోయాయి. క్రిందపడి రక్తపు మడుగులో గిలగిల కొట్టుకుంటున్నాడు కొద్దిరోజులు గంధర్వుడుగా వెలిగిపోయిన మైత్రా.

ఆటవికుల నాయకుడు తన కత్తితో గంధర్వుడి కంఠాన్ని పూర్తిగా తెగనరికి, దాన్ని మొండేన్నుంచి పూర్తిగా వేరుచేశాడు.

శరవేగం పరుగెత్తుకుంటూ వెళ్ళి గంధర్వుడి మొండేని కున్న అద్భుత ఉడుపుల్ని లాగేశాడు. దాన్ని తను ధరించాడు.

"ఇప్పుడు మీరెవరైనా నా శరీరంమీదకు బాణాలు వేసినా, అది ఈ విచిత్ర చర్మాన్ని ఛేదించలేవు. అలాగని నేనే గంధర్వుడినంటూరా?" నోరు తెరుచుకుని విచిత్రంగా చూస్తున్న ప్రజల నుద్దేశించి పలికాడు శరవేగం.

"నీవు చెప్పిందీ నిజమే! కానీ ఈ మోసగాడు ఆకాశం నుంచి ఊడిపడటం, మండుతూన్న అగ్నిగోళంనుంచి క్రిందకు రావడం, మనిషిని గురిచూసి నిప్పులు కురిపించే ఆయుధాన్నుపయోగించటంవలన అతడు మానవమాత్రుడు కాడని, దేవతామూర్తని నమ్మాం మనందరమూను!" అనునయంగా పలికాడు నాయకుడు.

అక్కడ జేరిన ప్రజలంతా ఏకకంఠంతో అరిచారు "శరవేగానికీ జై!" అంటూ.

నాయకుడు అతడి భుజం తట్టాడు ఆప్యాయంగా. "నీలో నాయకుడికుండవలసిన లక్షణాలన్నీ ఉన్నాయ్. నా తర్వాత ఈ దీవికి నిన్నే నాయకుడిగా అభిషేకిస్తున్నాను!" అన్నాడు.

మంత్రవేత్త ముందుకు వచ్చి ఏవో మంత్రాలు చదివాడు. శరవేగం తర్వాత నాయకుడుగా నిర్ణయం రూఢీ చేయబడింది.

"నీ ధైర్యసాహసాలకు నా బహుమానం ఇదుగో!" అంటూ జియ్యా చేతిని శరవేగం చేతిలో ఉంచాడు నాయకుడు. "వచ్చే పౌర్ణమి రోజే మీ కళ్యాణం జరుగుతుంది."

అందరూ మరోసారి జేజేలు పలికారు.

చనిపోయిన కపట గంధర్వ వేషధారి,' మైత్రా బుల్లెట్ ప్రూఫ్ డ్రెస్‌లోంచి సైలెన్సర్‌ని వెలికితీశాడు

శరవేగం. దాన్ని భూస్థాపితం చేశారు.

ఆ తర్వాత మరో జేబులో అపూర్వమైన వజ్రాలు దొరికాయి. ఎండలో అవి ధగధగాయమానంగా ప్రకాశిస్తున్నయ్. అవి వజ్రాలని తెలుసుకోలేదు ఆటవికులు, కానీ ఆ రాళ్ళు అపూర్వమైనవని మాత్రం గ్రహించారు.

అందరూ కలసి ఆలోచించి, ఆ అపురూపమైన రాళ్ళను దేవీ విగ్రహానికి అలంకరించాలని నిర్ణయించారు.

మహావీరుని విగ్రహంనుంచి తస్కరింపబడిన వజ్రాలు తిరిగీ మరో దేవతా విగ్రహాన్ని అలంకరించాయి.

—: ఐపోయింది :—

# నకిలీ జన్మ

శ్రీరాజ్

రివాల్వింగ్ చెయిర్‌లో అటునుంచి ఇటు, ఇటునుంచి అటు తిరుగుతూ, సీలింగ్ వైపు చూస్తూ ఏదో ఆలోచి స్తున్నాడు ప్రఖ్యాత మనస్తత్వవేత్త ప్రొఫెసర్ హర నాథ్.

ఇంతలో కాలింగ్ బజర్ మ్రోగింది. తన ఆలోచనలకు స్వస్తి చెప్పి "యస్, కమిన్!" అన్నాడు చేతిలోని సిగ రెట్టును ఆష్‌ట్రేలో పడేస్తూ.

స్ప్రింగు డోర్స్ నెట్టుకొని ఒక నడివయస్కుడు, అతని వెనకాలే ఒక ఆడమనిషి వచ్చారు లోపలికి.

నడివయస్కుడు లోపలికి వస్తూనే ప్రొఫెసర్ హర నాథ్‌కి నమస్కరించాడు. ఆయన ప్రతినమస్కారం చేసి వారికి కుర్చీలు చూపించాడు.

వాళ్ళవంక పరీక్షగా చూసాడు ప్రొఫెసర్ వారనాథ్. వారిద్దరి ముఖాలలో విచారం దోబూచులాడుతున్నది.

"చెప్పండి. నానుంచి మీకు ఏం సహాయం కావాలి?"

నడి వయస్కుడు కళ్ళజోడు సవరించుకుని చెప్ప సాగాడు:

"నా పేరు గోపాలరావు. ఈమె నా భార్య సుశీల. మాది కొండపల్లి. మాకు ఒక్కడే కొడుకు ఉన్నాడు. పేరు రమేష్. ఇప్పుడు నేను చెప్పబోయేది నా కొడుకు రమేష్ గురించి" అని ఒక్క క్షణం ఆగాడు గోపాల రావు.

"మా వాడికి చిన్నప్పుడే, అంటే తొమ్మిదేళ్ళ వయ సులో ఉన్నప్పుడు, మా యింటి ప్రక్కన ఉండే రాజీ అనే అమ్మాయితో స్నేహం ఏర్పడింది. ఆ పిల్లకు అప్పుడు ఆరేళ్ళు వయసు ఉండేది. రోజూ యిద్దరూ కలసి బడికి పోయేవారు. తిరిగి యిద్దరూ కలసి వచ్చేవారు. ఆ వయసు లోనే వారు ఒకరిని విడిచి ఒకరు ఉండేవారుకారు. ఇరవై నాలుగు గంటలూ ఏదో ఒకటి చేసేవాళ్ళు యిద్దరూ కలిసి. అంటే ఆడుకోవడమో, చదువుకోవడమో యిటు వంటివి___"

చెప్పటం ఆపి "మొదట్నించి చెపితే మీకు కేసు బాగా అర్థమవుతుందని యిదంతా చెబుతున్నాను." అన్నాడు గోపాలరావు.

"ఫరవాలేదు చెప్పండి. అన్ని వివరాలు తెలిస్తే మాకు కూడ సులువుగా ఉంటుంది" అన్నాడు ప్రొఫెసర్ వార నాథ్.

తిరిగి చెప్పసాగాడు గోపాలరావు. "ఒక రోజు యిద్దరూ మామూలుగానే బడికి వెళ్ళారు. ఇంటర్వల్ లో

మంచినీళ్లు త్రాగుదామని బడి ఆవరణలో వున్న బావి దగ్గరకు వెళ్ళారు. మా వాడు నీళ్ళు తోడతానంటే 'వద్దు. రోజూ నువ్వే తోడుతున్నావు. ఈ రోజు నేను తోడతాను' అని చెప్పి రాజీయే నీళ్ళు తోడటానికి సిద్ధమయింది. ఆ బావికి గిలక లేదు. వంగుని తోడాలి.

రాజీ నీళ్ళు తోడసాగింది. బకెట్టు బరువు ఎక్కువై నీళ్ళు తోడలేక చేతిలోని తాడును జారవిడచింది. ఆ జారుతున్న తాడుతోపాటు ఆ విసురుకి తాను కూడ వెళ్ళి బావిలో పడింది.

రాజీ బావిలో పడగానే పిల్లలందరూ పెద్దగా కేకలు పెడుతూ వచ్చి వాళ్ళ టీచరుకు చెప్పారు. ఆ టీచరు ముసలాయన. ఈత కూడ రాదు. బడి ప్రక్క వున్న ఇళ్ళలోని మనుష్యులను పిలిపించి, బావిలోకి దింపి, రాజీని బయటకు తీసారు.

కానీ ఆ చిన్నారి ప్రాణం అప్పటికే ఈ లోకాన్ని వదలిపోయింది.

ఆ రోజునుంచి మా వాడికి బాగా దిగులు పట్టుకుంది. రాజీ శాశ్వతంగా దూరం అయిందని తెలిసిన తరువాత అన్నం కూడ తినటం మానివేసాడు. ఆ రోజునుంచి బడికి వెళ్ళటం కూడ మానివేసి, దిగులుతో మంచం ఎక్కాడు. చాలామంది డాక్టర్ల దగ్గరకు తీసుకువెళ్ళాము. కాని వాడికి జబ్బు నయం కాలేదు.

కాలమే వాడిని బాగుచేయాలి అని ఇంటికి తీసుకొచ్చాము.

ఆ తరువాత ఒక సంవత్సరం అలాగే ఉన్నాడు. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. అన్నం కూడ తనకు

యిష్టంవచ్చినప్పుడు, తినాలనిపించినప్పుడు వచ్చి తిని వెళ్ళేవాడు.

అటు తర్వాత రాజీని పూర్తిగా మరచిపోయాడు. పైకి మాత్రం బాగానే ఉన్నట్లు ఉండేవాడు. మళ్ళీ బడికి వెళ్ళటం, చదుకోవటం అన్నీ సక్రమంగానే జరగ సాగాయి.

అయితే, సరిగ్గా రాజీ చనిపోయిన పది సంవత్సరముల తర్వాత—ఒక రోజు హఠాత్తుగా 'నాన్నా! నాకు రాజీ కనిపించింది' అన్నాడు. ఆ మాటకు నేను చాలా విస్తు బోయాను.

'అదేమిటిరా, రాజీ చచ్చిపోయి పది సంవత్సరాల పైన అవుతుంటే, ఇప్పుడు నీకు రాజీ కనిపించడమేమిటి, ఏదన్నా కలగన్నావేమో!' అని అన్నాను.

'కల కాదు నాన్నా! నిజంగా రాజీ నాకు కనపడింది. నాతో మాట్లాడింది కూడ. నాన్నా! రాజీ కూడ ఇప్పుడు నాలాగే పెద్దదయింది. అదీగాకుండా యిప్పుడు ఓణీలు వేసుకుంటున్నది' అన్నాడు వాడు సిగ్గు, సంతోషం మిళితంచేసి.

వాడికి ఏమని చెప్పాలో నాకు అర్థంకాలేదు. వాడు భ్రమపడుతున్నాడేమో అనుకొన్నాను. ఒక రోజున వాడు తన గదిలో కూర్చొని ఎవరితోనో మాట్లాడు తున్నాడు. వాడు మాట్లాడేది ఎవరితోనో కాదు, రాజీ తోనే. నేను వాడి గదిలోకి తొంగిచూసాను ఆశ్చ ర్యంగా. కాని అక్కడ నాకు ఎవ్వరూ కనబడలేదు. వాడు రాజీని ఉద్దేశించి మాట్లాడుతున్నాడు. వాడికి కన పడుతున్న రాజీ నాకు ఎందుకు కనిపించటంలేదు. నాకు వెంటనే ఒక అనుమానం వచ్చింది. రాజీకి యింకా మా

వాడిమీద ప్రేమ నశించకుండా ఉండి దయ్యంగా మారి వాడితో మాట్లాడుతుందేమోనని—"

"ఎక్స్క్యూజ్ మి, మీలాంటి సైకాలజిస్టులకు దయ్యం అంటే నమ్మకముండదనుకొంటాను. నాకు కూడ దయ్యం 'ఉంది, లేదు' అని రూఢిగా తెలియదు. ఎటూ తేల్చుకో లేక చివరకు ఆ విధంగా అనుకున్నాను" అన్నాడు గోపాలరావు మధ్యలో చెప్పటం ఆపి.

"దానికేంగాని లెండి. ఎవరి నమ్మకాలు వాళ్ళవి. మీరు చెప్పేది చెప్పండి" అన్నాడు హరనాథ్ సిగరెట్టు వెలిగించుకుంటూ.

"—రాజీ దయ్యంగా మారిందనుకొని ఒక భూత వైద్యుడ్ని పిలిపించి సంప్రదించాను.

అతను ఏవో కొన్ని మంత్రాలు చదివి, కాస్త హంగామా చేసి చివరికి 'రాజీ దయ్యంగా మారిందని, ఇప్పుడు యుక్తవయసులో ఉన్న ఆ దయ్యానికి కామం ఎక్కువగా ఉంటుందని, ఆ దయ్యం యిప్పుడు మీ వాడితో సంభోగించాలని అనుకొంటున్నదని, అలా దయ్యంతో సంభోగం జరిపితే మీ రమేష్ ఒక్క సంవత్సరంకంటె ఎక్కువ బతకడని, అందుకని ఏమాత్రం ఆలస్యం చేయకుండా భూతవైద్యం మొదలుపెడితే మీ వాడిని ఆ దయ్యం వదలి వెళ్ళిపోతుందని' చెప్పాడు ఆ భూతవైద్యుడు.

అతను చెప్పింది విని మాకు చాలా భయంవేసింది. రాజీ దయ్యాన్ని పోగొడ్తానని చెప్పి మా చేత కొన్ని వేలు ఖర్చు పెట్టించాడు.

ఎంత డబ్బు ఖర్చుపెట్టినా మావాడు రాజీతో మాట్లాడటం మానలేదు.

చివరకు మాకు ఆ భూతవైద్యుడిమీద అపనమ్మకం ఏర్పడి, అతని వైద్యాన్ని మాన్పించాము.

అటు తర్వాత చాలామంది దగ్గరకు తీసుకెళ్ళాము. ఎంతమందికి చూపించినా, ఏమి చేసినా వాడుమటుకు రాజీతో మాట్లాడటం మానలేదు.

ఈ నెల రోజుల్లో వాడు సగం తగ్గిపోయాడు. ఇక ప్రతి రోజు అలాగే ఉంటే యిక మాకు దక్కడని పిస్తుంది.

అటువంటి సమయంలో నా చిన్ననాటి స్నేహితు డొకడు విజయవాడనుంచి వచ్చాడు. నా స్నేహితునికి ఈ సంగతంతా వివరించాను. అంతా విన్న తరువాత మీ గురించి చెప్పాడు. మీ దగ్గరకు వస్తే రమేష్ బాగుపడతా డని చెప్పాడు.

నా స్నేహితుడు ఈ మాట చెప్పగానే బయలుదేరి వచ్చాను.

మా వాడి గురించి యధార్థం మొత్తం మీకు చెప్పాను. ఎంత డబ్బు ఖర్చయినా సరే మీరు మళ్ళీ నా కొడుకుని మనిషిని చేయాలి. ఆ భారం అంతా మీ మీదనే పెడు తున్నాను.'' అన్నాడు గోపాలరావు జీరవోయిన గొంతుతో.

''మీరు ఏమి బాధపడకండి. ఈ కేసు బాగా స్టడీ చేసి, మీ వాడికి తప్పక నయంచేస్తాను. ఆ బాధ్యత నాది. మీ అడ్రసు యిచ్చి వెళ్ళండి. సరిగ్గా వారం రోజుల తర్వాత మీ యింటికి వస్తాను. వచ్చే ముందు ఉత్తరం వ్రాస్తాను. కాని ఒక్క మాట. నేను సైక్రియా టిస్టనని, నేను మీ వాడి గురించి అక్కడకు వచ్చానని తెలియకూడదు. ఒక చుట్టంలాగానో, లేక ఒక ఫ్రెండు

లాగానో నన్ను మీ వాడికి పరిచయం చేయండి" అన్నాడు హరనాథ్.

"అలాగేనండీ! మీరు ఎంత త్వరగా వస్తే మాకు అంత రిలీఫ్ వస్తుంది" అని కుర్చీలోంచి లేచాడు గోపాలరావు. అతని భార్య కూడ లేచి నమస్కరించింది.

ప్రొఫెసర్ హరనాథ్ దగ్గిర సెలవు తీసుకొని వెళ్ళి పోయారు గోపాలరావు దంపతులు.

## 2

గోపాలరావు దంపతులు వెళ్ళిపోయిన తరువాత ఆ కేసుకి సంబంధించిన కొన్ని పుస్తకాలను తీసి తిరగవేయ సాగాడు ప్రొఫెసర్ హరనాథ్.

అంతలో అతని అసిస్టెంట్ కుమార్ వచ్చాడు.

"ఏం బాస్! ఏమిటి విశేషం? ఏదన్నా కేసు స్టడీ చేస్తున్నారా?" అడిగాడు కుమార్ కుర్చీలో కూర్చుంటూ.

అప్పటిదాకా చదువుతున్న పుస్తకం మూసేసి కుమార్ వంక చూసి "అవును. ఇందాకనే ఒక క్లయింట్ వచ్చి వెళ్ళాడు. అతను చెప్పిందంతా రికార్డ్ చేసాను. విని నీ అభిప్రాయం చెప్పు" అని ప్రక్కనే వున్న టేప్ రికార్డర్‌ని 'ఆన్' చేసాడు హరనాథ్.

టేప్ రికార్డర్‌లోంచి వస్తున్న మాటలు పూర్తిగా విని, శూన్యంలోకి చూస్తూ, ఏదో ఆలోచించసాగాడు కుమార్.

"బాస్! నా కొక చిన్న అనుమానం."

"ఏమిటది?"

"ఏం లేదూ! రమేష్‌కి చిన్నప్పటినుంచి దయ్యాలంటే నమ్మకమేమన్నా ఉందా?" అడిగాడు కుమార్.

"ఎందుకు?" ప్రశ్నించాడు హరనాథ్.

"అతనికి చిన్నప్పటినుంచే చనిపోయినవారు దయ్యా లయిపోతారని పెద్దవాళ్ళు అనుకొంటున్నప్పుడు విని, దయ్యాలున్నాయని భ్రమపడి, అతని రాజీ కూడ చని పోయి, దయ్యంగా మారి అతనితో బాటే పెరుగుతున్న దేమోనని వూహించుకొంటూండాలి. అదే నిజమయితే ముందు అతనికి దయ్యాలు లేవని, అదంతా మానవులు ఏర్పరచుకొన్న భ్రమ అని అతనికి తెలియపరచాలి. మనం గనక దయ్యాలు లేవని నిరూపిస్తే అతను బాగుపడినట్లే!" అన్నాడు కుమార్.

ప్రొఫెసర్ హరనాథ్ చిన్నగా నవ్వి, సిగరెట్టు వెలి గించుకొని గట్టిగా పొగ లోపలకు పీల్చి "నువ్వు ఊహించి నట్లు అతనికి నిజంగా దయ్యాలంటే నమ్మకముండి, రాజీ దయ్యం తనతోపాటే ఎదుగుతున్నట్లు వూహించుకొంటూ ఉంటే, నువ్వు చెప్పినట్లే అతనికి దయ్యాలు లేవని మనం నిరూపిస్తే అతను బాగుపడొచ్చు.

కాని ఆ తరువాత అతను నిజంగా పిచ్చివాడయి పోతాడు. ఇప్పుడు ఏదో కొద్దిగా భ్రమలో పడి బతుకు తున్నాడు. ఇక మనం ఆ భ్రమ కూడ పోగొట్టినట్లయితే, ఆ తరువాత అతను చావకుండా, బ్రతకకుండా రోజు రాజీ గుర్తుకి వచ్చి నరకం అనుభవిస్తాడు.

ఈ విధంగానే ట్రీట్‌మెంటు యిద్దామని ముందు నేను కూడ అనుకొన్నాను. కాని చివరలో అతని జీవితాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ ట్రీట్‌మెంటుని వదిలేసాను. దీనిని గురించి యిందాకటినుంచి ఆలోచించి రమేష్‌ని వేరే పద్ధతిలో ట్రీట్ చేయదలచుకొన్నాను" అన్నాడు ప్రొఫెసర్ హరనాథ్ సిగరెట్టును మళ్ళీ పెదాల మధ్య యిరికించుకుంటూ.

"ఆ ట్రీట్ మెంటు ఏదో నేను కూడ తెలుసుకో వచ్చా" అడిగాడు కుమార్ నవ్వుతూ.

"దానిని గురించి మొత్తం అయిడియా తీసుకొన్న తరువాత చెప్తాను. పద, ముందు భోజనం చేద్దాం" అని కుర్చీలోంచి లేచి, డైనింగ్ రూమ్ వైపు కదిలాడు ప్రొఫెసర్.

# 3

ఉదయం తొమ్మిది గంటల సమయం—

గోపాలరావు వరండాలో కూర్చొని హరనాథ్ కోసం ఎదురుచూస్తున్నాడు. రెండు రోజుల క్రితమే హరనాథ్ నుంచి ఉత్తరం వచ్చింది. దానిలో హరనాథ్ వ్రాసిన ప్రకారం తను అన్ని ఏర్పాట్లు చేసాడు. ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకల్లా వస్తానని వ్రాసాడు. ఈ రోజు ఆదివారం.

గడియారం వంక చూసుకొన్నాడు. తొమ్మిది అవటానికి యింకా అయిదు నిమిషాల వ్యవధి ఉన్నది.

గోపాలరావు కొడుకు రమేష్ అంతకుముందే బయటకు వెళ్ళాడు. అతను మళ్ళీ తిరిగి వచ్చేసరికి ఒక గంట పడుతుంది.

గోపాలరావు మనసు గజిబిజిగా తయారయింది. అంతలో గేటు దగ్గర కారు హారన్ వినిపించింది. టాక్సీ ఒకటి లోపలకు వస్తున్నది. గోపాలరావు ఆలోచనలకు స్వస్తిచెప్పి, కారులోంచి దిగుతున్న ప్రొఫెసర్ హరనాథ్ కి ఎదురువెళ్ళాడు.

"రండి. సరిగ్గా ఉత్తరంలో వ్రాసిన ప్రకారం వచ్చేశారు. మీ కోసమే ఎదురుచూస్తున్నాను" అన్నాడు గోపాలరావు.

చిరునవ్వుతో కారులోంచి దిగి గోపాలరావు వెంట నడిచాడు. గోపాలరావు నౌకరు డిక్కీలోని సామాను తీసుకొని మేడపైకి వెళ్ళాడు.

"మీకు మేడమీద రమేష్ గది ప్రక్కనే వున్న గది కేటాయించాము." అని చెప్పి హరనాథ్‌ని ఆ గదిలోకి తీసుకెళ్ళాడు.

సామానంతా ఒక ప్రక్కన పెట్టి వెళ్ళిపోయాడు నౌకరు.

"మీరు డ్రస్ ఛేంజ్ చేసుకొంటూ ఉండండి. నేను క్రిందకు వెళ్ళి కాఫీ పంపిస్తాను." అని బయటకు వచ్చేశాడు గోపాలరావు.

ప్రొఫెసర్ హరనాథ్ ఒకసారి గదినంతా పరికించి తృప్తిగా నిట్టూర్చి, బెడ్డింగ్ ఓపెన్ చేసి, బట్టలు మార్చుకోడానికి ఉపక్రమించాడు.

నౌకరు కాఫీ తీసుకువచ్చి 'టీపాయ్'మీద పెట్టి వెళ్ళిపోయాడు.

అంతలో ప్రక్క గదిలోంచి మాటలు వినరాసాగాయి.

# 4

"సారీ! రాజీ, లేటయింది. అసలు నేను తొందరగానే వద్దామనుకొని వస్తుంటే దారిలో నా ఫ్రెండొకడు తగిలాడు. వాడిని వదిలించుకొని వచ్చేటప్పటికి ఈ సమయం అయింది. అన్నట్టు నీకు తెలుసా? ఈ రోజు మా ప్రొఫెసర్ బాబాయి ఫారిన్నుంచి వస్తున్నాట్ట...

ఆయన గురించి నీకు తెలియదు కదూ! నిన్నటి దాకా నాకు కూడ తెలియదు! నిన్ననే నాకు కూడ మా నాన్న గారు చెప్పారు...

మా ప్రొఫెసర్ బాబాయి చిన్నప్పుడే ఇంట్లోంచి పారిపోయి మద్రాసు వెళ్ళి కొన్నాళ్ళు అక్కడ స్థిరపడి అక్కడ బాగా చదువుకొని, అక్కడనుంచి ఫారిన్ వెళ్ళి, అక్కడ ఏవో పరిశోధనలు జరిపి బాగా పేరు తెచ్చుకొన్నాట్ట...

ఈమధ్య క్రొత్తగా ఒక పరిశోధన మొదలుపెట్టాడట. ఏమిటంటే చచ్చిపోయినవారిమీద పరిశోధనలు జరుపుతున్నాట్ట. ఆయన రాగానే నీ గురించి చెప్పి నిన్ను కూడ నాలాగే అందరికి కనిపించేటట్లు చేయమని చెప్తాను. ఆ తరువాత మనిద్దరం పెళ్ళిచేసుకొని, కొన్ని రోజులు హాయిగా హనీమూన్‌కి వెళ్ళి సరదాగా గడిపివద్దాం...

అప్పుడు యిక మనల్ని ఏమి అనలేరు. అప్పుడు ఎవరన్నా నాకు పిచ్చి అన్నారంటే చంపిపారేస్తాను...

నిజం రాజీ, మా ప్రొఫెసర్ బాబాయి చాలా గొప్పవాడని మా నాన్న చెప్పాడు. నా మాట అబద్ధమయితే, మా బాబాయి వచ్చిన తరువాత చూపిస్తాను. అప్పుడయినా నమ్ముతావు—" కాసేపు నిశ్శబ్దం.

రమేష్ మాటలాడే తీరునిబట్టి అతన్ని, అతని పరిస్థితిని ఊహించుకోసాగాడు హరనాథ్.

మళ్ళీ మాటలు వినిపించసాగాయి.

"—రాజీ, నువ్వు భోంచేశావా! ఆఁ!...ఇంకా భోజనం చేయలేదా! ఎందుకింతసేపు వుంటావు! అన్నం తినకుండా. ఏమిటీ, నాకోసం కూర్చున్నావా! మతిలేకపోతే సరి, బయటకు వెళ్ళిన మగవాళ్లు ఎప్పుడు వస్తారో వాళ్ళకే తెలియదు. ఇలాగ యింకెప్పుడు చేయవద్దు. తెలిసిందా! ఇకనుంచి సరిగ్గా పది గంటలు అయ్యేసరికి నువ్వు అన్నం తినేసేయాలి. లేకపోతే నేను చాలా బాధపడాల్సి

వస్తుంది. ఉండు, అమ్మని పిలిచి అన్నం యిక్కడికే తెమ్మని చెప్తాను.'' అని గది బయటకు వచ్చి—

''అమ్మా! అమ్మా! నీకెన్నిసార్లు చెప్పాలి. రోజూ పది గంటలయేసరికల్లా రాజీకి అన్నం పెట్టాలని. ఛీ, ఛీ, ఒక్కళ్ళకూ మతిలేదు. పెద్దవాళ్ళయ్యారు. ఎందుకు? ఆమాత్రం తెలుసుకోనక్కరలేదా! మీకు తెలియకపోతే ఒక ప్రక్కనుంచి నేను చెపుతున్నాను గదా!'' పెద్దగా ఇల్లు ఎగిరిపోయేలా అరుస్తున్నాడు రమేష్.

కిటికీ వున్న కర్టెన్ తొలగించి బయట వరండాలోకి చూసాడు హరనాథ్. రమేష్ తల్లి అన్నం కంచంతో రమేష్ గదిలోకి వెళ్తున్నది.

''అక్కడ పెట్టి వెళ్లు. మళ్ళీ నేను పిలిచింతరువాత రా!'' వినిపించింది రమేష్ గొంతు.

''రాజీ, దా. ఇవాళ నేను ముద్దలుచేసి పెడతా'' బ్రతిమిలాడుతున్నట్లుగా మాట్లాడుతున్నాడు రమేష్.

ఇక తను పరోక్షంగా రమేష్ పరిస్థితిని అర్థం చేసుకోవాలంటే కుదరదు. అతని చర్యలను స్వయంగా గమనించాలని తలచి, కళ్ళజోడు ఒకసారి సవరించుకొని, తలుపు తెరచుకొని బయటకు వచ్చాడు ప్రొఫెసర్ హరనాథ్. అప్పుడే గోపాలరావు మేడమీదకు రావడం చూసి అక్కడే నిలబడ్డాడు హరనాథ్.

గోపాలరావు హరనాథ్ దగ్గరకు వచ్చి ''ఇప్పటిదాకా జరిగిన తతంగం విన్నారుగా! రండి, అబ్బాయికి పరిచయం చేస్తాను.'' అని రమేష్ గదిలోకి దారితీసాడు.

''బాబూ! రమేష్!'' పిలిచారు గోపాలరావుగారు.

''ఇప్పుడు ఎవరూ కూడ నన్ను పలకరించవద్దు. నా

రాజీకి అన్నం తినిపిస్తున్నా." అన్నాడు రమేష్ వెనక్కి తిరగకుండానే.

కంచంలోని అన్నం మెతుకులు చెల్లాచెదురుగా నేల మీద పడివున్నాయి. రమేష్ చేతిలో చిన్న ముద్ద వున్నది. ఆ చేతిని శూన్యంలోకి ఎత్తిపెట్టి, "అయిపోయిందిలే, ఈ ఒక్క ముద్ద తిను. తరువాత చేయి కడిగేస్తాను." అంటూ అన్నం ముద్దను అలాగే శూన్యంలోకి వదిలేసాడు.

"ఆగు! అప్పుడే లేస్తావేమిటి? చేయి, మూతి కడుగుతానుండు." అని ఎడమచేత్తో నీళ్ళ గ్లాసు పట్టుకొని, కుడి చేతిలోకి నీళ్ళు వంపుకొని, ఆ చేతిని శూన్యంలో ఆడించసాగాడు.

"ఇక వెళ్ళి పడుకో, నాకోసం నాన్నగారు వచ్చారు. ఆయనతో మాట్లాడిన తరువాత నేను కూడ వస్తాను." అని తనకు కనపడుతున్న రాజీకి చెప్పి తను కూర్చున్న చోటునుంచి లేచి గోపాలరావువైపు తిరిగాడు.

"నాన్నా! ఎవరీయన?" అడిగాడు తండ్రిని, ఆయన ప్రక్కన వున్న హరనాథ్‌ను చూస్తూ.

"మొన్న చెప్పాను గద బాబూ! మీ బాబాయి ఫారిన్ నుంచి వస్తున్నాడని. ఆయనే ఈయన." చెప్పారు గోపాలరావుగారు.

"ఓహో! మీరేనా ప్రొఫెసర్ బాబాయి!" అని నమస్కరించాడు రమేష్.

"మళ్ళీ వస్తాను." అని చెప్పి వెళ్ళిపోయారు గోపాలరావుగారు, హరనాథ్ చేసిన సైగనందుకొని.

# 5

"రమేష్ కదూ నీ పేరు?" అడిగాడు ప్రొఫెసర్ హరనాథ్.

"అవునండి."

"నేను చిన్నప్పుడే యింటినుంచి వెళ్ళిపోవడంవలన అన్నయ్యవాళ్ళ సంగతులు ఏమి తెలుసుకోవటానికి వీలు లేకపోయింది. మొన్న పేపర్లో నా ఫోటో పడినప్పుడు ఆ ఉత్తరం అన్నయ్య గుర్తుపట్టి, అంటే మీ నాన్న నాకు ఉత్తరం వ్రాశాడు. చూసేదాకా మీరు ఎక్కడున్నారో తెలియలేదు. మీ నాన్న వ్రాసిన ఉత్తరం చూడగానే ఒక్కసారి వచ్చి మిమ్మల్నందరినీ చూడాలనిపించింది. వెంటనే బయలుదేరి వచ్చాను. అది సరే, ఇంతకుముందు నువ్వు ఎవరితోనో మాట్లాడుతూ అన్నం తినిపిస్తున్నావు. ఎవరికి?" అడిగాడు హరనాథ్.

"మీకు తెలియదు గదూ! నేను మాట్లాడుతున్నది నా రాజీతో."

"రాజీనా! ఎక్కడుంది? నాకు కనిపించలేదే?" ఆశ్చర్యం నటిస్తూ అడిగాడు హరనాథ్.

"నా రాజీ అందరికీ కనపడదు. నా ఒక్కడికి తప్ప."

"ఏం, నీ రాజీ దేవతా ఏమిటి? అందరికీ కనిపించకపోవడానికి?"

"అవును. నా రాజీ చిన్నప్పుడే చనిపోయి దేవతగా మారింది."

ఒక్కసారి పెద్దగా నవ్వాడు ప్రొఫెసర్ హరనాథ్.

"ఎందుకు? నవ్వుతున్నారు." అడిగాడు రమేష్‌కి అర్థంగాక.

"చచ్చిపోయినవాళ్ళు దేవతలవుతారని ఎవరు చెప్పారు నీకు?"

"బ్రతికి వున్నప్పుడు మంచిపనులు చేసినవాళ్ళు దేవతలుగాను, చెడుపనులు చేసినవాళ్ళు దయ్యాలుగాను మారు

తారని చిన్నప్పుడు మా మాష్టారు చెప్పారు." అన్నాడు రమేష్ హరనాథ్ వంక వింతగా చూస్తూ.

"శుద్ధ అబద్ధం! చచ్చిపోయినవాళ్ళు దేవతలుగాను, దయ్యాలుగాను మారిపోతే, ఈ భూమ్మీద ఎక్కడ చూసినా దయ్యాలు, దేవతలే కనిపిస్తారు." హేళనగా అన్నాడు హరనాథ్.

"మరి మా మాష్టారు మాకెందుకు అలా చెప్పాడు అయితే?"

"ఆయనకు యింకెవరో చెప్పుంటారు యిలాగే. అది మీకు చెప్పాడు అంతే."

"బాబాయ్! మరి చచ్చిపోయినవాళ్ళంతా ఏమవుతారు?" అనుమానంగా అడిగాడు రమేష్, హరనాథ్ వంక చూస్తూ.

"చెప్పమంటావా? మరి చెపితే నా మాట నమ్ముతావా?"

"చెప్పండి, మీ మాట నమ్ముతాను."

"చచ్చిపోయినవాళ్లు కొన్ని రోజుల తరువాత ఇంకో చోట ఎక్కడన్నా పుడతారు. అంటే మనిషిగా పుడతారని కాదు. కొంతమంది మనిషిగా పుడతారు. కొంత మంది జంతువులుగాను, మరికొంతమంది పక్షులుగాను పుడతారు." చెప్పాడు హరనాథ్ రమేష్ కళ్ళలోకి సూటిగా చూస్తూ.

కాసేపు మౌనం వహించాడు రమేష్ ఏదో ఆలోచిస్తూ. కొద్ది క్షణాలు గడచిన తరువాత "బాబాయ్! మరి నా రాజీ చచ్చిపోయినా కూడ నాకు కనిపిస్తుందిగా దానిని ఏమంటారు?"

"అది నీ భ్రమ అంటాను. చచ్చిపోయిన తరువాత కూడ నీ రాజీమీద నీకు ప్రేమ నశింపక, నువ్వు ఏదో ఊహించుకుంటూ భ్రమలోపడి. 'నా రాజీ నాకు కనిపిస్తుంది' అని పిచ్చివాడిలా తయారవుతున్నావు."

అప్పటిదాకా లోకులందరూ రమేష్‌ని పిచ్చివాడంటే కోపగించుకునేవాడు. కాని ఈ రోజున రమేష్‌కే అనుమానం రాసాగింది. 'నిజంగా నేను పిచ్చివాడినేమో' అనుకొన్నాడు మనస్సులో.

"బాబాయ్! మీరు ఫారిన్‌లో చనిపోయినవాళ్ళమీద రీసెర్చి చేస్తున్నారని నాన్న చెప్పాడు నాకు. అసలు మీరు చచ్చిపోయినవాళ్ళమీద రీసెర్చి ఎందుకు చేస్తున్నారు? ఎట్లా చేస్తున్నారు?" అర్థంగాక అడిగాడు రమేష్.

"అది నీకు చెప్పినా అర్థంకాదు. అయినా నీకు దానితో పని ఏమిటి?"

"అదికాదు బాబాయ్! మీరు నా రాజీమీద కూడ రీసెర్చి చేసి, చచ్చిపోయిన నా రాజీ మళ్ళీ ఎక్కడ పుట్టిందో చెప్పితే, వెళ్ళి తెచ్చుకుంటాను."

"చూడు రమేష్, నీ రాజీ చచ్చిపోయిన తరువాత మళ్ళీ మనిషిగా పుడుతుందని గ్యారంటీలేదు. ఒకవేళ నీ రాజీ ఎక్కడ పుట్టిందో తెలుసుకొన్నాననుకో. నా రీసెర్చిలో నీ రాజీ ఏ జంతువుగానో, ఏ పక్షిగానో పుట్టివుంటే నువ్వు ఇంకా బాధపడతావు. మనిషిగా పుట్టివుంటే అది నీ అదృష్టం. అయినా నా కర్తవ్యం నేను చేస్తాను. నీ అదృష్టం బాగుండి, నా శ్రమ ఫలించి, చచ్చిపోయిన నీ రాజీ ఈ జన్మలో కూడ మనిషిగా పుట్టి, అందులో ఆడపిల్లగా పుట్టివుంటే నిజంగా నువ్వూ, నేనూ

యిద్దరం అదృష్టవంతులమే. నీ తృప్తికోసం నేను రేపు రాత్రికి రాజీ ఆత్మను నా అధీనంలోకి తెచ్చుకొని రాజీ ఆత్మతో మాట్లాడి, రాజీ ఎక్కడ పుట్టిందో, ఏమిటో వివరాలన్నీ తెలుసుకొని, ఎల్లుండి నీకు చెపుతాను. అందాకా నువ్వు ఎలాటి గొడవా చేయకుండా, బుద్ధిగా వుంటాననని మాట యిస్తే తప్ప నేను ఈ పనికి పూనుకోను.'' అన్నాడు హరనాథ్, రమేష్ ముఖకవళికలు పరీక్షగా చూస్తూ.

ఒక్క నిమిషం శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచించ సాగాడు.

''సరే బాబాయ్! నేను ఎటువంటి గొడవా చేయకుండా మీరు చెప్పినట్లే చేస్తాను. మీరుమటుకు నా రాజీ ఈ జన్మలో ఎక్కడ పుట్టిందో, ఏ విధంగా పుట్టిందో తెలుసుకుని పది రోజులలోపు రాజీ ఏ రూపంలో పుట్టినా నా దగ్గరకు తీసుకువచ్చి, మీరు తీసుకొచ్చినది నా రాజీయే అని రుజువుచేయాలి.'' అన్నాడు రమేష్.

''సరే, నువ్వు చెప్పినట్లే పది రోజులలోపు నీ రాజీని ఏ రూపంలో వున్నా తీసుకువస్తాను. కాని నాకు కొన్ని సందేహాలున్నాయి. నేనడిగినవాటికి నువ్వు సరిగా జవాబు చెప్పాలి.'' అన్నాడు హరనాథ్.

''అలాగే.'' అని తల వూపాడు రమేష్.

''నీ రాజీ ఎన్ని సంవత్సరాల వయసప్పుడు చచ్చి పోయింది?''

ఒక్క క్షణం ఆలోచించి, ''ఆరు సంవత్సరాల వయసప్పుడు.'' అన్నాడు.

''అంటే యిప్పటికి ఎన్నేళ్ళయింది చచ్చిపోయి?''

"నాకు తొమ్మిదేండ్ల వయసున్నప్పుడు చచ్చిపోయింది. ఇప్పుడు నాకు ఇరవైఅయిదు సంవత్సరాలు. అంటే రాజీ చచ్చిపోయి యిప్పటికి పదహారు సంవత్సరాలు." అన్నాడు రమేష్.

"ఇక పోతే నీ రాజీ గురించి కొన్ని వివరాలు, అంటే ఆ అమ్మాయి ఎలా వుంటుంది? ఆమె అలవాట్లు కొన్ని చెప్పు." అన్నాడు హరనాథ్ జేబులోంచి డైరీ తీస్తూ.

రమేష్ తనకు గుర్తున్న కొన్ని అలవాట్లను చెప్పి, ఆమెను వర్ణించాడు. రమేష్ చెప్పినవన్నీ తన డైరీలో వ్రాసుకొన్నాడు హరనాథ్.

"సరే, నేను చెప్పినవన్నీ గుర్తుంచుకొని జాగ్రత్తగా వుండు. పది రోజుల్లో నీ రాజీని తీసుకువచ్చి నీకు అప్ప జెప్పే బాధ్యత నాది." అని చెప్పి లేచి బయటకు నడిచాడు.

# 6

"ఏం బావా! ఎవరో ప్రొఫెసర్ వచ్చాడట మనింటికి. నీకు తమ్ముడు కూడ అవుతాడట గదా! ఎలా వచ్చిందీ చుట్టరికం? ఇంతకీ అతను వచ్చింది అబ్బాయి పిచ్చి నయం చేయడానికా? లేక మిమ్మల్ని చూసిపోవడానికా?" లోపలకు వస్తూనే ప్రశ్నల వర్షం కురిపించాడు పరంధామయ్య.

పరంధామయ్య గోపాలరావుకి బావమరది అవుతాడు. పరంధామయ్యకు ఒక్కటే కూతురు. పేరు లలిత. ముద్దుగా లిల్లీ అని పిలుచుకొంటాడు. పరంధామయ్య ఎప్పట్నించో లిల్లీకి, రమేష్‌కి పెళ్ళి చేయాలనుకొంటున్నాడు.

రమేష్‌కి పిచ్చి అని తెలిసి కూడ తన కూతురును రమేష్‌కి యివ్వడానికి సిద్ధపడ్డాడంటే, రమేష్‌పై ప్రేమ

వుండి కాదు, అతని ఆస్తిమీద ప్రేమ వుండి ఈ పెళ్ళి చేయ నిశ్చయించుకొన్నాడు.

అందుకనే పరంధామయ్య వారానికి ఒక్కసారయినా వచ్చి రమేష్‌ని తన అల్లుడిగా చేసుకొంటానని గోపాల రావుని అడగటం, గోపాలరావు వద్దనటం ఎన్ని సంవత్స రాలుగానో జరుగుతూంది.

అయినా పరంధామయ్య పట్టువదలని విక్రమార్కుడిలా తన ప్రయత్నం తను సాగిస్తూనే వున్నాడు.

"పిచ్చివాడిని అల్లుడుగా చేసుకోవడానికి ఏ తల మాసినవాడుగాని, ఎంత బుద్ధితక్కువ వెధవగాని ఒప్పు కోడు. నువ్వు ఏదో తోడబుట్టిన చెల్లెలి మొగుడువని అభి మానంతో నీ మంచి, రమేష్ బాగు కోరి నేను వాడిని అల్లుణ్ణి చేసుకొంటానంటే వద్దంటున్నావు. అవున్లే కావా లనుకొని పదిసార్లు నీ చుట్టూ తిరగడంవలన నీకు అలుసు అయిపోయాను. నేనే గనక కూతురుకి బయట సంబంధం చేయదలచుకుంటే వందలమంది వర్రాళ్ళు 'క్యూ'లో నిల బడతారు వచ్చి." అని అక్కసుగా అనిపోతాడు పరం ధామయ్య ప్రతిసారి.

పరంధామయ్యకు నిజానికి బయట సంబంధం చేయడం యిష్టంలేదు. నిజంగా తనే గనక లిల్లీకి బయట సంబంధం చేస్తే యిక్కడ రమేష్ లక్షల ఆస్తి జారిపోతుందని తలచి తడవతడవకు వచ్చి గోపాలరావుచేత వద్దనిపించుకు పోతు న్నాడు.

కాని ఈసారి అలా వద్దనిపించుకోకుండా పోవాలని పట్టుదలమీద వచ్చాడు. దానికి ప్లాను కూడ ఆలోచించుకు వచ్చాడు.

"బావా! ఈమధ్య అమ్మాయికి రెండు రోజులనుంచి వంట్లో బాగుండటంలేదు. వంట చేయటానికి కూడ వంట్లో ఓపికలేదు. వంటమనిషిని పెట్టుకుంటే అది సరిగ్గా చేసి ఏడవదు. అందుకని నువ్వు ఏమీ అనుకోకుండావుంటే, అమ్మాయికి వంట్లో బాగుఅయేదాకా మేము యిద్దరం యిక్కడే వుంటాము." అన్నాడు పరంధామయ్య గోపాలరావు ఏం చెపుతాడాని ఆలోచిస్తూ.

"పిచ్చివేషాలు వేయకుండా బుద్ధిగా వుంటానంటే నాకేమీ అభ్యంతరంలేదు." అన్నాడు గోపాలరావు.

# 7

అప్పుడే నౌకరు తెచ్చిన కాఫీ త్రాగి, సిగరెట్టు వెలిగించుకొన్నాడు ప్రొఫెసర్ హరనాథ్.

అంతలో గోపాలరావు వచ్చాడు గదిలోకి.

"కాఫీ తాగారా?" అడిగాడు గోపాలరావు లోపలకు వస్తూనే.

"ఆఁ! ఇప్పుడే తీసుకొన్నాను. టైము అయిదు కావచ్చింది. మనం బయలుదేరుదామా! ప్రొద్దున అనుకొన్న చోటికి." అన్నాడు ప్రొఫెసర్ సిగరెట్టు పొగను గాలిలోకి వదులుతూ.

"ఒక పావుగంట తరువాత బయలుదేరుదాము, ఈలోపల మీతో రెండు మాటలు చెప్పాలి."

"చెప్పండి." అన్నాను హరనాథ్.

"ఏం లేదు, ఈ వూళ్ళోనే నా బావమరిది ఒకడున్నాడు. అతని ఆలోచనలు, బుద్ధులు కాస్త వక్రమార్గంలో ప్రయాణిస్తాయి. అతనికి ఒక్కతే కూతురు ఉన్నది. ఎప్పట్నించో ఆ కూతురును మా రమేష్‌కిచ్చి పెళ్ళిచేయాలని ఆలోచన. చాలాసార్లు నన్ను అడిగి నాచేత కాదని

పించుకొన్నాడు. అయినా అతను రమేష్ అందాన్ని, మంచితనాన్ని చూసి కాదు ఈ పెళ్ళిచేసేది, రమేష్ వెనకనున్న ఆస్తిని చూసి. అయినా నేను రమేష్కు ఈ పిచ్చి కుదిరేదాకా పెళ్ళి చేయదలచుకోలేదు అప్పట్లో.

అతను ఈ రోజు తన కూతురుకి వంట్లో బాగోలేదు, వంట చేసుకోవటం కూడ చాల కష్టంగా వుందని - అందుకని కూతురుకు బాగయ్యేదాకా యిక్కడే వుంటానని వచ్చాడు కూతురితో సహా.

అతను యిక్కడకు వచ్చాడంటే వూరికే రాడు, ఏదో ప్లాను వేసుకొని వచ్చాడని నా అనుమానం. అతను యిక్కడ వుండటంవలన మీకేమన్నా ఆటంకం వుంటుందేమోనని భయంగా వున్నది. అతన్ని యిక్కడ వుండొద్దని చెపితే నా భార్య బాధపడుతుంది. అందుకని తప్పని సరై వుండమనాల్సివచ్చింది.'' అని ముగించాడు గోపాలరావు.

''ఏం పరవాలేదు. అతనివల్ల నాకేమీ ఆటంకం లేదు. ఒకవేళ ఏదన్నా ఆటంకం వచ్చినా నేను సర్దుకోగలను. నా యీ వృత్తిలో యిటువంటివి అనుభవమే. ముందు జాగ్రత్తకోసం ఈ రోజునే నా అసిస్టెంటుకి టెలిగ్రాం యిస్తాను, ఇక్కడకు రమ్మని.'' అన్నాడు ప్రొఫెసర్.

''ఇక పోదామా?'' అడిగాడు గోపాలరావు.

''అలాగే.'' అని చెప్పి, లేచి డ్రెస్ చేసుకొన్నాడు ప్రొఫెసర్ హరనాథ్.

డ్రెస్ చేసుకోవటం పూర్తిఅయిన తరువాత క్రిందకు వచ్చారు ఇద్దరూ.

''డ్రైవర్ని పిలవనా! లేక మనిద్దరమే పోదామా?'' అన్నాడు గోపాలరావు కారువైపు నడుస్తూ.

"డ్రైవర్ అనవసరం. మీకు డ్రైవ్ చేయటం అలవాటున్నట్లయితే మీరు నడపండి. లేకపోతే నేను డ్రైవ్ చేస్తాను." అన్నాడు ప్రొఫెసర్.

గోపాలరావు ఫ్రంట్ డోర్ తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. రెండో వైపునుంచి ప్రొఫెసర్ హరనాథ్ కూర్చున్నాడు.

గేటుదాక మెల్లిగా నడచి, అక్కడనుంచి మలుపు తిరిగి, వేగాన్ని పుంజుకుంది కారు.

# 8

అప్పటికి ప్రొఫెసర్ హరనాథ్ వచ్చి మూడురోజులు అయింది.

ఉదయం తొమ్మిది గంటల సమయం—

హరనాథ్, రమేష్ గదిలోకి అడుగుపెడుతూ, "ఏం, రమేష్! ఎట్లా వున్నావు? ఇంకా రాజీని గూర్చి తపస్సు చేస్తున్నావా?" అన్నాడు నవ్వుతూ.

"ఏం చేసేది బాబాయ్! మీరేమో నా రాజీ మళ్ళీ ఎక్కడో పుట్టిందని చెప్పారు. మీరు చెప్పింది నిజమైతే త్వరగా నా రాజీని నాకు కనపడేటట్లు చేయండి." అన్నాడు రమేష్ దిగాలుగా.

"రమేష్! నువ్వు తొందరపడవద్దు. ఒక్క వారం రోజులు రాజీని గురించి ఆలోచించటం మానెయ్యి. నేను నిన్న రాత్రే రాజీ ఆత్మను పిలిచి, నా అధీనంలో వుంచుకొని మాట్లాడాను కాసేపు—"

"రాజీ ఆత్మతో మాట్లాడారా? నన్ను కూడ పిలిచి వుంటే నేనూ వచ్చి మాట్లాడేవాడిని గదా! నన్నెందుకు పిలవలేదు?" మధ్యలో అందుకొని మాట్లాడసాగాడు రమేష్.

"రమేష్! చచ్చిపోయినవారి ఆత్మలతో మాట్లాడా లంటే అందరికీ సాధ్యమయే పనికాదు. అదొక బ్రహ్మ విద్య. ఆ విద్య నభ్యసించడానికి నేను నా వయస్సులో సగభాగం ఖర్చుచేసాను. ఎన్నో సంవత్సరాలు కష్టపడి చనిపోయినవారి ఆత్మలతో మాట్లాడటం నేర్చుకొన్నాను. ఆ సమయంలో ఎవరన్నా ప్రక్కన వున్నట్లయితే ఏకాగ్ర తకు భంగం కలిగి మనకు కావాల్సిన ఆత్మ దొరక్కుండా పోతుంది, అప్పుడప్పుడు నీ రాజీ ఆత్మతో మాట్లాడే అవ కాశం అసలు వుండదు," అని చెప్పాడు హరనాథ్.

"అయితే ఇంతకీ మీరు రాజీతో ఏం మాట్లాడారు?" అడిగాడు రమేష్ ఆతృతగా.

"రమేష్! నిజంగా అదృష్టవంతుడివే! ఈ జన్మలో కూడా రాజీ మనిషిగాను, అందులో ఆడపిల్లగానే పుట్టింది. ఇక్కడకు వందమైళ్ళ దూరంలో వున్న అద్దంకి అనే వూర్లో నారాయణరావు, జానకమ్మ అనే దంపతులకు జన్మించిందట. ఈ జన్మలో కూడా తన పేరు రాజేశ్వరే నట. అందరూ 'రాజీ' అని పిలుస్తారట." అని టూకీగా చెప్పాడు హరనాథ్.

హరనాథ్ చెప్పిన మాటలు విని ఆనందంతో, "బాబాయ్! అయితే త్వరగా నా రాజీని నా దగ్గరకు తీసుకురండి. నేను చూడాలి. ప్లీజ్! త్వరగా వెళ్ళి తీసుకు రండి." తొందర చేయసాగాడు.

"రమేష్! నేను చెప్పేది విను. ఇప్పుడు ఆ రాజీకి వేరే తల్లిదండ్రులున్నారు. మనం వాళ్ళ దగ్గరకు వెళ్ళి 'మీ అమ్మాయి పూర్వజన్మలో మా అబ్బాయికి స్నేహితురాలు. వాళ్ళు చిన్నప్పట్నుంచి ఒకటిగా కలసి తిరిగారు. కాబట్టి

మీ అమ్మాయిని మా కివ్వండి' అని మనం అంటే వాళ్ళు అంత తేలిగ్గా మన మాట నమ్మరు. అసలు మన మాట వినను కూడ వినరు.

అదీగాక ఇప్పుడు ఈ రాజీకి పూర్వజన్మ జ్ఞానం వుండదు. కాబట్టి రెండు రోజులలో నాన్నగారు, నేను వెళ్ళి వాళ్ళతో మాట్లాడి, రాజీకి పూర్వజన్మ జ్ఞానం తెప్పించి, నీ దగ్గరకు తీసుకువచ్చి పెళ్ళిచేసే బాధ్యత నాది. అసలు యిప్పుడు రాజీకి పూర్వజన్మ జ్ఞానం తీసుకు రావాలంటే చాలా కష్టం. దానిని గురించి నేను చాలా శ్రమపడాలి. ఇవన్నీ తెలియక నువ్వు తొందరపడితే లాభంలేదు. కాబట్టి నువ్వు రెండుమూడు రోజులు ఓపిక పట్టు'' అని చెప్పాడు.

హరనాథ్ చెప్పిన మాటలు విని ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా ''సరే బాబాయ్! మీరు చెప్పినట్లే చేస్తాను. మీరుమటుకు నా రాజీని తీసుకువచ్చి నాకు అప్పజెప్పాలి.'' అన్నాడు కుమార్.

''అలాగే'' అని ''రమేష్! కాసిని మంచినీళ్ళు ఇవ్వు'' అని అడిగాడు హరనాథ్.

రమేష్ లేచి వెళ్ళి కూజాలో నీళ్ళు గ్లాసులోకి వంపుతున్నాడు. హరనాథ్ జేబులోంచి ఏదో వస్తువు తీసి, రమేష్ మంచం క్రింద మూలగా ఉంచాడు ఎవరికీ కనపడకుండా.

రమేష్ యిచ్చిన నీళ్ళు త్రాగి మెల్లిగా బయటకు వచ్చాడు హరనాథ్.

# 9

గోపాలరావు సోఫాలో కూర్చొని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. ఇంతలో ప్రొఫెసర్ హరనాథ్

వచ్చి గోపాలరావుకి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"మీ దగ్గిర చిన్నప్పుడు రాజీ ఫోటో వున్నదా?"

"అఁ! ఉండాలి. చూస్తానుండండి." అని చెప్పి, లోపలికి వెళ్ళాడు గోపాలరావు.

రెండు నిమిషాల తర్వాత చేతిలో ఒక ఫోటోతో తిరిగివచ్చాడు. ఆ ఫోటోని హరనాథ్‌కిస్తూ, "ఈ ఫోటో వల్ల ఉపయోగమేమన్నా వుందా?" అడిగాడు గోపాలరావు.

"అఁ! ఈ ఫోటో కొంత ఉపయోగపడుతుంది. మళ్ళీ రేపు తిరిగిస్తాను ఈ ఫోటోను." అని రాజీ ఫోటోను జేబులో పెట్టుకొన్నాడు హరనాథ్.

బయట ఏదో కారు వచ్చి ఆగిన శబ్దం వచ్చింది. చేతిలో బ్రీఫ్‌కేసు పట్టుకొని ఒక యువకుడు లోపలకు వచ్చి ప్రొఫెసర్ హరనాథ్‌ని విష్ చేసాడు.

"ఇతను నా అసిస్టెంట్ కుమార్." పరిచయం చేసాడు హరనాథ్ ఆ నూతన యువకుడ్ని గోపాలరావుకి.

అయిదు నిమిషాల అనంతరం ప్రొఫెసర్ హరనాథ్, కుమార్‌లు కలసి మేడమీద గదిలోకి వచ్చారు.

తను వచ్చిన తరువాత జరిగినదంతా వివరించాడు ప్రొఫెసర్, కుమార్‌తో.

"ముఖ్యంగా నిన్ను పిలిపించింది దేనికంటే యిక్కడ మనకొక 'ఏంటీ' తయారయాడు. ఆ 'ఏంటీ'కి నిన్ను 'ఏంటీ'గా వుండడానికి" అన్నాడు హరనాథ్ నవ్వుతూ.

"ఎవరా ఏంటీ, ఏమా కథా?" ఉత్సాహంగా అడిగాడు కుమార్.

పరంధామయ్య గురించి చెప్పాడు హరనాథ్.

"ఈ రోజు ఉదయం పరంధామయ్య, లిల్లీ యిద్దరూ కలసి ఏదో గుసగుసలాడటం చూసాను. ఈ రాత్రికి ఏదన్నా గొడవ జరుగుతుందని అనుమానంగా వుంది."

"ఏం పరవాలేదు బాస్! నిశ్చింతగా వుండండి. వాడి సంగతి నేను చూసుకుంటాను." అన్నాడు కుమార్.

అంతలో ట్రేతో రెండు మీల్స్ పట్టుకొచ్చాడు నౌకరు.

# 10

అర్ధరాత్రి 12 గంటల సమయం.

పరంధామయ్య వున్న గది తలుపులు తెరచుకొన్నాయి మెల్లగా. లిల్లీ, పరంధామయ్యలు బయటకు వచ్చారు.

పరంధామయ్య మెయిన్ స్విచ్ వున్న వైపు కదిలాడు. కొద్ది సెకన్లలో కరెంట్ 'ఆఫ్' అయింది. లిల్లీ దగ్గరకు వచ్చి, చెవిలో ఏదో గుసగుసలాడి తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు పరంధామయ్య.

లిల్లీ మెల్లగా మేడ మెట్లవైపు కదలసాగింది. చప్పుడు కాకుండా ఒక్కొక్క మెట్టె ఎక్కి రమేష్ గది ముందు ఆగింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. మెల్లిగా ధైర్యంచేసి గది తలుపుమీద చేయి వేసింది. లోపల గడియ వేయలేదు గాబోలు తలుపులు తెరచుకొన్నాయి.

చీరకుచ్చెళ్ళు పైకి లాగిపట్టుకొని నెమ్మదిగా రమేష్ మంచంవైపు నడవసాగింది.

కరెంట్ 'ఆఫ్' అవటంవలన అంతా చీకటిగా వుంది.

రమేష్ గాఢనిద్రలో వున్నాడు. రమేష్ మంచంమీద కూర్చొని మెల్లిగా అతన్ని తట్టి లేపసాగింది. రమేష్

యిటునుంచి తిరిగి అటు పడుకొన్నాడు కాని లేవలేదు.

మెల్లిగా రమేష్‌మీదకు వాలి అతని చెవిలో "రమేష్! లే! నేను రాజీని వచ్చాను." అంది.

ఒక్కసారి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు రమేష్. అంతా చీకటిగా వున్నది.

"రమేష్! లే! నేను వచ్చాను రాజీని" అంది మళ్ళీ లిల్లీ.

"రాజీ! మళ్ళీ వచ్చావా? ఎందుకు వచ్చావు? మా బాబాయ్ చూసాడంటే కేకలేస్తాడు. వెళ్ళిపో!" అని కంగారుగా అన్నాడు మంచంమీద లేచికూర్చొని.

లిల్లీ కాసేపు సందిగ్ధంలో పడింది, అతనికి ఏం జవాబు చెప్పాలా అని.

"ఇప్పుడు మీ బాబాయి నిద్రపోతున్నాడుగా! తెల్లవారేదాకా మనకు అడ్డులేదు. నిద్రపోతున్నప్పుడు మీ బాబాయికి కాదుగదా, ఆ దేముడికి కూడ తెలియదు, నేను యిక్కడకు వచ్చానని. అయినా నేను తెల్లవారక మునుపే వెళ్ళిపోతాను గదా! ఇంకెందుకు భయం" అని కూర్చొని వున్న రమేష్‌ని తనమీదకు లాక్కొంది లిల్లీ.

రమేష్‌కి అంతా అయోమయంగా వున్నది.

"రాజీ! వదులు. లైటు వేసి వస్తాను" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"వద్దు, రమేష్! చీకట్లోనే చాలా బాగుంటుంది. లైటు వుంటే ఏమీ బాగుండదు." అన్నది లిల్లీ కాగిలి విడవకుండానే. పిచ్చిగా ఏదో చేయసాగింది రమేష్‌ని.

రమేష్‌లో మెల్లగా కామోద్రేకం బయలుదేరింది.

మెల్లిగా లిల్లీ కాగిట్లో సర్దుకొని తన రెండు చేతులను లిల్లీ వీపుమీద వేసి గట్టిగా తనవైపు అదుముకోసాగాడు.

రమేష్ ఆవేశం అవధులు లేనంత తీవ్రత కాసాగింది.

రమేష్, లిల్లీ మీదకు పూర్తిగా జరిగాడు. చటుక్కున ఆమె చీరకుచ్చెళ్ళను ఊడబెరికాడు.

అప్పటిదాకా కామోద్రేకంలో మరగిపోయిన లిల్లీ ఒక్కసారి విద్యుత్తును తాకినదానిలా పెద్దగా అరచింది.

లిల్లీ అరుపు వినిపించగానే మెయిన్ స్విచ్ దగ్గరకు వెళ్ళి స్విచ్ 'ఆన్' చేసాడు పరంధామయ్య.

లిల్లీ అలాగే పెద్దగా అరుస్తూ కేకలు పెట్టసాగింది.

రమేష్ ఒక్కసారిగా బిత్తరపోయాడు. రాజీ ఎందుకు అట్లా అరుస్తున్నదో అర్థం కావటంలేదు. లిల్లీని గట్టిగా పట్టుకొని—

"రాజీ, ఎందుకలా అరుస్తున్నావు. ఏమయింది" అని కంగారుగా అడుగుతున్నాడు.

"ఛీ, నన్ను వదులు, ఏదో బావవని లోపలకు వస్తే బలవంతం చేస్తావా? ఛీ, ఛీ, నీకంటె గొడ్డు నయం. పశువు కన్నా హీనం అయ్యావు. ఇటువంటివాడివని తెలిస్తే, అసలు యిట్లా చేస్తావని తెలిస్తే నీ గదిలోకి వచ్చేదాన్నే కాదు," అని యింకా ఏమేమో మాట్లాడసాగింది.

రమేష్ అప్పుడు చూసాడు లిల్లీని. అంటే, యిప్పటిదాకా రాజీగా ప్రవర్తించింది లిల్లీనా? ఆశ్చర్యంతో పాటు ఆవేశంకూడ వచ్చింది రమేష్కి.

అప్పటికే గోపాలరావు దంపతులు, పరంధామయ్య, ప్రొఫెసర్ హరనాథ్, కుమార్, అంతా వచ్చేశారు.

"రాక్షసీ, యింత మోసం చేస్తావా? నిన్ను...నిన్ను చంపేస్తాను. నా రాజీ పేరు తలవటానికికూడ అర్హత లేదు. చివరకు యింత నీచానికి దిగజారుతావా?" అని చేయెత్తి లిల్లీని కొట్టబోయాడు.

అంతలో పరంధామయ్య పెద్దగా అరుస్తూ వచ్చి, లిల్లీని ప్రక్కకు లాగి—"ఛీ, ఛీ, నీ కొడుకు యింతటి నీచుడని అనుకోలేదు. ఎంత అన్యాయం చేయబోయాడు. నా చిట్టి తల్లికి. ఏదో బావ యిల్లుగదా అని వస్తే యిదా చేసే మర్యాద. ఇప్పుడు దానిగతేం కావాలి. ఇక దాన్ని ఎవరు పెళ్ళి చేసుకుంటారు" పెద్దగా శోకాలు పెడుతూ అరవసాగాడు.

అందరూ గదిలోకి రాగానే లిల్లీ జారిపోయిన చీరెను కుప్పగా మడచి పట్టుకొని బాత్‌రూమ్‌వైపు పరుగెత్తింది.

తిరిగి పరంధామయ్య గొంతు విజృంభించ సాగింది. గోపాలరావు దంపతులు కంగారు పడిపోతున్నారు. లిల్లీ చీర సరిగ్గా చేసుకొని వచ్చింది అక్కడికి.

పరంధామయ్య అనే మాటలు వినలేక చెవులు మూసుకుని "పరంధామయ్యా! ఆపుతావా! లేదా! ఇంకొక్క మాట ఎక్కువ మాట్లాడావంటే నాలుక చీరేస్తాను. అయినా అసలు నీ కూతురు మేడమీదకు ఎందుకు వచ్చింది. మేడమీదకు వచ్చినా మావాడి గదిలోకి యెందుకు రావాలి? సిగ్గులేదు. వయసొచ్చిన పిల్ల అర్ధరాత్రిపూట యింకో మగాడి గదిలోకి రావటానికి" అంటూ గోపాలరావు నోరు చేసుకొన్నాడు.

అంతలో లిల్లీ అడ్డం వచ్చి, "నేనేం, మీ కొడుకు గదిలోకి రాలేదు. ఆయనే నా గదిలోకి వచ్చి, "లిల్లీ, కాసేపు నా గదిలో కూర్చొందువుగాని రా. కాసేపు ఏదన్నా మాట్లాడుకొందాం. అసలు నిద్ర పట్టడంలేదు" అని పిలిచాడు. బావే కదా అని నేను వేరే ఏమీ ఆలోచించకుండా వచ్చాను. వచ్చినందుకు తగిన శాస్తిచేసాడు.

ఛీ, ఛీ, పాడు మనుష్యులు - పాడు లోకం. ఇన్నాళ్ళూ వట్టి పిచ్చే అనుకొన్నాను. మదపిచ్చికూడ వుందని తెలి యదు. నాన్నా! ఇంక ఒక్క క్షణంకూడ ఈ యింట్లో వుండొద్దు. వెంటనే వెళ్ళిపోదాం పద," అంటూ బయలు దేరబోయింది.

అంతలో కుమార్ అడ్డంవచ్చి, "ఆగండి, లలితాదేవి గారూ! ఇప్పటిదాకా మీ తెలివితేటలు, మీ ఆవేశాలే చూపించారు. కాస్త మా తెలివితేటలుకూడ చూసి ఆ తరువాత మీరు, మీ నాన్నగారు యిక్కడనుంచి నిర భ్యంతరంగా వెళ్ళొచ్చు" అని రమేష్ మంచం క్రింద నుంచి ఏదో వస్తువు బయటకు తీసాడు. అందరూ దాని వంక ఆశ్చర్యంగా చూసారు.

అది 'టేప్ రికార్డర్.'

ఆరోజు ఉదయం హరనాథ, రమేష్ గదిలోకి వచ్చి నప్పుడు దానిని అక్కడ పెట్టాడు. అది ఆటోమేటిక్ 'టేప్ రికార్డర్'. బ్యాటరీ సిస్టమ్‌తో పనిచేస్తోంది. అంతే గాక పదిగజాల దూరంలో ఏ శబ్దం వచ్చినా అది టేప్ చేస్తుంది. శబ్దం ఆగిపోగానే టేప్ పనిచేయటంకూడ ఆగి పోతుంది.

కుమార్ టేప్ సెట్ చేసి 'ఆన్' చేసాడు.

అంతకు ముందు ఆ గదిలో రమేష్‌కి, లిల్లీకి జరిగిన సంభాషణ, శృంగారం అంతా స్పష్టంగా విన్పించసాగింది.

అంతా విన్న తరువాత గోపాలరావు ఆవేశంతో కంపించిపోయాడు. అతని పిడికిళ్ళు బిగుసుకొన్నాయి.

"రేయ్, పరంధామయ్యా! ఇందుకా నువు ఇక్కడ చేరింది. ఎంతటి నీచానికి తెగించావు. తక్షణం బయటకు

వడు. లేకపోతే తర్వాత ఏం చేస్తానో నాకే తెలియదు. గెటవుట్!'' పిచ్చిగా అరిచాడు గోపాలరావు.

ప్రొఫెసర్ వంక 'గుర్రు'గా చూసాడు పరంధామయ్య. ఆ చూపులో ఎన్నో భావాలు గోచరించాయి ప్రొఫెసర్ హరనాథ్ కి. తన కూతురుని తీసుకొని విసురుగా బయటికి వెళ్ళిపోయాడు పరంధామయ్య.

రమేష్, ప్రొఫెసర్ వంక కృతజ్ఞతగా చూశాడు.

## 11

చిక్కటి చీకటిని చీల్చుకుంటూ కారు హెడ్ లైట్ల కాంతిలో అరవై మైళ్ళ వేగంతో దూసుకుపోతున్నది బ్లాక్ అంబాసిడర్.

డ్రైవింగ్ సీట్లో హరనాథ్ కూర్చొన్నాడు. అతని ప్రక్కన గోపాలరావు, అతని భార్య కూర్చొన్నారు.

వెనక సీట్లో కరుణ, కరుణ తల్లితండ్రులు కూర్చొన్నారు.

డ్రైవ్ చేస్తున్న హరనాథ్ ఓసారి వెనక్కి తిరిగి కరుణవైపు చూసి—''కరుణా! ఇంతకు ముందు నేను చెప్పిందంతా గుర్తు పెట్టుకొన్నావు గదా!'' అన్నాడు.

తలకాయ ఆడించింది కరుణ అంతా గుర్తున్నది అన్నట్లుగా.

''ముఖ్యంగా నువ్వు గుర్తు పెట్టుకోవాల్సినవి ఏమిటంటే, చిన్నప్పుడే చనిపోయిన రాజీ అలవాట్లను, పద్ధతులను, నువ్వు ఏమాత్రం మరచిపోకూడదు. అక్కడ అసలు నువ్వు కరుణగా మసలకూడదు. అసలు నువ్వు 'కరుణవి' అన్నమాట పూర్తిగా మరచిపోవాలి. ఇకనుంచి నీ పేరు రాజీ. నీలో క్రొద్దో గొప్పో చనిపోయిన రాజీ పోలికలున్నాయి. 'రాజీ' అని ఎవరైనా పిలవగానే ఎటువంటి

ఆలస్యం, కంగారు లేకుండా వెంటనే సమాధానం యివ్వాలి.

నేను చెప్పినవి మరచిపోకుండా అక్కడ మసలు కుంటే ఒక మనిషి జీవితం బాగుచేయడమే గాకుండా, ఆ ధనవంతుల యింటి కోడలు అవుతావు. ఏమాత్రం ఏమరుపాటు లేకుండా అప్రమత్తతో మెలగాలి.

ఇకపోతే చిన్నప్పుడు రాజీ, రమేష్‌లు కలసి ఏమేమి ఆటలు ఆడుకొనేవారో, అవి ఎట్లా ఆడుకొనేవారో ఆ వివరాలన్నీ కూడ, గోపాలరావుగారు చెప్పారు నీకు.

"నువ్వు యివన్నీ మరచిపోకుండా రమేష్‌కి, నీకు ఎప్పట్నించో, అంటే చిన్నప్పట్నించి బాగా పరిచయం, చనువు ఉన్నట్లు ప్రవర్తించాలి. ఇకనుంచి నువ్వు కరుణవు కాదు. రాజేశ్వరివి. అంటే 'రాజీ' వి" అని చెప్పాడు హరనాథ్.

అలాగేనన్నట్లు తల ఊపింది కరుణ.

హరనాథ్ తృప్తిగా నవ్వుకొన్నాడు.

# 12

"రమేష్, ఇప్పుడు నేను చెప్పేది జాగ్రత్తగా విను. ఇంకో పావుగంటలో రాజీని తీసుకువచ్చి నీముందుంచు తాను. కాని నువ్వు మటుకు ఆ ఆనందంలో యెటువంటి హడావిడి చేయకూడదు.

పూర్వజన్మలో రాజీ నీతో గడిపింది కొద్దికాలమే. ఆ కొద్దికాలంలో ఆ అమ్మాయి నీతో గడిపినప్పుడు ఉన్న జ్ఞాపకాలు కొన్నిమాత్రమే. అవి అయినా నేను యెంతో కష్టపడి ఆ అమ్మాయికి, అంటే నీ రాజీకి పూర్తి జన్మ స్మృతి తెప్పించాను.

ఇప్పుడు మీ యిద్దరూ కలసి ఒక నెలరోజులుంటే ఇప్పుడున్న నీ రాజీకి అన్నీ గుర్తుకి వచ్చి, చాలా ఆనందం పొందుతుంది. నువు ఆ అమ్మాయిని యెటువంటి కష్టం పెట్టకుండా, యెటువంటి అపనమ్మకం పెట్టుకోకుండా మనస్ఫూర్తిగా స్వీకరించాలి," చెప్పాడు హరనాథ్, రమేష్‌కి.

కొద్దిక్షణాలు మౌనం వహించాడు రమేష్, హరనాథ్ చెప్పింది విన్న తరువాత. "ఇంతకీ మీరు తీసుకొచ్చింది నా రాజీయే అని నాకు నమ్మకమేమిటి?" అడిగాడు రమేష్ హఠాత్తుగా.

అటువంటి ప్రశ్న రమేష్‌నుంచి వస్తుందని ఊహించిన ప్రొఫెసర్ హరనాథ్, రమేష్ వంక ఒకసారి చూసి, "నీ రాజీ, ఫోటో ఏదన్నా ఉందా నీ దగ్గర" అని అడిగాడు.

రమేష్ కుర్చీలోంచి లేచి బీరువాలో భద్రంగా దాచుకున్న ఫోటో నొకదానిని తీసుకువచ్చి హరనాథ్‌కు యిచ్చాడు.

హరనాథ్ తన కోటు జేబులోంచి ఇంకొక ఫోటో తీసాడు బయటకి. ఆ ఫోటో అంతకుముందు గోపాలరావు గారి దగ్గర తీసుకొని, ఫోటో స్టూడియోకి తీసుకెళ్ళి, ఆ ఫోటోను కొన్ని మార్పులతో యింకో ఫోటో తయారు చేయించి పట్టుకొచ్చాడు.

తనదగ్గర ఉన్న ఫోటోను, రమేష్ యిచ్చిన ఫోటోను కలిపి పట్టుకొని రమేష్ ముందు ఉంచాడు.

"చూడు రమేష్! ఇది నువ్విచ్చిన నీ రాజీ ఫోటో. ఈ రెండవది ఈ జన్మలో రాజీ చిన్నప్పటి ఫోటో. రెండు ప్రక్క-ప్రక్కనే పెట్టాను. పరీక్షగా చూడు,

రెండు ఫోటోలలో వున్న అమ్మాయి ఒక్కటే. కాక పోతే నీ రాజీ పువ్వుల గౌను వేసుకుంది. మెడలో సన్నటి గొలుసు వేసుకొంది. చెవులకు రింగులు పెట్టుకొన్నది.

"కానీ ఈ జన్మలో రాజీ ఈ ఫోటోలో సాదా గౌను వేసుకొన్నది. మెడలో గొలుసు లేదు. చెవులకు రింగులు లేవు. ఆ దుస్తులు, ఆభరణాలు దృష్టిలో పెట్టుకోకుండా చూడు. రెండు ఫోటోలు ఒక్కటే."

రమేష్ కొద్దిక్షణాలు పరీక్షగా చూశాడు రెండు ఫోటో లను. తృప్తిగా శ్వాస పీల్చి వదిలాడు రమేష్. అతని మన సంతా ఆనందంగా వున్నది.

"బాబాయ్! మీరు నా పాలిటి దేవుళ్ళు. మీరు చేసిన ఈ మేలుని జన్మజన్మలకు మరచిపోను. మీలాంటి బాబాయి నాకుండటం, అందులోను, ప్రజ్ఞాపాటవాలుగల బాబాయి వుండటం నా అదృష్టం. బాబాయ్! త్వరగా నా రాజీని నాకు చూపించరూ!" అన్నాడు రమేష్ ఆవేశంగా.

హరనాథ్ బయటకు వెళ్ళి రెండు నిమిషాల తరువాత రాజీగా మార్చిన కరుణను తీసుకొచ్చాడు.

"అమ్మా! రాజీ! అడుగో నీ రమేష్! నీకోసం కలవ రించి, కలవరించి పిచ్చివాడిలా తయారయ్యాడు. ఇక నువ్వు వచ్చావు. నీ రమేష్‌ని నువ్వే కంటికి రెప్పలా కాపాడుకోవాలి." అని కరుణకు రమేష్‌ని చూపించాడు.

"రమేష్! ఇదిగో నీ రాజీ. బాగా పరీక్షగా చూడు, చిన్నప్పటి నీ రాజీ పోలికలున్నాయో, లేవో." అన్నాడు హరనాథ్.

"బాబాయ్! నన్ను క్షమించండి. అనవసరంగా మిమ్మల్ని అనుమానించాను. ఈమె తప్పకుండా నా రాజీయే. సందేహంలేదు. ఆ కళ్ళు, ఆ ముక్కు, ఆ పెదాలు,

ఆ తలకట్టు, ఆ రంగు, ఒక్కటేమిటి? అన్నీ నా రాజీ పోలికలే. కాదు నా రాజీయే!" అని గబగబా వచ్చి "రాజీ!" కరుణను కౌగలించుకొన్నాడు.

కరుణకు ఆ క్షణంలో ఆనందం, ఆనందంలో భయం, అంతా కొత్తగా వుంది. తను ఎక్కడ బయటపడతానో నని భయంగా వుంది.

"రమేష్! నేను చెప్పింది అప్పుడే మరచిపోయావా?" అన్నాడు హరనాథ్ మందలిస్తున్నట్లుగా, కరుణ పరిస్థితిని చూసి.

"ఓ! సారీ బాబాయ్! నా రాజీ పెద్దయిన తరువాత స్పష్టంగా చూడటం యిదే మొదటిసారి అవడంవలన ఆ తన్మయత్వంలో నన్ను నేనే మరచిపోయాను. క్షమించండి. ఇంకెప్పుడూ తొందరపడను." అన్నాడు రమేష్ తలవంచుకొని.

"రమేష్! ఇక్కడ రాజీకి అంతా కొత్తగా వుంది. రెండు రోజులపాటు అలవాటయితే అంతా సవ్యంగా వుంటుంది. నువ్వేమటుకు తొందరపడి రాజీని కంగారు పెట్టకు." అని మళ్ళీ "నేను యిప్పుడే వస్తాను. మీ రిద్దరూ మాట్లాడుకొంటూ వుండండి." అని చెప్పి బయటకు వచ్చేశాడు.

# 13

"రాజీ! అలా సిగ్గుపడుతూ అక్కడే నుంచున్నావే! రా! ఇలా వచ్చి కూర్చో." అన్నాడు రమేష్.

కరుణ మెల్లగా కదలివచ్చి, రమేష్‌కి ఎదురుగా కుర్చీలో కూర్చొన్నది.

"రాజీ! నేనంటే నీకు యిష్టంలేదా " మళ్ళీ అన్నాడు రమేష్.

"అదేం మాట రమేష్! నువ్వంటే నాకెంతో యిష్టం. కాదు ఎంతో ప్రేమ. అందుకే నేను చచ్చిపోయినా మళ్ళీ నీకోసం పుట్టి నిన్ను చేరుకున్నాను. ఇంక మళ్ళీ మనిద్దరిని ఆ భగవంతుడు కూడా వేరుచేయడు. ఏనాడో మనం చేసుకొన్న పాపంవల్ల ఈ పదహారేళ్ళు విడివిడిగా బ్రతికాము. ఇప్పట్నించి మనిద్దరికి మంచిరోజులు వచ్చాయి. అందుకనే ఈ రోజు యిలా ఆనందంగా కలుసు కున్నాము." అంది రాజీగా వున్న కరుణ.

"పోనీలే రాజీ! జరిగినదంతా మరచిపో. ఇప్పటికయినా మనిద్దరం ఒకటయ్యాం. రాజీ! నువ్వు ఆ రోజున బావిలో పడగానే, నేను కూడ బావిలో దూకి నిన్ను పైకి తీసు కొద్దామనుకున్నాను. కాని అప్పటికి నేను చిన్న పిల్లాడ్ని. ఈత రాదు. ముసలి పంతులు మన బడిప్రక్కనే వున్న రామయ్యను పిలుచుకొచ్చి బయటకు తీయించాడు నిన్ను.

కాని...కాని అప్పటికే నువ్వు చచ్చిపోయావు. నువ్వు చచ్చిపోయావని తెలిసి నేనెంత ఏడ్చానో తెలుసా. సరిగ్గా పది రోజులు అన్నం కూడ మానేశాను. దాంతో మా అమ్మా, నాన్నావాళ్ళకు చాలా భయం వేసింది. నేను కూడా చచ్చిపోతాననుకున్నారు అంతా. చాలామంది డాక్టర్లకు చూపించారు నన్ను.

ఒక్క సంవత్సరం తర్వాత మళ్ళీ మనిషిగా అయ్యాను. తరువాత పదేళ్ళకు నువ్వు నాకు కనిపించావు. ఆ మాట మా నాన్నకి చెపితే నాకు దయ్యం పట్టిందని భూత వైద్యులను పిలిచి నాకు భూతవైద్యం చేయించాడు. వాళ్లెవరూ నాకు దయ్యాన్ని వదలగొట్టలేకపోయారు. అసలు నిజంగా నాకు దయ్యం పడితే గదా!

నువ్వేమో నాకు కనిపించి మిగతా ఎవ్వరికీ కను పించవు. నేను ఎప్పుడూ నిన్నే కలవరిస్తూ కూర్చొనే టప్పటికి నాకు పిచ్చిపట్టిందని అనుకొన్నారు అందరూ. ఇంతకాలానికి యిప్పుడు మా బాబాయి ఫారిన్‌నుంచి నాకోసం వచ్చి నా బాధను అర్థంచేసుకొని, నిన్ను వెతికి తీసుకొచ్చాడు. నిజంగా మా బాబాయి చాలా మంచి వాడు. కాదు దేముడు." అని యింకా ఏవేవో చెప్పుకు పోతున్నాడు రమేష్.

'ఊ'కొడుతూ వింటున్నది కరుణ.

రమేష్ చెప్పటం ఆపి, "నువ్వేం మాట్లాడకుండా అంతా నాచేతనే మాట్లాడిస్తున్నావు. చిన్నప్పుడు గూడ యింతే. నేను పది మాటలు మాట్లాడితే నువ్వు ఒక్క మాట మాట్లాడేదానివి." అన్నాడు రమేష్.

"నేనేం మాట్లాడను. అంతా నువ్వే మాట్లాడేస్తు న్నావు." అంది కరుణ.

"సరే. నేను ఆపేస్తాను. నువ్వు మాట్లాడు. మరచి పోయాను. ఆ రోజు నువ్వు బావిలో పడ్డప్పుడు నీకేమని పించింది?"

"అమ్మో! అది తలచుకొంటేనే భయం వేస్తుంది." అని మళ్ళీ చెప్పసాగింది.

"బకెట్టుతోపాటు నేనుకూడ బావిలో పడ్డాను. పడు తున్నప్పుడు పెద్దగా అరుద్దామనుకున్నాను. కాని గొంతు పెగల్లేదు. నీళ్ళల్లో పడగానే మునిగిపోయాను. కాని ఎవ్వరుకూడ నన్ను బయటకు తీయలేదు. అడుక్కి వెళ్ళి పోయాను. అప్పుడు నాకు ఊపిరి ఆడలేదు. ఊపిరి ఆడక నోరు తెరిచాను. ఒక్కనిమిషంలో నీళ్ళు బాగా లోపలికి వెళ్ళిపోయినాయి. ఆ తరువాత నాకేమీ తెలియలేదు.

అంటే...అం...టే చచ్చిపోయాను.'' ఆ మాట అంటు న్నప్పుడు నిజంగానే ఏడుపు వచ్చింది కరుణకు. ఇక ఆపైన మాట్లాడటానికి వీలులేకుండా గొంతు పూడుకుపోయింది.

''సారీ, రాజీ! జరిగినదంతా గుర్తుచేసి నిన్ను ఏడిపిస్తున్నాను. అంతా మరచిపో. ఇంకెప్పుడూ జరిగిపోయిన విషయాలను కదిలించను'' అన్నాడు రమేష్ దిక్కు మొగం వేసుకుని.

రమేష్‌కికూడ ఆ సంఘటన జ్ఞాపకమొచ్చి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

కరుణ పమిటచెంగుతో కళ్ళు తుడుచుకొని, రమేష్ వంక చూసింది. రమేష్ కళ్ళల్లోకూడ నీళ్ళుండటం చూసి, తను కర్చీలొంచి లేచి రమేష్ కళ్ళు తుడుస్తూ, ''ఏమిటిది రమేష్, నాకు చెప్పి నువుకూడ ఏడుస్తున్నావా?'' అంది.

రమేష్ హృదయం యిప్పుడు తేలికపడింది. ఇప్పుడు చాలా హుషారుగా, ఆనందంగా ఉన్నాడు.

అది చూసి కరుణ తృప్తిగా నిట్టూర్చింది, తన ప్రయత్నం సఫలీకృతం అయినందుకు.

ఇదంతా చాటుగా గమనిస్తున్న గోపాలరావుకి, గోపాలరావు భార్యకి ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

కరుణ, రమేష్ కళ్ళు తుడుస్తున్నప్పుడు అతని కణత మీద ఉన్న గాయాన్ని చూసి, ''రమేష్, ఏమిటిది, చిన్నప్పుడు జామిచెట్టుమీదనుంచి పడ్డప్పుడు తగిలిన దెబ్బ మచ్చ కదూ!'' అంది. అది గోపాలరావు చెప్పాడు కరుణకు ఆ మచ్చగురించి.

''అవును రాజీ, ఆ మచ్చ అట్లాగే ఉంది. ఆ మచ్చ

మాసిపోలేదు. అంటే ఈ మచ్చగురించి నీకు యింకా జ్ఞాపకం ఉందా?" అన్నాడు రమేష్ ఆశ్చర్యంగా.

"ఈ ఒక్క మచ్చగురించే కాదు. ఇంకా చాలా జ్ఞాపకమున్నాయి," అన్నది కరుణ అమాయకం నటిస్తూ.

గోపాలరావు భార్య సుశీల లోపలకు వచ్చి, "అమ్మాయి రాజీ! అబ్బాయి, నువ్వు భోంచేద్దురుగాని రండి," అని చెప్పి వెళ్ళిపోయింది.

"పద రాజీ, భోంచేసి వద్దాం!" అన్నాడు రమేష్, కరుణచేయి పట్టుకొని కుర్చీలోంచి లేస్తూ.

రమేష్, కరుణ లిద్దరూ బయటకువచ్చి వంట గదివైపు కదిలారు.

## 14

"రాజీ, సినిమాకి వెడదామా!" అడిగాడు రమేష్.

"ఏ సినిమాకి?" అడిగింది కరుణ నవ్వుతూ.

"జీవనతరంగాలు, చాలా బాగుందిట. మొదటి ఆటకు టిక్కెట్లు తెప్పించాను. సినిమా మొదలవటానికి యింకా గంట టయిముంది. ఈలోపల చక్కగా టాయిలెట్ అయిరా," అని చెప్పి, తనుకూడ లేచి టవల్ తీసుకొని బాత్‌రూమ్‌వైపు నడిచాడు రమేష్.

గంట తరువాత రమేష్, కరుణలిద్దరూ కలిసి బయటకు వచ్చి కారులో కూర్చొన్నారు.

గోపాలరావు భార్యకు రమేష్, కరుణ జంటగా సినిమాకి వెళ్ళడం చూసి మనస్సు ఆనందంతో ఊగిసలాడింది.

సినిమా చూసి హాలులోంచి బయటకు వస్తూ, "ఎలా ఉంది సినిమా!" అని అడిగాడు రమేష్.

"ఫరవాలేదు," అంది కరుణ.

రమేష్, కరుణ యిద్దరూ కారులో ఎక్కబోతుండగా పరంధామయ్య కనిపించాడు. "ఏరా, సినిమాకి వచ్చావా?" అని ప్రక్కన ఉన్న కరుణని చూసి, "ఈ అమ్మాయి ఎవరు?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

రమేష్ ముందు జరిగిన గొడవ ఏమీ పట్టించుకోనట్లుగానే మాట్లాడాడు.

"మామయ్యా! నీకు తెలియదు కదూ! ఈ అమ్మాయి ఎవరో కాదు. చిన్నప్పుడు చచ్చిపోయిన నా రాజీ. మా బాబాయి చాలా కష్టపడి, మళ్ళీ జన్మ ఎత్తిన నా రాజీని కనుక్కొని తీసుకొచ్చాడు. త్వరలో పెళ్ళికూడ చేసుకోబోతున్నాము," అన్నాడు రమేష్.

ఒక్కసారి పరంధామయ్య గుండెల్లో అగ్నిజ్వాలలు రేగినాయి. ఆ అగ్నిజ్వాలలు అతని కళ్ళలోనుండి నిప్పు కణాలుగా రాలుతున్నట్లున్నాయి. అతని ముక్కుపుటాలు ఒక్క క్షణంసేపు అదిరినాయి. అవన్నీ బైటకు కనిపించనీయకుండా, "రమేష్, నువు నిజంగానే పిచ్చివాడివిరా" అన్నాడు.

"మామయ్యా! ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా?"

"లేకపోతే ఏమిటిరా, చచ్చిపోయినవాళ్ళు మళ్ళీ పుట్టడం అన్నది ఉత్తమాట. మీ బాబాయి నిన్ను మోసం చేసాడు. ఎవర్నో ముక్కు మొగం తెలియనిదాన్ని తీసుకొచ్చి నీకు అంటగట్టి, దానిద్వారా నీ ఆస్తినంతా కాజేయాలని చూస్తున్నాడు. మీ బాబాయి చేసేది అంతా మోసం, మాయ. ఆ మాయలో నువ్వూ, మీ నాన్న చిక్కుకున్నారు.

ఇప్పటికయినా మించిపోయిందేమీ లేదు. దాన్ని వది లేసి, నా లిల్లీని చేసుకో, నాకున్న ఆస్తినికూడ నీకే యిచ్చేస్తాను. నీకోసం లిల్లీ రాత్రింబవళ్ళూ కలవరిస్తుంది. నువు గనక యింకో పెళ్ళి చేసుకొన్నావంటే అది యింత విషం మింగి చస్తుంది'' యింకా ఏదో చెప్పబోతున్నాడు పరంధామయ్య.

''మామయ్యా!'' ఆవేశంతో పిచ్చిగా అరిచాడు రమేష్, అది రోడ్డు అన్న సంగతికూడ మరచిపోయి.

''ఇంకోసారి నీ మాయకబుర్లు, పిచ్చిమాటలు మాట్లాడా వంటే, నీ నాలుక చీరేస్తాను,'' బిగ్గరగా అరిచాడు రమేష్.

అప్పటిదాకా పరంధామయ్య అన్న మాటలు విని, అవ మానంతో కుంచించుకుపోయిన కరుణ, ''రమేష్, రా, ఇంటికి పోదాం, అనవసరంగా రోడ్డుమీద గొడవ దేనికి?'' అంటూ రమేష్‌ను చేయిపట్టి తీసుకెళ్ళి, కారులో కూర్చుంది.

కారు బయలుదేరింది.

కరుణని చూసి, పై కండువాని చేతిలోకి తీసుకొని దాన్ని గట్టిగా దులిపి, మళ్ళీ భుజానవేసుకొని వెళ్ళి పోయాడు పరంధామయ్య కోపంగా.

# 15

రాత్రి పన్నెండు గంటల సమయం—

ఆ రోజు సాయంత్రం, అంటే...రమేష్, కరుణ ఇద్దరు సినిమాకి వెళ్ళిన తరువాత కుమార్, రమేష్ గదిలోకి వెళ్ళి బ్యాటరీ సెల్స్‌తో పనిచేసే చిన్న మైకుని అమర్చాడు. ఆ మైక్‌కి సంబంధించిన స్పీకర్లను ఒకటి రమేష్ మంచం

దగ్గిర, రెండవది బాల్కనీలోను అమర్చాడు. మైక్ 'డూమ్'ని తన గదిలోకి పెట్టుకొన్నాడు.

అంటే రమేష్ గదిలో ఏ చిన్న శబ్దం అయినా అది తమ గదిలోకి వినిపిస్తుంది.

మైక్ లోంచి ఏదో శబ్దాలు వినరాసాగాయి. ప్రొఫెసర్ హరనాథ్ కి అప్పటికే బాగా నిద్ర పట్టింది. కుమార్ కి నిద్ర పట్టక అటూ యిటూ దొర్లసాగాడు.

మైకులోంచి వచ్చే శబ్దాలు విని కుమార్ చెవులు నిక్కబొడుచుకున్నాయి.

రమేష్ గదిలోంచి మైక్ ద్వారా చిన్నచిన్న మూల్గులు వినరాసాగాయి. ఆ మూల్గులలో ఎవరితోనో కలబడుతున్నట్లు గాను, గింజుకున్నట్లుగాను, ఏదో పెద్ద బరువును మోస్తు న్నట్లుగాను వినబడసాగాయి కుమార్ కి.

వెంటనే మంచంమీదనుంచి లేచాడు కుమార్.

రమేష్ గదిలోంచి ఏదో క్రింద పడినట్లు శబ్దం అయింది. డ్రాయరు సొరుగులోంచి రివాల్వర్ తీసుకొని, హరనాథ్ ని లేపి, బయటకు పరుగెత్తి రమేష్ గదిదగ్గిరకు వచ్చి తలుపులు తోసాడు. కాని తలుపులు తెరచుకోలేదు.

తను తలుపులు తట్టికూడ ప్రయోజనం లేదనుకొని కిటికీ లోంచి లోపలకు చూసాడు. అప్పుడే ఏవో ఆకారాలు బాల్కనిలోంచి క్రిందకు దూకడం కనిపించింది. వెంటనే మెట్లమీదనుంచి రివ్వున పరుగెత్తి బయటకు వచ్చాడు.

ఏదో కారు స్టార్టయి మేడ వెనకాలి తోటలోంచి మెయిన్ గేటువైపు రాసాగింది.

చేతిలోని రివాల్వర్ ని పొజిషన్ లో పట్టుకొని, చెట్టు చాటున నక్కాడు కుమార్.

కారు పోర్టికోలో మలుపు తిరిగి గేటువైపు వెళ్ళే సమయంలో కుమార్ గురిచూసి కారు బ్యాక్ టైరును బర్‌స్ట్ చేసాడు రివాల్వర్ బుల్లెట్‌తో.

'కీచు' మంటూ ఆగిపోయింది కారు.

రివాల్వర్ ప్రేలిన శబ్దానికి గోపాలరావు తదితరులు బయటకు వచ్చారు.

"అందరూ బుద్ధిగా వచ్చి లొంగిపొండి. లేకపోతే ప్రాణాలు తీయటానికికూడ వెనకాడను," అన్నాడు కుమార్ పెద్దగా, కారులోనివాళ్ళ నుద్దేశించి.

కాని ఎవరూ కారు దిగలేదు.

మరి కొద్దిసేపట్లో పోలీసువ్యాన్ లోపలకు వచ్చి ఆగింది. వానులోంచి ఇన్‌స్పెక్టరు దిగాడు గబాగబా. ఆయన వెనకాలే నలుగురు కాన్‌స్టేబుల్సుకూడ దిగివచ్చారు.

"మీలో హరనాథ్ గారు ఎవరు?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"నేనే" అంటూ ముందుకు వచ్చాడు ప్రొఫెసర్ హరనాథ్.

"మీరేనా మాకు ఫోను చేసింది," అడిగాడు యిన్‌స్పెక్టర్.

"అవును. నేనే. అదుగోండి ఆ కారులో దాక్కొన్నారు, వెళ్ళి అరెస్టు చేయండి," అన్నాడు కారువైపు చూపిస్తూ.

అప్పటిదాకా కారులో దాక్కొన్న నలుగురు వ్యక్తులను పోలీసులు లాక్కొచ్చారు వెలుతురులోకి.

ఆ నలుగురిలో ఒకతను పరంధామయ్య. మిగతా ముగ్గురు ఆ వూర్లో పేరుమోసిన గూండాలు.

"మెనీ థాంక్స్, ప్రొఫెసర్ జీ! రేపు మీరొకసారి స్టేషన్‌కు వచ్చి స్టేట్‌మెంటు యిచ్చి వెళ్ళండి," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పరంధామయ్యతో సహా మిగతా ముగ్గురకు కూడ అర దండాలు తగిలించి వాన్‌లో ఎక్కించుకొన్నారు.

అప్పటిదాకా నోరు వెళ్ళబెట్టుకొని చూస్తోన్న గోపాల రావుకి యివేమీ అంతుబట్టక అయోమయంలో పడ్డాడు.

ప్రొఫెసర్ హరనాథ్ కారు దగ్గరకు వచ్చి, తలుపు తీసి చూసాడు.

లోపల రమేష్, కరుణ యిద్దరూ స్పృహ లేకుండా పడి ఉన్నారు. వాళ్ళిద్దరినీ ఆ స్థితిలో చూసిన గోపాలరావు, "హరనాథ్ గారూ! ఏమిటిది? వీళ్ళెందుకు యిట్లా పడి ఉన్నారు. అసలు యిందాక గొడవ ఎందుకు జరిగింది?" అడిగాడు కంగారుగా.

"మీరేమి కంగారు పడకండి. వీళ్ళిద్దరికీ క్లోరోఫారం వాసన చూపించి స్పృహ తప్పించారు. మిగతా కథ లోపలకు వెళ్ళిన తరువాత చెప్తాను. ముందు మీరు వెళ్ళి ఫోన్ చేసి, డాక్టర్ని పిలవండి" అన్నాడు.

రమేష్‌ని, కరుణని కారులోంచి బయటకు తీసి, చేతుల మీద లోపలకు మోసుకెళ్ళారు.

# 16

ప్రొఫెసర్ హరనాథ్, కుమార్‌లు తమ గదిలో కూర్చొని ఏదో మాట్లాడుకుంటున్నారు. అప్పుడు సమయం రాత్రి మూడుగంటలు దాటింది.

గోపాలరావు, డాక్టర్ని పంపించి, మళ్ళీ ప్రొఫెసర్ ఉన్న గదిలోకి వచ్చాడు.

"హరనాథ్ గారూ! పరంధామయ్య చెడ్డవాడని తెలుసుగాని, మరీ యింతటి దుర్మార్గుడని తెలియదు నాకు. అయినా అతను ఎందుకు చేసాడీ పని" అడిగాడు గోపాలరావు.

సిగిరెట్టు వెలిగించుకొని, చెప్పసాగాడు హరనాథ్.

"నేను మొదటిసారి పరంధామయ్యను చూసినప్పుడే అతని మనస్తత్వాన్ని గ్రహించాను. అతను అనుకొన్నది జరగాలి. అది జరగకపోతే బలవంతంగానైనా, బెదిరించి గాని తన పని చేసుకుపోయే రకం.

అతను ఏదో దుర్మార్గపు పని చేస్తాడని నాకు మొదటి నుంచి అనుమానంగానే ఉన్నది. కాని అతను ఎప్పుడు తన పనిచేస్తాడో తెలియదు.

అందుకోసమని రమేష్ గదిలో, బ్యాటరీ సిస్టమ్‌తో పనిచేసే మినీ మైక్ సెట్టును రహస్యంగా పెట్టాను. దాని ద్వారా రమేష్ గదిలో ఏం జరుగుతున్నదో నాకు స్పష్టంగా తెలుస్తుంది.

రమేష్, కరుణ సాయంత్రం మొదటి ఆట "జీవన తరంగాలు" సినిమాకు వెళ్ళారు. ఆ సినిమాకే వచ్చాడు పరంధామయ్యకూడా. రమేష్‌కు, పరంధామయ్యకు చిన్న గొడవ అయింది, మనం తీసుకొచ్చిన రాజీ గురించి.

పరంధామయ్య 'జీవన తరంగాలు' సినిమా చూసిన తరువాత ఒక ప్లాను వేసుకొన్నాడు.

ఆ సినిమాలో యిదేమాదిరిగా హీరోయిన్‌కి, హీరో క్లోరోఫారం వాసన చూపించి, కారులో ఎత్తుకెళ్ళిపోయి ఒకచోట పెండ్లి ఏర్పాట్లు చేయించి, హీరోయిన్‌ని స్పృహాలేని సమయంలో తనతోపాటు పెండ్లి పీటలమీద

కూర్చోపెట్టుకొని, తాళి కట్టేస్తాడు. తాళి కట్టేటప్పుడు ఫోటో తీయిస్తాడు.

అదేవిధంగా యిప్పుడు రమేష్ చేత లిల్లీకి తాళి కట్టిస్తే ఆ సమయంలో ఫోటో తీయించి, ఆ ఫోటో తీసుకొని కోర్టుకు వెళ్ళి, నీ కొడుకుని అల్లుడిగా చేసుకొందామని ప్లాను వేసాడు. ఆ తరువాత అతనిద్వారా మీ ఆస్తిని కాజేయవచ్చు.

కాని యిక్కడ మేము చేసిన ఏర్పాట్లు అతనికి తెలియవు. సరాసరి వచ్చి బోనులో పడ్డాడు.

నిజంగా పరంధామయ్య తెలివితక్కువవాడు. అతన్ని చూస్తే నాకు జాలివేస్తుంది. అతనికి ముందుచూపే గాని, వెనకచూపు లేదు'' అని చెప్పటం ముగించాడు ప్రొఫెసర్ హరనాథ్.

అంతా విని ఆశ్చర్యపోయాడు గోపాలరావు.

''ఇకపోతే నేను వచ్చిన పని అయింది. రేపే నేను విజయవాడ వెళ్తాను. నేను వెళ్ళేముందు మీకు కొన్ని విషయాలు చెప్పాలి,'' అన్నాడు ప్రొఫెసర్.

''చెప్పండి.''

''మీరు సాధ్యమయినంత త్వరలో, కరుణకు, రమేష్‌కి పెళ్ళిచేసి, ఆ తరువాత మీరందరూ యిక్కడనుంచి మకాం మార్చేసి ఏ దూరపు ప్రదేశమో వెళ్ళిపోయి, అక్కడ కాలం గడపండి.''

''అదే మీరు గనక ఇక్కడ ఉన్నట్లయితే యెప్పటికయినా కొన్ని చీడపురుగులు, అతని మెదడు తొలచి, రాజీ నకిలీ జన్మను గురించి బయటపెడతాయి. అదే జరిగితే రమేష్ మళ్ళీ మీకు దక్కడు. కాబట్టి నేను చెప్పింది చేయండి, సాధ్యమయినంత త్వరలో.''

"అలాగే, మీరు చెప్పినట్లే చేస్తాను. మాకున్నది వాడొక్కడే కొడుకు, వాడి బాగు గురించి, ఎక్కడికైనా, ఎంతదూరం అయినా పోతాను" అన్నాడు గోపాలరావు.

"ఇక్కడ యిక నా పని అయిపోయింది కాబట్టి, నేను, కుమార్ రేపు ఉదయమే ప్రయాణమవుతాము. దయచేసి మా ప్రయాణానికి ఏర్పాట్లు చేయండి," అన్నాడు ప్రొఫెసర్ హరనాథ్.

"మీకు ఏ విధంగా కృతజ్ఞతలు చెప్పుకోవాలో నాకు అర్థం కావటం లేదు. నా కొడుకుని బాగుచేయడమే గాకుండా, వాడ్ని పెద్ద ఆపదనుంచి కాపాడారు. మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను" అంటూ ఆనంద బాష్పాలు రాల్చాడు గోపాలరావు.

"ఇందులో నన్ను పొగడాల్సింది ఏమీ లేదు. నా కర్తవ్యం నేను నిర్వహించాను. 'గుడ్ నైట్'. ఇక వెళ్ళి పడుకోండి. రేపు ఉదయం కలుద్దాం," అంటూ బెడ్ మీదకు వాలాడు ప్రొఫెసర్ హరనాథ్.

—:ఐపోయింది:—

# ప్రేమలేఖలు

## హుస్సేన్ బాషా

"అల్లరి చెయ్యకుండా బుద్ధిగా కూర్చో!" రామారావును బంధించి తెచ్చిన నలుగురు వ్యక్తుల్లో—ఒక వ్యక్తి అన్నాడు.

"ఎవరు మీరు? నన్ను బంధించి యిక్కడికి ఎందుకు తెచ్చారు?" కోపంగా అడిగాడు రామారావు.

"ఎందుకో మాకు తెలియదు. మా బాస్ వచ్చేవరకు కాస్త ఓపిగ్గా కూర్చో! ఆయన నిన్ను ఎందుకు యెత్తుకు రమ్మన్నారో తెలుస్తుంది," అని ఒక వ్యక్తి సిగరెట్ వెలిగించుకుంటూ "మిస్టర్ రామారావ్! సిగరెట్ కాలుస్తావా?" అని అడిగాడు సిగరెట్ పేకెట్, అగ్గిపెట్టె యివ్వబోతూ.

"అక్కర్లేదు."

"నీకు చదువు వస్తుందనుకుంటాను."

"నా చదువుతో నీకేం పని?"

"ఇంకా అర్ధగంటకు గాని బాస్ యిక్కడికి రారు. అంతవరకూ టైం పాస్ కోసం!" అంటూ ఆ వ్యక్తి టేబుల్ మీదున్న రెండు, మూడు యింగ్లీషు మాగజైన్స్ తెచ్చి "చదువుకుంటూ వుండు" అన్నాడు.

అంతలో ఒక అందమైన యువతి అక్కడికి వచ్చింది.

"మిస్టర్ జాన్! రామారావ్ విషయం నేను చూసుకుంటాను. మీరందరూ వెళ్ళిపొండి" అందా యువతి.

"అలాగే మేడమ్!" అని అందరూ అక్కడ్నించి బయటికి వెళ్ళిపోయారు.

ఆ యువతి రామారావ్ ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

రామారావు ఆ యువతికేసి చూస్తూ "ఎవరు నువ్వు? నన్నిక్కడికి ఎందుకు రప్పించావు?" అని అడిగాడు.

ఆ యువతి అతనికేసి చూసి నవ్వింది. కాని, ఏమీ మాట్లాడలేదు. ప్రక్కనున్న మేగజైన్ అందుకొని తిరగ వేయ సాగింది నిర్లక్ష్యంగా.

"మిస్!..."

"నా పేరు రోజ!" అందామె మృధువైన స్వరంతో.

"మిస్. రోజీ! నన్నిక్కడికి ఎందుకు తెచ్చారు?"

"నీతో చాలా అవసరం వుంది."

"నాతో ఏమిటి మీ కవసరం?"

"కోపాన్ని తగ్గించుకో! అంతా వివరంగా చెబుతాను."

"చెప్పు!"

"నువ్వు నిరుద్యోగివి. అవునా?"

"అవును."

"నీకు పెళ్ళయింది కదూ?"

"నా భార్య నీకంటే అందంగా వుంది."

మిస్. రోజ, రామారావు సమాధానంతో చిన్న బుచ్చుకుంది. అంటే, అతని దృష్టికి తను అందగత్తె కాదని అతని భావం—అని అర్థం చేసుకుంది. మృదువుగా పువ్వులా నవ్విన మిస్. రోజ—ముఖం ముకుళించుకు పోయింది.

"నీ కాంప్లిమెంట్ భలే తమాషాగా వుంది" అంతలోనే ఆమె నవ్వింది.

"నీతో తమాషా చేయడం నాకిష్టంలేదు. నన్నిక్కడికి తీసుకురావడంలో అంతరార్థం ఏమిటి? చెప్పండి."

"నన్ను అడుగు! నేను చెబుతాను" అన్నాడు అప్పుడే లోపలకు అడుగుపెట్టిన బాస్.

"ఎవరో ఒకరు చెప్పండి!" అన్నాడు రామారావ్ ఆశ్చర్యంగా ముసుగువేషంలో వున్న బాస్‌కేసి చూస్తూ.

"మిస్టర్ రామారావ్! నిన్ను నిర్బంధించి రహస్యంగా యిక్కడికి తెప్పించినందుకు నన్ను క్షమించు!"

"మీరెవరో నాకు తెలియదు. మీ ఉద్దేశ్యం అసలే అర్థంకావడం లేదు. నన్ను మీరు క్షమాపణ కోరుతున్నారంటే మీ మనసెల్లాంటిదో నాకు అర్థమవుతోంది. ఇంత మంచి మనసు గలవారు నన్ను పిలిపించియుంటే నేరుగా వచ్చి మిమ్మల్ని కలుసుకునేవాణ్ని. నాతో మీకేం అవసరమొచ్చిందో చెప్పండి."

"మిస్టర్ రామారావ్! నువ్వు నన్ను అర్థం చేసుకున్నందుకు థ్యాంక్స్! నీకు ఉద్యోగం లేదు. భార్యా పిల్లల్ని

పోషించలేక వాళ్ళను పస్తులు పెడుతున్నావ్. చదువు కున్నవాడివి. ఈ వయసులో కడుపునిండా మూడుపూటలా తింటూ ఒంటికి మంచి బట్టలు కడుతూ భార్యాపిల్లల్ని సుఖపెట్టకుంటే భవిష్యత్తు ఎంత భయంకరంగా వుంటుందో ఊహించగలిగే శక్తి, జ్ఞానం నీలో వుండికూడా యింతటి నికృష్టపు జీవితాన్ని గడుపుతున్నావంటే, అది నీ దుర దృష్టమని యెవరూ అనుకోరు. అది నీ బలహీనత, పిరికి తనం అని నిన్ను చూసేవాళ్ళకు అనిపిస్తుంది.

ఆర్థిక పరిస్థితులు మనిషిని ఎంత కృంగదీస్తాయో; మని షిని ఎలాంటి అవమానాలకి బలిచేస్తాయో; సంఘంలో, ప్రపంచంలో, బంధుమిత్రుల్లో, చివరికి కన్న తల్లి-దండ్రులు, అన్న-తమ్ముళ్ళు, కట్టుకున్న భార్య దృష్టిలో ఎంత విలువలేకుండా చేస్తాయో ఆ విషయం నీకు నేను గుర్తు చెయ్యక్కర్లేదనుకుంటాను."

"ఇదంతా మీరు నాతో ఎందుకంటున్నారో కారణం నేను ఊహించలేకుండా ఉన్నాను. అసలు విషయ మేమిటో సూటిగానే చెప్పి అనండి."

"ఆల్ రైట్! ఇప్పుడు నేనా పాయింటుకే వస్తు న్నాను. నీ క్షేమంకోరినవాడినై, నీ శ్రేయోభిలాషిగా చెబుతున్నాను. నేను చెప్పినట్లు నువ్వు చేస్తే ఈ క్షణం లోనే నీకు యిరవైఅయిదువేలు రూపాయలు కాష్ యిస్తాను. ఆ డబ్బుతో ఒక మంచి బిజినెస్ పెట్టుకొని జీవితరథాన్ని పూలబాటపై నడిపించవచ్చు!"

రామారావ్ ఆశ్చర్యభరితుడయ్యాడు. కటిక దరిద్రాన్ని అనుభవిస్తున్న తనకు ఒక్కసారి 25 వేలు రూపాయలు లభిస్తే, బాస్ చెప్పినట్లు తన జీవితం పువ్వులా పరిమ

రిస్తుంది. కాని, అతను అంత డబ్బు తనకు యివ్వడంలో ఆంతర్యం ఏమిటి?

"అంత డబ్బు మీరు నాకు ఎందుకు యివ్వదలచారు?"

"మిస్టర్ రామారావ్! నీ వివాహపూర్వం నిన్ను ప్రేమించి, భర్త చాటుగా నీతో స్వర్గసుఖాలు పొందిన నీ మాజీ ప్రియురాలు మాధవికి ఒక ఉత్తరం వ్రాసి యివ్వు-నేను చెప్పినట్లు!"

రామారావ్ ఆశ్చర్యచకితుడయ్యాడు.

"మా ప్రేమరహస్యం మీకెలా తెలుసు?"

"నాకు మీ జీవిత చరిత్రలంతా తెలుసు."

"ఇప్పుడు మాధవికి నాకు ఎలాంటి సంబంధం లేదు. పది సంవత్సరాల విషయాన్ని మీరు బయటికి తెస్తున్నారు. నేను మాధవిని పూర్తిగా మరిచిపోయాను."

"అది నాకు తెలుసు. మాధవి నీకు వ్రాసిన ప్రేమ లేఖలు..."

"మీకు యివ్వాలా?"

"ఆ శ్రమ నీకక్కర్లేదు. వాటిని ఏనాడో సంపా దించాను."

"అబద్ధం! వాటిని నేనెంతో జాగ్రత్తగా దాచి వుంచాను."

అతను నవ్వాడు మళ్ళీ. "అవి నాదగ్గర భద్రంగా వున్నాయిగాని, నేను చెప్పినట్లు ఉత్తరం వ్రాసి ఇవ్వు!"

"ఏమని వ్రాయాలి?"

"వెంటనే ఒక లక్షరూపాయలు యివ్వకుంటే ఆ ప్రేమలేఖలను బహిరంగపరిచి నీ బ్రతుకు బజారుపాలు చేస్తాను అని వ్రాసి నీ సంతకం పడేస్తే ఆ డబ్బు అందు

కునే మార్గం నేను చూసుకుంటాను. అందుకు యిరవై ఐదువేల రూపాయలు పారితోషికం నీకు ముడుతుంది.''

రామారావు దిగ్గున లేచాడు.

''నన్ను క్షమించండి! ఈ పని నావల్ల కాదు. డబ్బుకు ఆశపడి నేను యింతటి నీచమైన పని చేస్తానని మీరు భావించి నన్నిక్కడికి తెచ్చియుంటే అది మీ పొరబాటే అవుతుంది. ముసుగులోవున్న మీరెవరో నేను తెల్సుకో డానికికూడా ప్రయత్నించను. నన్ను వదిలెయ్యండి!''

''మిస్టర్ రామారావ్! తొందర పడుతున్నావేమో. కాస్త ఆలోచించుకో! నీతోబాటు నువ్వు రహస్యంగా దాచివుంచిన పాత ప్రేమలేఖలు!...'' అని బాస్ ముసుగు లోంచి కొన్ని కాగితాలు తీసి రామారావుకు చూపుతూ, ''ఇవిగో! నా దగ్గర భద్రంగా వున్నాయి. మాధవిని బ్లాక్ మెయిల్ చేసి ఎంత డబ్బయినా నేను గుంజగలను. కాని, ఈ వ్యవహారమంతా స్వయంగా నీతోనే నడిపిస్తే మాకూ, నీకూ ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.''

''డబ్బుకోసం మాధవిని కీలుబొమ్మగా ఆడించాలను కొనియుంటే ఆ పని ఏనాడో నేను చేసియుందును. నా జీవితం స్వర్ణతుల్యంగా అయ్యేది! మాధవి దృష్టిలో నే నంతటి ద్రోహిగా, నీచునిగా నిలువకూడదు. మీ తుచ్ఛ ఆశయం నెరవేరేది కాదు. నన్నిక్కడికి యెలా తెచ్చారో అలా విడిచిరమ్మని మీ అనుచరులతో చెప్పండి!''

''నువ్వు యిక్కడ్నించి బయటికి వెళ్ళలేవు మిస్టర్ రామారావ్! నేను చెప్పినట్లు నువ్వు వినకుంటే?...'' అంటూ రివాల్వర్ తీసి గురిపెట్టాడు బాస్.

రామారావు నిర్ఘాంతపోయాడు.

# 2

"అమ్మగారూ! బాబుగారు ఫోన్ చేశారు. మీతో మాట్లాడాలంటున్నారు" అన్నాడు యింటి నౌకరు వెంకయ్య.

"అలాగే వెంకయ్యా! పాపను జాగ్రత్తగా స్కూల్లో విడిచివచ్చావు కదూ?"

"విడిచి వచ్చానమ్మగారూ! సరోజమ్మ ఏదో ఇంగ్లీషు పుస్తకం మరిచిపోయిందట. ఇంటికి వెళ్ళి త్వరగా తెచ్చి యివ్వమందమ్మా!" అన్నాడు నౌఖరు.

"టేబుల్ మీద వుంది. తీసుకెళ్ళి యిచ్చి త్వరగా వచ్చెయ్" అని చెప్పి మాధవి డ్రాయింగ్ రూములోకి వెళ్ళి ఫోన్ ఎత్తి "హల్లో!" మాధవిని మాట్లాడుతున్నానండీ!" అంది అవతల భర్త కామేశాన్ని ఉద్దేశించి.

"మధూ! రేపు ఉదయం ఢిల్లీలో 'ఆలిండియా ఫ్యాక్టరీ డైరెక్టర్స్ మీటింగ్' జరుగబోతుంది. తప్పకుండా మీటింగుకు హాజరుకమ్మని యిప్పుడే టెలిగ్రాం మెసేజ్ వచ్చింది. నేను సాయంత్రమే ఢిల్లీ వెళ్ళాలి. ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు చేసివుంచు."

"ఈసారి ఢిల్లీకి వెళితే నన్నూ, పాపను తీసుకెళ్తానన్నారు. ఢిల్లీ సందర్శించాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను. నేను కూడా వస్తానండి."

"మధూ! పాస్‌పోర్ట్ యిచ్చేది నా కొక్కడికే! నీకంత కోరికగా వుంటే మళ్ళీ ఎప్పుడైనా తీసుకువెళ్తాను."

"ఎప్పుడూ ఏదో ఒకటి చెప్పి తప్పించుకుంటున్నారు" నిరుత్సాహంగా అంది.

"బాధపడకు మధూ! ఇంటికి వచ్చాక మాట్లాడుకుందాం. ఢిల్లీ ఫైల్సు చెక్ చేసుకోవాలి. ఫోన్ పెడు

తున్నాను,'' అని ఫోన్ డిస్‌కనెక్ట్ చేశాడు కామేశం.

మాధవి రిసీవర్‌ను రెస్ట్ చేసింది.

"అమ్మగారూ! పోస్ట్‌మన్ ఉత్తరాలు ఇచ్చి వెళ్లాడు,'' అని చేతిలోని ఉత్తరాలను మాధవికిచ్చాడు వెంకయ్య.

"నువ్వింకా యిక్కడే వున్నావా?''

"పుస్తకం తీసుకొని వెళుతుంటే గేటుదగ్గర పోస్ట్‌మన్ ఎదురుపడి ఉత్తరాలు యిచ్చి వెళ్ళాడు. ఇవి మీకు ఇచ్చి పోదామని, మీరు బాబుగారితో ఫోన్‌లో మాట్లాడుతుంటే యిక్కడే నిలుచున్నానమ్మగారూ!''

"పాప నీకోసం ఎదురుచూస్తుంటుంది. నువ్వు త్వరగా వెళ్ళు!''

వెంకయ్య వెళ్ళిపోయాడు.

మాధవి ఉత్తరాలన్నీ చూసింది. వాటిల్లో తనపేరట వచ్చిన కవరు కంటబడింది. సామాన్యంగా తన పేరుమీద ఉత్తరాలు రావు.

తనకు ఉత్తరం ఎవరు వ్రాసివుంటారా అని ఆలోచిస్తూ, కవరు సీలు చించి అందులోంచి గులాబిరంగు కాగితాన్ని బయటికి లాగింది. మడతలు విప్పి చూసింది. అక్షరాలు గుర్తుపట్ట గలిగింది. ఆత్రతగా ఉత్తరం చివరన చూసింది. రామారావు సంతకం స్పష్టంగా వుంది. రామారావు యిన్నాళ్ళకు తనకు మళ్ళీ ఉత్తరం వ్రాయడం ఆశ్చర్యంవేసి చదువసాగింది.

"మాధవీ!—

మనం ఒకనాడు గాఢంగా ప్రేమించుకున్న ప్రేమికులము. నువ్వు వివాహితురాలివి గనుక నీ ప్రేమను శాశ్వతం చేసుకోలేకపోయాను. నీ బలవంతంమీదనే నేను లలితను

వివాహం చేసుకున్నాను. అప్పట్నుంచి మనం దూరమై పోయాము. నువ్వు నన్ను మరిచిపోయావు. అలాగే నేను కూడా నీమీద వ్యామోహాన్ని చంపుకున్నాను. ఎవరి దారి వారిది, ఎవరి బ్రతుకు వారిదై పోయింది.

కాని, మాధవి ఆనాడు మనం ప్రేమలేఖలను వ్రాసుకున్నాం. నేను వ్రాసిన లేఖల్ని నువ్వు చదువుకొని, అవి నీ భర్త కంటబడకుండా జాగ్రత్తగా వుండడానికి ఎప్పటి కప్పుడు చింపేసి వుంటావు. కాని, నేను నువ్వు వ్రాసిన లేఖల్ని జాగ్రత్తగా లలిత కంట బడకుండా దాస్తూ వచ్చాను. ఎప్పుడైనా నువ్వు జ్ఞాపకమొస్తే వాటిని ఏకాంతంలో చదువుకొని నా భార్య లలితలో నిన్ను చూసుకుంటూ సంతృప్తి చెందేవాడిని. పాప సరోజను చూసి నప్పుడంతా నీతో గడిపిన మధురక్షణాలు, పొందిన ఆనందానుభూతులు, అనుభవించిన స్వర్గసుఖాలు...మధుర స్మృతులుగా నా నేత్రాల్లో కారుమేఘాల్లా కదిలిపోయేవి.

"రామూ! నీ ప్రేమచిహ్నంగా పుట్టిన కూతురు సరోజ. నా జీవితంలో మరుపురాని మధురస్మృతి సరోజ! పెళ్లైన అయిదేళ్ళనుంచి సంతానం లేక ఎంతో ఆత్మక్షోభను అనుభవిస్తున్న నాకు, తల్లిని అయ్యే భాగ్యాన్ని ప్రసాదించావు! జీవితంలో నిన్నెప్పటికీ మరువలేను" అని వ్రాసిన మాటలు నేనెప్పటికీ మరిచిపోలేను మాధవీ!

కాని, భగవంతుని లీలలు చాలా విచిత్రమైనవి. ఈ పదేళ్ళలో మనిద్దరి జీవితాలు ఎంతో మారిపోయాయి. నేను ఉద్యోగం లేక చాలా పేదవాడినై పోయాను. అదృష్టం కలిసివచ్చి నువ్వు అనతికాలంలోనే ఊహించ నంతటి మలుపులోకి వెళ్ళిపోయావు. లక్షలకు అధికారిణి అయ్యావు.

ఇప్పుడు నాకు ఆ లక్షలు కావాలి. నీ రహస్యం బయట వెయ్యకుండా వుండాలంటే నాకు ధర్మంగా కాక పారితోషికంగా ఒక లక్షరూపాయలు పంపించు. రేపు సాయంత్రం 6 గంటలకు హోటల్ 'రాక్సీ', రూం. నెం. 141 లో నీ కోసం నా మిత్రుడు ఎదురుచూస్తుంటాడు. అతని పేరుతో నీకు పనిలేదు. అతను నల్లసూటులో ఉంటాడు. అతని కోటు కాలర్‌కు తెల్ల గులాబీపువ్వు వుంటుంది. నిన్ను అతను బాగా గుర్తు పట్టగలడు.

అతను నిన్ను చూస్తూనే "నన్ను 'డబుల్ ఆర్' పంపించాడు" అంటాడు. వెంటనే అతనికి క్యాష్ యిచ్చేసి వెళ్ళిపో! ఏమోలే అని నిర్లక్ష్యం చేశావంటే మరునాటి పోస్టులో నీవు వ్రాసిన ఉత్తరాలన్నీ నీ భర్తకు చేరుతాయి. లక్షరూపాయలు! జ్ఞాపకముంచుకో!

ఇట్లు,
రామారావ్."

ఉత్తరం చదువుతున్న మాధవికి ఒక్కసారి గుండాగినంత పనైంది.

ఆమె చేతులు ఒణికాయి. హృదయం ఆందోళన చెందింది. మనసులో తుఫాను రేగింది. రామారావ్ ఆమె కళ్ళముందు నిలబడి పరిహసిస్తున్నట్లు కనిపించేసరికి ఆకులా ఒణికిపోయింది.

రామారావు చివరికి యింతకు తెగిస్తాడని మాధవి కలలోకూడా భావించలేదు. ఆ లేఖలు తన భర్తకు అందితే జరిగే పరిణామమేమిటో తలుచుకునేసరికి మాధవికి దుఃఖం వచ్చింది. గత జీవితాన్ని నెమరువేసుకొని పసిపిల్లలా ఏడ్చింది.

రామారావు ఒకనాడు తననెంతో ప్రేమించాడు. నీతోనే నాకు లోకం! నువ్వే నా సర్వస్వం! నువ్వు నా ఆరాధ్యదేవతవు! అని తనకోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడేవాడు. తను వివాహిత గనుక ఆ ప్రేమ చిరకాలం మధుర మనోహరంగా సాగదని ఆమెకు తెలుసు. అందుకే తన బలవంతంమీద అతన్ని పెళ్ళికి సుముఖుడ్ని చేసింది.

"ఏనాటికైనా నువ్వు సుఖంగా వుంటే నాకు అంతే చాలు మాధవీ!" అన్న రామారావ్ చివరికి బీదరికాన్ని అనుభవించలేక డబ్బుకోసం యింతటి నీచానికి పాల్పడ తాడని మాధవి ఏనాడూ తలపోయలేదు. ఇప్పుడు యేం చేయాలో అర్థంగాక అలాగే ఏడుస్తూ వుండిపోయింది.

అలా మాధవి ఎంతసేపు ఏడ్చిందో ఆమెకే తెలియదు.

"మధూ! మధూ!!" అన్న భర్త పిలుపుతో ఉలికి పడింది మాధవి. ప్రక్కన పడియున్న ఉత్తరాన్ని అందు కొని కన్నీళ్ళు తుడుచుకుంటూ "ఎంత సేపయిందండీ వచ్చి?" అని అడిగింది.

మాధవిని చూసి కామేశం ఆశ్చర్యపడ్డాడు.

"ఎందుకు ఏడుస్తున్నావు?"

మాధవి కంగారుపడింది.

"దుఃఖవార్త అందింది. మనసు బాధ పడింది. ఏడ్చే శాను," అంది తన కంగారును కప్పి పుచ్చుకుంటూ.

"అంటే?"

"గుంటూరులో నా బాల్యస్నేహితురాలు వుంది. ఆమె భర్త వారంరోజుల క్రితం ఏదో ట్రైన్ ఆక్సిడెంట్‌లో చనిపోయాడట! ఈ వయసులోనే భర్తకు దూరమై విధవ నయ్యాను మాధవీ! అంటూ ఎంతో బాధపడుతూ ఉత్తరం వ్రాసింది. మూడుపువ్వులు ఆరుకాయలుగా వికసించవలసిన

దాని జీవితం అడవిగాచిన వెన్నెల అయినందుకు నాకు దుఃఖం ముంచుకు వచ్చింది."

"పాపం! దురదృష్టవంతురాలు! మధూ! గుంటూరులో నీకో స్నేహితురాలు వుందని నాతో ఎన్నడూ చెప్పలేదే!" అన్నాడు అనుమానంగా.

"ఆమె ఈ ఊర్లోనే వుండేది. ఆమె భర్తకు ఉద్యోగం ట్రాన్స్‌ఫర్ అయి ఈ మధ్యనే గుంటూరుకు వెళ్ళారు."

కామేశం మరేమీ మాట్లాడలేదు. మాధవి లేచి భర్తకు వడ్డించటానికి డైనింగ్ రూమ్‌కు వెళ్ళింది.

## 3

కామేశం ఢిల్లీకి వెళ్ళాడు.

మాధవి బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది.

రామారావుని కలుసుకొని అతనికి ఏదైనా వ్యాపారం చేసుకొని జీవించడానికి పదివేల రూపాయలు సహాయం చేసి, అతని దగ్గరున్న ప్రేమలేఖలను తెచ్చుకోవాలనుకుంది.

అయిదు గంటలకు రామారావు యింటికి కారులో బయలుదేరింది మాధవి.

మాధవి తమ ఇంటికి రావడం చూసి రామారావు భార్య లలిత చాలా ఆశ్చర్యపడింది. ఆమె యెవరో లలితకు తెలియదు. కాని, లలిత రామారావు భార్య అని మాధవికి బాగా తెలుసు. లలిత బాగా చదువుకున్నది. తెలివైనది.

"లలితా! రామారావు ఉన్నాడా?" అని అడిగింది మాధవి.

"మీ రెవరు?"

"నా పేరు మాధవీ కామేశం!"

ఆశ్చర్యపోయింది లలిత. మాధవి గురించి రామారావ్ భార్యతో వారి పూర్వ ప్రణయగాథను చెప్పాడు. మాధవిని పూర్తిగా మరిచిపోయానన్నాడు. అది ఏనాడో జరిగిన ప్రేమకథ గనుక లలిత ఆ విషయాన్ని అంతగా ఆలోచించలేదు. పెళ్ళయిన దగ్గర్నుండి మాధవితో తన భర్తకు ఏలాంటి సంబంధం లేదని లలితకు తెలుసు.

మాధవిమీద లలితకు ఏలాంటి ఈర్ష్యాసూయ, ద్వేష భావాలు లేవని చెప్పవచ్చు! మాధవి ఒక అఘాధికారి భార్య! ఏ కారణంగా రామారావ్ కోసం వచ్చిందో లలితకు తెలియదు. కాని, ఆమె దీన హీన స్థితికి మాధవి ముందు ఎంతో సిగ్గువేసింది.

"కూర్చోండి!" అభిమానంతో కుంచించుకుపోతూ మాధవికి ఓ పక్క మంచం చూపిస్తూ ఆహ్వానించింది.

మంచంపై ఒక వారగా కూర్చుంది మాధవి.

"రామారావు యెక్కడికి వెళ్ళాడు?" అడిగింది నెమ్మదిగా.

"రెండురోజులనుంచీ వారు యింటికి రావడంలేదు. ఎక్కడికి వెళ్ళారో నాతో చెప్పి వెళ్ళలేదు. ఏం చెప్పాలో చెప్పండి! వారు వచ్చాక మీరు వచ్చి వెళ్ళినట్లు చెబుతాను."

"నువ్వెంతో మంచిదానివి లలితా!—లలితా! నువ్వు నాకు చెల్లెలులాంటి దానివి. నువ్వు నాకు సహాయం చేసి పెడతావా!"

"నేను మీకు సహాయం చేయడమా?"

మాధవి వెంటనే లలిత చేతులు పట్టుకుంది. మాధవి కన్నీళ్ళు లలిత చేతులమీద వెచ్చగా పడ్డాయి. లలిత

కంగారు పడింది. "ఎందుకు ఏడుస్తున్నారు?" అని అడిగింది విస్మయం చెందుతూ.

"లలితా! ఇవి చేతులు కాదు."

"ఏం జరిగింది?"

మాధవి అంతా చెప్పింది.

"మాధవీ! మావారు యింతటి నీచానికి దిగజారిపోయారంటే నేను నమ్మలేకుండా వున్నాను."

"నీ భర్త వ్రాసిన బెదిరింపు ఉత్తరం యిదిగో!" అంటూ మాధవి లలితకు ఉత్తరం యిచ్చింది.

లలిత ఆ ఉత్తరాన్ని చూసి దిగ్భ్రమ జెందింది.

"మాధవీ! వారు రెండురోజులనుండి యింటికి ఎందుకు రాలేదో కారణం నాకిప్పుడు అర్థమైంది. వారికి లక్ష రూపాయలు కాదు కదా ఒక పైసా యివ్వకండి. వారి దగ్గరున్న ఉత్తరాలను అడిగి యిప్పించుకొని మీకు నేనే వచ్చి యిస్తాను. ఈ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి. రేపు మీరు భయపడి డబ్బు తీసుకొని హోటల్ రాక్సీకి వెళ్ళకండి. ఆ నల్లసూటు మనిషికి, మా వారికి ఏం సంబంధముందో నేను తెలుసుకుంటాను. అతనిద్వారా మా వారిని కలుసుకొని బాగా బుద్ధి చెబుతాను. ఆ ఉత్తరాలను యిప్పించుకొని మీకు తెచ్చియిస్తాను. ఏమీ దిగులు చెందకుండా మీరు యింటికి వెళ్ళండి?"

"ఈ పదివేల రూపాయలు నీ దగ్గర వుంచు లలితా!"

"ఎందుకు నా కింత డబ్బు. శ్రమకు ప్రతిఫలమా?"

"కాదు. ఈ డబ్బుతో రామారావును ఏదైనా వ్యాపారం చేసుకోమని చెప్పు లలితా!"

"అక్కర్లేదు. తీసుకువెళ్ళండి!"

"ఉంచు లలితా!"

"మిమ్మల్ని నా సహోదరిలా గౌరవించడం నా విధి! సాటి స్త్రీ కాపురం, చక్కదిద్దడం నా కర్తవ్యం! ప్రతి ఫలాన్ని కోరి చేసే సహాయానికి విలువ వుండదు. మావారు చేసిన నీచమైన పనికి నేనెంతో సిగ్గుపడుతున్నాను. వారు తలబెట్టిన ద్రోహానికి వారి తరఫున నేను క్షమాపణ కోరుతున్నాను."

లలిత విశాల హృదయానికి మాధవి చకిత అయింది.

"ప్రపంచంలో స్త్రీ చరిత్రనుండి దిగజారిపోవాలని ఏనాడూ అనుకోదు. పవిత్రంగా జీవించాలని, జ్యోతిలా ప్రకాశించాలనే కోరుకుంటుంది. కాని, మాధవీ! పరిస్థితుల ప్రాబల్యంవల్లనో, బ్రహ్మ నొసట గీసిన అక్రమరేఖా ప్రభావంవల్లనో ఏ తప్పూ చేయకూడదని మానవులనుకుంటారో ఆ తప్పే తనకు తెలియకుండానే చేస్తుంటారు. ఆ తప్పును సరిదిద్దుకోవడానికి ప్రయత్నించినా అది నీడలా జీవితమంతా వెంటాడుతూ మనిషిని దుఃఖపూరితం చేస్తుంది.

మాధవీ! మీరు ఏనాడో తప్పు చేశారు. అది యీనాటికి మాయని మచ్చగా నిలిచిపోయి చివరికే మీకు ప్రాణాంతకమైంది. జరిగిందంతా ఒక పీడకలగా భావించండి! మా వారికి బుద్ధి చెప్పి జీవితంలో మళ్ళీ యెప్పుడూ ఎటువంటి పరిస్థితుల్లోనూ యిలాంటి అవినీతి పనులకు పూనుకోకుండా చూస్తాను. నాకేదైనా అవసరమొస్తే నేనే డబ్బుకోసం మీ దగ్గరికి వస్తాను. ఇప్పుడు చేయాలనుకున్న సహాయం ఆనాడే చేద్దురుగాని. ఇక మీరు ఇంటికి వెళ్ళి నిశ్చింతగా వుండండి!"

భారాన్నంతా లలితమీద వేసి యింటికి బయలుదేరింది మాధవి.

# 4

ఉదయం 9 గంటలకు మాధవికి ఫోన్ వచ్చింది.

"మాధవీ! అన్నట్లు నిన్న సాయింత్రం మా మనిషిని నువ్వు కల్సుకోలేదు. ఎందుకు?" అని అడిగిందో పురుష కంఠం. కంఠస్వరాన్నిబట్టి అతను రామారావు అని పసిగట్టడానికి ఎంతోసేపు పట్టలేదు మాధవికి.

"రామూ! నువ్వు నన్నింత మోసం చేస్తావని నేను కలలోకూడా అనుకోలేదు. నన్ను యిలా బాధపెట్టడం నీకు న్యాయంగా వుందా?"

"న్యాయాన్యాయాల గురించి చర్చించడాని కిది సమయం కాదు. లక్షరూపాయలు కావాలి నాకు. నా ఉత్తరాన్ని నువ్వు నిర్లక్ష్యం చేశావ్! ఏమిటి నీ ధైర్యం?"

"వెంటనే లలితను కలుసుకో రామూ!"

"నా ప్రవర్తనలో పరివర్తన కలిగించడానికి యెవ్వరితోనూ కాదు. లలిత నా మనసును మార్చి ఈ విషయంలో నిన్ను సహకరించలేదు."

"రామూ! మనం ఒకనాడు యెంతో యిదిగా ప్రేమించు..."

"షటప్! ఆ ప్రణయ ప్రసంగం నేను వినదలచుకోలేదు. ఇక నువ్వేం చెప్పినా నేను వినదలచుకోలేదు. సాయింత్రంలోగా డబ్బు నాకు అందజెయ్యాపోతే తెల్లారేలోగా ఏం జరుగుతుందో తెలుసా?"

"ఊహించగలను. నన్ను యిలా బాధించడంకంటే ఒకేసారి చంపేసి పుణ్యం కట్టుకో!"

"నో మాధవీ! నా అంచనాను తప్పుగా ఆలోచించావు. నీవు డబ్బు ఇవ్వకపోతే నువ్వు కుమిలి, కృశించి నశించిపోయేలా చేస్తాను. నావల్ల నీకు పుట్టిన సరోజను

నీకు దక్కకుండా చేస్తాను. సరోజ! నా కూతురని మాత్రం మర్చిపోకు! ఇప్పుడు నువ్వు కాదన్నా, ఆనాడు నువ్వు నాకు వ్రాసిన ఉత్తరాలు నీ అభిప్రాయాన్ని, అంగీకారాన్ని. నలుగురి ఎదుట ఋజువు పరుస్తాయి. నీ మర్యాద కాపాడుకోవాలంటే నిన్న చెప్పిన సమయానికి మా మనిషి నల్లసూటు ధరించి, తెల్లగులాబి పెట్టుకొని వస్తాడు; లక్షరూపాయలు అతనికి తప్పకుండా అందజేయి!"

మాధవి గుండె ఝల్లుమంది.

సరోజ తనకు దక్కకుండా పోతే తను జీవించలేదు.

భయాందోళనలతో ఆమె శరీరం గడగడలాడింది. దుఃఖం ముంచుకు వచ్చింది. కన్నీళ్ళు కురిశాయి. ఆమె కంఠం బొంగురు పోయింది. "రా...మూ!..." అని చెప్ప బోయేంతలో, రామారావ్ రిసీవర్ అవతల దించేసినట్లు క్లిక్ అన్న శబ్దం విన్పించగా రిసీవర్‌ను అలాగే ఒదిలేసింది మాధవి.

మాధవి పసిపిల్లలా ఏడ్చింది.

బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. వెంటనే టెలిఫోన్ డైరెక్టరీ అందుకొని డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ ఫోన్ నెంబర్ తెలుసుకుంది.

టెలిఫోన్ రిసీవర్ ఎత్తి ప్రేమ్‌కుమార్ ఫోన్ నెంబర్ డయల్ చేసింది.

"ఎస్...డిటెక్టివ్ జయశ్రీ ప్రేమ్‌కుమార్ స్పీకింగ్! ఎవరు మీరు?" అని అడిగింది జయశ్రీ, అటువైపునుండి.

"నా పేరు మాధవీ కామేశం! డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ గారితో అర్జంటుగా మాట్లాడాలి. ప్రేమ్‌కుమార్ గారు వున్నారా?"

"ప్రస్తుతం వారు యింట్లో లేరు. విషయమేమిటో

చెప్పండి!''

తన జీవితరహస్యాలు మగాళ్ళతో చెప్పుకోవడంకంటే జయశ్రీతో చెప్పుకోవడం మంచిది అనుకుంది మాధవి.

''జయశ్రీగారూ! నేను ఒక ఆపదలో చిక్కుకున్నాను. మీరు తప్పకుండా నన్ను కాపాడగలరని నేనాశిస్తున్నాను.''

''మీకేం ఆపద వచ్చింది?''

''ఫోన్‌లో చెప్పడం సమంజసంగా వుండదు. అది నా జీవితరహస్యం! నేను అక్కడికి రావడం శత్రువుకి తెలియకూడదు. దయచేసి మీరు వెంటనే మా యింటికి రండి! అన్ని విషయాలూ చెబుతాను. నాకేదో భయంగా వుంది, ప్లీజ్! మీరు అడిగే ఫీజుకూడా ముందే యిచ్చుకుంటాను'' అని ప్రాధేయపూర్వకంగా అడిగింది మాధవి.

''నేను ఇప్పుడే వస్తాను. మీ ఇంటి అడ్రసు చెప్పు!''

మాధవి అడ్రసు చెప్పింది.

## 5

జయశ్రీ, మాధవి దగ్గర్నుండి యింటికి వచ్చేసరికి ప్రేమ్‌కుమార్ భార్యకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

జయశ్రీ మాధవి కేసుగురించి చెప్పింది.

అంతా విని ''చాలా విచిత్రమైన కేసు!'' అని సిగరెట్ వెలిగించి ఆలోచనల్లో పడిపోయాడు ప్రేమ్‌కుమార్.

''ప్రేమలేఖల విషయం బయటపడితే మాధవి కాపురం పోతుంది. ఏనాడో మాధవి చేసింది తప్పే అయినా, కామేశమే కాదు; ఏ పురుషుడూ తనభార్య చేసిన తప్పును నిండుమనసుతో క్షమించలేడు. కనుక, మాధవి ఆ రహస్యం బయట పడకుండా పరిశోధన జరిపి రామారావు దగ్గరున్న ప్రేమలేఖల్ని సంపాదించమని చెప్పింది. రామారావును

శిక్షితుడ్ని చేసినా నలుగురికి ఆ విషయం తెలియకపోదు. ప్రేమలేఖలు అతనిదగ్గర లేకుండా చేస్తే ఏనాటికీ అతని వల్ల ఆమెకేమీ ప్రమాదముండదు.''

డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ ఏదో ఆలోచించి, రిసీవర్ ఎత్తాడు. హోటల్ రాక్స్‌కి డయల్ చేశాడు.

అవతలినుండి—

''మేనేజర్ రామస్వామి హియర్!...మీరెవరు?'' అని అడిగాడు మేనేజర్ రామస్వామి.

''నల్లనూటు - తెల్లగులాబీ!'' అన్నాడు గొంతు మార్చి ప్రేమ్‌కుమార్.

''ఓహ్! మిస్టర్ జాన్! ఎక్కడ్నించి మాట్లాడుతున్నావు?''

తన ఐడియా కార్యరూపం ధరించబోతున్నందుకు ప్రేమ్‌కుమార్‌కు కాస్త ఉత్సాహం కలిగింది. అరక్షణంలో యోచించి వెంటనే అన్నాడు, ''నేను బాస్ గదిలోంచే మాట్లాడుతున్నాను.''

''నిన్నటి ప్రోగ్రాం లలిత పాడుచేసింది. అందుకు బాస్ లలితను ఆమె పిల్లల్ని తన గదిలోనే బంధించారు. ఈరోజు ప్రోగ్రాం వేస్తే, మాధవి తెలివిగా డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ సహాయం కోరింది. మరి, మాధవి దగ్గర్నుండి లక్షరూపాయలు సాధించే ఉపాయాన్ని బాస్ ఏం ఆలోచించారు మిస్టర్ జాన్?''

ప్రేమ్‌కుమార్ అదిరిపోయాడు. అప్పుడే తమ విషయం వాళ్ళకు తెలిసిపోయిందంటే వాళ్ళదొక పెద్ద గ్యాంగ్ అయివుండాలని ఊహించాడు.

''ఏమో! ఇంకా ఏమీ చెప్పలేదు.''

''మరెందుకు ఫోన్ చేశావ్?''

"మిస్టర్ జాన్! డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ సహాయం కోరి మన ప్లాన్ చెడగొట్టింది మాధవి. కనుక, డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ హోటల్‌కు వచ్చి రూం నెం. 141 లో నిన్న దిగిన మనిషి ఎవరని నిన్ను వేధించి క్లూస్ తీయడానికి రావచ్చు! అతనడిగే ప్రశ్నలకు ఆలోచించి సమాధానాలు చెప్పు...అర్థమయిందా?"

"ఐ అండర్‌స్టాండ్ మిస్టర్ జాన్! మిస్. రోజీ ఏం చేస్తోంది?"

మిస్. రోజ యెవరో, ఆమె ఏం చేస్తుంటుందో ప్రేమ్‌కుమార్‌కు తెలియదు. దానికి ఏం సమాధానం యివ్వాలో అర్థంగాక వెంటనే సమాధానం యివ్వలేదు. అతను వెంటనే సమాధానం యివ్వకపోయేసరికి మిస్టర్ జాన్ అన్నాడు.

"మిస్ రోజీ బాస్ కాగిలిలో నలిగిపోతూ వుంది కదూ?"

ప్రేమ్‌కుమార్ వెంటనే "ఆ విషయం చెప్పలేక ఊరకున్నాను. నువ్వే అర్థంచేసుకొని చెప్పావు. యూవార్ కరెక్ట్ మిస్టర్ జాన్."

"బాస్‌తో చెప్పి మిస్. రోజీని వెంటనే యిక్కడికి పంపించు."

"ఎందుకు?"

"మిస్ రోజీ ఫాదర్‌కు సీరియస్‌గా వుందట. ఆమెను పిలుచుకొని పోవడానికి ఆమె తల్లి యిక్కడికి వచ్చింది. ఆమె కూతుర్ని వెంటనే పిలుచుకుపోవాలంటోంది. ఆమెను స్పెషల్ రూములో కూర్చోబెట్టాను."

"అలాగే! ఇప్పుడే బాస్‌తో చెప్పి పంపిస్తాను," అని ప్రేమ్‌కుమార్ రిసీవర్ డంచేశాడు.

"జయా! నా చిన్న ఐడియా కొన్ని వివరాలను సేకరించింది. నేను యిప్పుడు హోటల్ రాక్సీకి వెళ్తాను. చంద్రకుమార్ వస్తే విషయాలన్నీ చెప్పి హోటల్ దగ్గరికి పంపించు జయా!"

"అలాగే!"

ప్రేమ్‌కుమార్ డ్రస్ చేసుకొని హోటల్ రాక్సీకి బయలుదేరాడు.

## 6

హోటల్ రాక్సీ పార్కింగ్ స్పేస్‌లో కారును ఆపి డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ హోటల్లోకి వెళ్ళాడు. "మేనేజర్! నీ పేరేమిటి?"

"మీరెవరు సార్?" ఎదురుప్రశ్న వేశాడు మేనేజర్.

"నేనెవరో నీకు నిజంగా తెలియదా?"

"తెలిసి ఎవరైనా అడుగుతారా సార్?"

"నేను డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్‌ను."

"ఓఁ డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్‌గారా? మీ పేరు విన్నాను గాని, మిమ్మల్నిదివరకు నేనెన్నడూ చూడలేదు. కూర్చోండి సార్! నా పేరు నాగేశ్వరరావు."

"నీ అసలు పేరు రామస్వామి కదూ?"

"మీరు పొరబడుతున్నారు సార్. నా పేరు నాగేశ్వరరావే! రామస్వామి 5 గంటలకు డ్యూటీ దిగి యింటికి వెళ్ళిపోయాడు సార్."

"రామస్వామి మళ్ళీ ఎప్పుడు డ్యూటీకి వస్తాడు?"

"రేపు ఉదయం 9 గంటలకు."

"అతనితో కాస్త పనుండి వచ్చాను. అతని యిల్లెక్కడ?"

"సెకెండ్ క్రాస్ రోడ్, శివాజీ నగర్, నెం. 190."

"మిస్టర్ నాగేశ్వరరావ్! రూం నెం. 141 లో ఎవరున్నారో చెబుతావా?"

"ప్రస్తుతం ఆ రూము ఖాళీగానే వుంది సార్."

"నిన్న ఆ రూం ఎవరు తీసుకున్నారు?"

"జ్ఞాపకం లేదు. రిజిస్టర్ చూసి చెబుతాను సార్" అని నాగేశ్వరరావ్ రిజిస్టర్ తిరగేసి, "సార్! నిన్న మధ్యాహ్నం మహమ్మద్ గౌస్ అనే ఒక ముస్లిం వ్యక్తి 141 నెం. రూము అద్దెకు తీసుకున్నాడు. అతను మళ్ళీ రాత్రి 8 గంటలకే రూము ఖాళీచేసి వెళ్ళిపోయాడు. అతను విజయవాడనుండి ఏదో వ్యాపారనిమిత్తం మద్రాసు వచ్చినట్లు రిజిస్టర్‌లో వ్రాశాడు సార్."

"మిస్. రోజీ యెవరో నీకు తెలుసా?"

"ఆమె పేరే నేను వినలేదు సార్."

"నువ్వు అబద్ధాలు చెప్పడంలేదు కదా?"

"నేను నిజమే చెపుతున్నాను సార్."

"మిస్. రోజీ తల్లి గంట క్రితం ఈ హోటల్ దగ్గరికి వచ్చిందని నేను తెలుసుకున్నాను. రామస్వామి ఆమెగారిని స్పెషల్ రూంలో కూర్చోబెట్టాడు. ఆమె ఉందా?"

"నా వెంట రండి సార్."

నాగేశ్వరరావ్ అక్కడ్నించి బయలుదేరి స్పెషల్ రూం దగ్గరికి తీసుకవెళ్ళాడు ప్రేమ్‌కుమార్‌ను. "ఇదే స్పెషల్ రూం. ఆమెగారు యింటికి వెళ్ళిపోయారేమో నాకు తెలియదు. రూము లాక్ చేసి వుంది చూడండి."

"మిస్టర్ నాగేశ్వరరావ్! రూం కీస్ యెవరిదగ్గరున్నాయి?"

"నాదగ్గరే ఉన్నాయి సార్."

"రూం తెరవండి."

రూం తెరిచాడు నాగేశ్వరరావ్. ప్రేమ్‌కుమార్ లోపలికి వెళ్ళాడు. కుర్చీమీద నాలుగు మడతలు వేసి వున్న గులాబి రంగు కాగితం ప్రేమ్‌కుమార్‌ను ఆకర్షించింది. రామారావు, మాధవికి అలాంటి కాగితంలోనే ఉత్తరం వ్రాశాడు. గనుక, ఆ ఉత్తరం రామారావ్ వ్రాసిపెట్టి వుంటాడని భావించి, ఆ ఉత్తరాన్ని అందుకొని చూశాడు. ఆకుపచ్చ సిరాతో వ్రాసిన ఉత్తరం తెలుగులోనే వుంది.

"మిస్టర్ ప్రేమ్‌కుమార్!

మిసెస్ మాధవీ కామేశానికి సహాయం చేస్తానని రంగంలోకి దిగిన సంగతి నాకు క్షణాలమీద తెలిసింది. మిస్. రోజీ తల్లి, కూతురుకోసం యిక్కడ వెయిట్ చేస్తోందని, మిస్టర్ జాన్ ఉరఫ్ రామస్వామి నీతో చెప్పాడు. కనుక నువ్విక్కడికి వెంటనే వస్తావని నాకు తెలుసు.

నువ్వు మిస్. రోజీనే కాదు, మిస్టర్ జాన్ జాడ కూడా తెల్సుకోలేవు. మాధవి కూతురు సరోజను కిడ్నాప్ చేశాను. నా మాట విననందుకు మాధవి కఠినమైన హృదయ క్షోభను అనుభవించాలి. డిటెక్టివ్‌లే కాదు, పోలీసులు కూడా నన్ను పట్టుకోలేరు. మర్యాదగా పరిశోధన మానుకో మిస్టర్ ప్రేమ్‌కుమార్! నా దారికి అడ్డు రాకు! నా మాటను లెక్క చెయ్యకుంటే అనవసరంగా ఆపద పాలవుతావు. జాగ్రత్త!

రామారావు."

ప్రేమ్‌కుమార్ ఉత్తరం చదువుకొని జేబులో పెట్టుకున్నాడు. "మిస్టర్ నాగేశ్వర్రావ్! ఈ ఉత్తరం నీకు తెలియకుండా ఈ రూములో కెలా వచ్చింది?"

"నిజంగా నాకేమీ తెలియదంటే నమ్మండి సార్."

"మిస్ రోజీ తల్లిని నువ్వు చూడలేదా?"

"నేనిక్కడికి రాకముందే ఈ రూం తాళం వేసివుంది సార్."

"మీ ప్రొప్రైటర్ వున్నారా?"

"ఆయనకు ఒంట్లో బాగాలేక రెండు రోజులనుండి రావడంలేదు సార్. ఇదంతా ఎందుకు అడుగుతున్నారో నాకేమీ అర్థం కావడంలేదు. ఏం జరిగింది సార్?"

"నీకు తెలియకపోవడమే మంచిది. వస్తాను." అని డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్ బయటికి వచ్చి కారెక్కాడు.

అక్కడ్నించి నేరుగా రామారావు యింటికి వెళ్లాడు. ఇల్లు తాళంవేసి వుంది. అప్పుడే ప్రక్కింటాయన బయటికి వచ్చాడు. రామారావు యింటెదురుగా నిలబడియున్న ప్రేమ్‌కుమార్‌ను చూసి "మీరెవరు సార్? ఎవరికోసం వచ్చారు?" అని పలుకరించాడు.

"నేను రామారావు స్నేహితుడ్ని. అతన్ని కలుసుకోడానికి వచ్చాను. ఇంటికి తాళంవేసి వుంది. రామారావు ఊరెళ్ళాడా?"

"అతను ఎక్కడికి వెళ్ళాడో తెలియదు. రెండుమూడు రోజులనుంచి అతను యింటికి రావడంలేదు సార్."

"అతని భార్యాపిల్లలు కూడా లేనట్లున్నారే!"

"నిన్న రాత్రి 9 గంటలప్పుడు ఎవరో రామారావు స్నేహితుడట. కారు తీసుకొని వచ్చాడు. రామారావుకు కారు ఆక్సిడెంట్ అయి కాలు విరిగిపోయిందని, అతన్ని వెంటనే రాయపేట ఆస్పత్రిలో చేర్పించివచ్చానని, డాక్టరు వెంటనే రామారావు భార్యాపిల్లల్ని ఆస్పత్రికి తీసుకురమ్మని చెప్పాడని, కారులో పిలుచుకువెళ్ళాడు.

ప్రక్కింటి మనిషి ఆపదలో వున్నాడు కదా అని, రామారావును చూసిరావడానికి ఉదయం హాస్పిటల్‌కు

వెళ్ళాను. కాని, అక్కడ పేషంట్ రామారావుగానీ, అతని భార్యాపిల్లలుగాని కనిపించలేదు. హాస్పిటల్లో విచారించగా నిన్న సాయంత్రం ఆక్సిడెంట్‌లో కాలు విరిగిన వాళ్ళెవరూ రాలేదని చెప్పారు. నాకేమీ అర్థంగాక యింటికి వచ్చేశాను. ఇంతవరకు లలిత పిల్లలతో యింటికి రాలేదు."

"అలాగా? మరి దీన్నిబట్టి రామారావు ఆక్సిడెంటుకు గురిఅయ్యాడంటే మీరు నమ్ముతున్నారా?"

"ఇదంతా ఏదో మోసం అనుకుంటున్నాను."

"రామారావు స్నేహితుడంటూ వచ్చిన మనిషిని మీరు ఎప్పుడైనా చూశారా?"

"లేదు."

"అతని పేరైనా తెలుసా?"

"తెలియదు."

"అతని కారు నెంబరు చూశారా?"

"ఎ.ఎస్.క. 1102, స్కై కలర్ అంబాసిడర్."

"మీ పేరు?"

"రఘునాథ్. 'మెర్రిలాండ్' క్లబ్‌లో ఆర్కెస్ట్రా ట్రూప్ డైరెక్టర్‌ను."

"థ్యాంక్స్."

"మీ పేరు?"

ప్రేమ్‌కుమార్ అతనికి జవాబియ్యకుండానే కారెక్కాడు. కారు స్టార్ట్ చేశాడు. ఎం.ఎస్.క. 1102 కారు ఎవరిది? — చిరంజీవి సరోజను కిడ్నాప్ చేసి ఎక్కడికి తీసుకువెళ్ళారు? లలిత మాధవికి సహాయం చేస్తుందని రామారావే అతని భార్యాపిల్లల్ని నిర్బంధంలో పెట్టినట్లు రామారావు మాధవికి వ్రాసిన ఉత్తరంలో వుంది, మరి

రఘునాథ్ చెప్పిందాన్నిబట్టి ఆలోచిస్తే రామారావ్ భార్యాపిల్లల్ని మోసంచేసి మరో వ్యక్తి తీసుకుపోయినట్లు అర్థమవుతోంది. ఆ వ్యక్తి ఎవరు?

ఒక పబ్లిక్ టెలిఫోన్ బూత్ దగ్గర కారు నిలిపి, బూత్ లోకి వెళ్ళాడు ప్రేమ్‌కుమార్. మాధవికి ఫోన్ చేశాడు.

"మాధవిని మాట్లాడుతున్నాను." ఆమె గొంతు గాద్గదికంగా వుంది.

"మాధవీ! నేను డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్‌ను మాట్లాడుతున్నాను. సరోజను రామారావ్ మాయం చేశాడని తెలిసింది..."

"అవును ప్రేమ్‌కుమార్ గారూ! అతను సరోజను చంపేస్తాడేమోనని భయంగా వుంది. నా మనసు మనసులో లేకుండాపోతోంది. ఇన్ని బాధలు పడేకంటే రామారావ్ అడిగిన డబ్బు యిచ్చేసి..."

"తొందరపడకు మాధవీ! లక్ష రూపాయలు యిచ్చినా అతను అంతటితో తృప్తిపడతాడనే గ్యారంటీ లేదు. లక్ష రూపాయలు తీసుకున్నా అతను ఉత్తరాలు యిస్తాడనే నమ్మకంలేదు. ముమ్ముందు అతనివల్ల మీరు యింకా కష్టాలపాలవ్వాలసి వస్తుంది. మీరేమీ భయపడకండి. ఇప్పటికే కొన్ని వివరాలు సేకరించాను. త్వరలోనే లేఖలు సంపాదిస్తాను. మీ కూతురికి వచ్చిన భయమేమీ లేదు. సరోజ ఎలా మాయమయిందో చెప్పండి."

"పాపను పిలుచుకురమ్మని డ్రైవర్‌తో కారిచ్చి పంపాను. స్కూలు విడుస్తూనే సరోజ వచ్చి కారులో కూర్చుందిట. డ్రైవర్ కారు స్టార్ట్ చేయబోతుంటే అంతలో నల్లసూటు వేసుకొని, తెల్లగులాబీ పెట్టుకొచ్చిన వ్యక్తి-బయటినుంచి ఒక చేతిరుమాలును డ్రైవర్ ముఖానికి

అనించాడుట. డ్రైవర్ వెంటనే స్పృహ కోల్పోయి కారులోనే పడిపోయాడు. అంతలో ఒక నల్లరంగు కారు వచ్చి ఆ కారు ప్రక్కలో ఆగగానే ఆ నల్లసూటు వ్యక్తి సరోజ నోరు గట్టిగా మూసి ఆ కారులో కూర్చోబెట్టుకొని వెళ్ళిపోయాడట!''

''ఇలా జరిగిందని మీతో ఎవరు చెప్పారు?''

''అదంతా స్కూలుపిల్లలు చూసి హెడ్‌మిస్ట్రెస్‌తో చెప్పారట. హెడ్‌మిస్ట్రెస్ బయటికి వచ్చి చూసేసరికి ఆ కారు వెళ్ళిపోయింది. ఆమెగారు కంగారుపడి వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేసి, తర్వాత స్కూలు ప్యూన్‌ను మా యింటికి విషయం చెప్పిరమ్మని పంపించారు. ప్యూన్ ద్వారా సరోజ విషయం తెలుసుకొని కంగారుపడి పోయాను. ఏం చేయాలో దిక్కుతోచడంలేదు. అంతలో మీరు ఫోన్ చేశారు.''

''కారు నెంబర్ చెప్పాడా ప్యూన్?''

''చెప్పాడు, ఎం.ఎస్.క. 1102.''

''లలితను, వారి పిల్లలను ఆ కారుగల వ్యక్తే మాయం చేశాడని తెలిసింది. ఆ నెంబరుగల కారు మనిషి ఎవరో తెల్సుకుంటాను. మీరు అధైర్యపడకండి. తెల్లారేలోగా సరోజను సురక్షితంగా తీసుకువస్తాను.''

''అన్ని ఆశలు మీమీదే పెట్టుకున్నాను.''

''భగవంతుడిమీద భారంవేసి ధైర్యంగా వుండండి.'' అని ఫోన్ పెట్టేశాడు.

అక్కడ్నించి మళ్ళీ బయలుదేరాడు.

శివాజీనగర్, నెంబర్ 190. ఇంటిముందు కారాపాడు. అది హోటల్ మేనేజర్ రామస్వామి ఉరఫ్ మిస్టర్ జాన్ ఇల్లు. కారు దిగి కాంపౌండ్ గేటు దగ్గర నిల

బడ్డాడు. ఇంటితలుపు వేసివుంది. బయట యిద్దరు పిల్లలు పదిపైసల కాసును ఎగరేస్తూ బొమ్మా-బొరుసా ఆడుకుంటు న్నారు.

"అరె అబ్బాయిలూ! ఇటు రండి!" అని పిలిచాడు.

ఆ యిద్దరిలో ఒక పిల్లవాడు అక్కడే నిలుచున్నాడు. మరో కుర్రాడు మాత్రం పరుగెత్తుకుంటూ గేటు దగ్గరికి వచ్చాడు. "ఎవరు కావాలి సార్?" అని అడిగాడు.

"మీరు రామస్వామి పిల్లలా?"

ఆ పిల్లవాడు ఆశ్చర్యంగా ప్రేమ్‌కుమార్ ముఖంలోకి చూస్తూ "రామస్వామి ఎవరు సార్? ఆ పేరుగలవాళ్ళు ఈ వీధిలోనే లేరు. మాది ప్రక్క ఇల్లు. ఇక్కడ ట్యూబ్‌లైటు వెలుగు బాగా వుంటే ఆడుకుంటున్నాం సార్."

"ఇది ఎవరి ఇల్లు?"

"జాన్‌బాబుగారిది."

జాన్‌బాబు అంటే మిస్టర్ జాన్ (రామస్వామి) అని భావించాడు.

"జాన్‌బాబు ఇంట్లో ఉన్నాడా?"

"భార్యాపిల్లలు అందరూ చెంగల్పట్ వెళ్ళారు సార్. ఆయనొక్కడే ఉన్నారు."

అంతలో ఒక అందమైన యువతి యింట్లోంచి గబ గబా బయటికి వచ్చింది. ప్రేమ్‌కుమార్ ఆమెను చూశాడు. చెమ్కీ-పువ్వుల ఎర్రచీర కట్టుకొంది. ఆకుపచ్చ బ్లౌజ్ తొడుక్కుంది. మనిషి ఆదుర్దాగా కనిపిస్తోంది. పరుగెత్తు తున్న తీరులో గేటు దగ్గరికి వచ్చి ప్రేమ్‌కుమార్‌ను చూసి "మీ రెవరో నాకు తెలియదు. మా బాబాయ్ జాన్ బాబు చాలా ప్రమాదంలో వున్నాడు. మీరు మా బాబాయ్‌ని కల్సుకోడానికి వచ్చారనుకుంటాను. ప్లీజ్!

మీరు త్వరగా లోపలికి వెళ్ళి బాబాయి దగ్గర వుండండి. ప్రక్కవీధిలోనే డాక్టర్ వర్మగారు వున్నారు. వెంటనే పిలుచుకొని వస్తాను."

"మీ బాబాయికి ఏమైంది?"

"ఆయన ఎందుకో ఆత్మహత్య చేసుకోడానికి నిద్ర మాత్రలు అధికంగా మ్రింగినట్లుంది. ప్లీజ్! మీరు లోపలికి వెళ్ళండి. నేను అయిదు నిమిషాల్లో వస్తాను." అని ప్రేమ్ కుమార్ సమాధానానికి కూడా ఎదురుచూడకుండా గేటు తెరుచుకొని పరుగెత్తబోయింది. కాని, మిస్ రోజీ ప్రేమ్‌కుమార్‌కు జ్ఞాపకం రాగానే, ఆమే మిస్ రోజీ అయ్యుంటుందని భావించి వెంటనే ఆమె చెయ్యి పట్టుకొని "మిస్ రోజీ! నేనెవరో నీకు తెలుసు. నన్ను మోసం చెయ్యలేవు. నువ్వు ఎక్కడికీ వెళ్ళలేవు కూడాను." అన్నాడు.

మిస్ రోజీ కంగారు పడింది.

"నా పేరు రోజి కాదు. లూసీ! మీ రెవరో నిజంగా నాకు తెలియదు. చెయ్యి విడిచిపెట్టండి! ఇది మగాళ్ళకి మర్యాద కాదు."

"షటప్!" ప్రేమ్‌కుమార్ కోపంగా అరిచాడు.

"వాట్ ఈజ్ దిస్ నాన్‌సెన్స్!"

"యూ డర్టీ గర్ల్!...ఐ సీ!..." అని ప్రేమ్‌కుమార్ ఏదో చెబుతున్నంతలో "సార్! అదుగో! జాన్‌బాబు!" అని పిల్లలు అరిచేసరికి మిస్ రోజీని తన ముందుకు త్రిప్పుకొని అటు చూసేలోగా మిస్టర్ జాన్ చేతిలోని రివాల్వర్ ప్రేలిపోయింది. మిస్ రోజీని ముందుకు లాగబట్టి సరిపోయింది. లేకుంటే ఎదురుగుండా వచ్చిన రివాల్వర్

బుల్లెట్ మిస్ రోజి వీపులో గాకుండా తన వీపులో దిగ బడేది.

రివాల్వర్ బుల్లెట్ దురదృష్టవశాత్తు ప్రేమ్‌కుమార్‌కు తగలకుండా మిస్ రోజికి తగిలేసరికి మిస్టర్ జాన్ కంగారు పడి "ఓఁ మై గాడ్! ప్లాన్ టర్న్ అయింది." అంటూ రివాల్వర్ చేతబట్టుకొనే యింటి వెనక్కి పరుగెత్తాడు. పిల్లలు భయపడి బయటికి పరుగెత్తిపోయారు. ప్రేమ్ కుమార్ "మిస్ రోజి!...రోజి!!" అని పిలిచాడు. రోజి పలుకలేదు. అప్పటికే తల పక్కకు వాల్చేసింది.

ప్రేమ్‌కుమార్ రోజి శవాన్ని నేలమీద పరుండజేసి, రివాల్వర్ తీసుకొని మిస్టర్ జాన్‌కోసం పరుగెత్తాడు. కాని, అంతలోనే జాన్ మాయమయ్యాడు. ఎటు వెతికినా కని పించలేదు.

## 7

బాస్ సిగరెట్ ముట్టించుకొని దట్టంగా పొగ వదు లుతూ "లలితా! నువ్వు నాతో సహకరిస్తున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు.

"నా భర్తను ప్రేమించిన మాధవిపై నాకు ద్వేషం లేకపోలేదు. కాని సాటి ఆడది ఆపదలో వున్నానంటూ వస్తే ఎంతటి కఠినహృదయురాలైనా సహాయం చేస్తుంది. అది స్త్రీధర్మం! ఆ ధర్మాన్ని నెరవేర్చుకోవడంకోసమే నేను మాధవికి హామీనిచ్చాను. కాని మళ్ళీ మాధవి గురించి ఆలోచించాను. ఆమెకు సహాయం చేయడం ధర్మం కాదు; ప్రమాదమని గుర్తించాను. బాస్ మాధవికి సహాయపడి ఈ ఊబిలోంచి బయటికి లాగితే మాధవి నా భర్తపై ప్రతీకారం తీర్చుకునే అవకాశముంది.

ఆమె ఒక ఆఫీసర్ భార్య! మున్ముందు ఏనాటికైనా

నా భర్తవల్ల ఆమెకు ప్రమాదం ముంచుకురావచ్చని, మావారిని శాశ్వతంగా తన దారినుండి అడ్డు తొలగించుకోడానికి ఎంతటి క్రూరమైన పని చేయడానికైనా వెను దీయదు. ఆమెకు కావలసినంత డబ్బు వుంది. ఇలాంటి ఆలోచనలు వచ్చాకే మాధవికి సహాయం చేయకూడదని నిశ్చయించుకున్నాను" అంది లలిత చీరకొంగు భుజాల మీద కప్పుకుంటూ.

లలిత మాటలకు ఆశ్చర్యపోయాడు బాస్. ఆమె చెబుతున్న మాటల్లో నిజం లేకపోలేదు అనిపించిందతనికి. ఏనాటికైనా మాధవి రామారావుపై ప్రతీకారం తీర్చుకునే అవకాశముంది. అతను బ్రతికియుంటే సరోజ భవిష్యత్తు ఏనాటికైనా దెబ్బతింటుంది.

"లలితా! నువ్వు చెప్పినట్లు మాధవి తప్పకుండా చేస్తుందనడంలో అబద్ధమేమీ లేదు. రామారావ్ చనిపోతే నీ జీవితం, పిల్లల భవిష్యత్తు శూన్యమైపోతుంది. మనిషి విలువ డబ్బుతో వుంది. డబ్బు లేనివారిని ఎవరూ గౌరవించరు. కనుక ఏ విధంగానైనా డబ్బు సంపాదించిన మనిషికి జీవితంలో ఏ లోటూ వుండదు."

"మీరు చెప్పింది నిజమే! ఇంత పెద్ద ప్లాన్ వెయ్యడం మావారికి చేతగాదు. వారికి ధైర్యం లేదు. డబ్బు లేదు. పనిచేసి భార్యాపిల్లల్ని పోషించడం చేతగాదు. ఈ మూడు రోజులనుండి నేను, నా పిల్లలు యిక్కడ మూడు పూటలా కడుపునిండా తింటున్నాం. భగవంతుడు ఎప్పుడూ యిలాంటి జీవితాన్ని ప్రసాదిస్తే మేము అదృష్టవంతులం!"

"లలితా! ఈ అదృష్టం, ఆనందం నీకెప్పుడూ వుంటుంది. నేను చెప్పినట్లు నడుచుకుంటే జీవితంలో

నీకూ, నీ పిల్లలకూ ఎలాంటి కొరత ఉండదు."

"నిజంగానా?"

"లలితా! నీకు ముగ్గురు పిల్లలు పుట్టినా, బీదరికంలో ఎన్నో బాధలు పడుతున్నా నీ శరీరంలో బింకం తగ్గ లేదు. జ్యోతిలా వుంది నీ సౌందర్యం! వికసించిన గులాబి పువ్వులా వుంది నీ నవ్వు! నవవసంతాలను కురిపించే నీ నవ్వు చీల్చిన దొండపండులాంటి పెదిమల మధ్య జగజ్జేయ మానంగా వెలుగుతుంటే ఆ వెలుగు ప్రేమజ్యోతిలా నా హృదయారామంలో..." ప్రేమోన్మత్తుడై అంటుంటే—

"ఆఁ ఆఁ...ఆపండి! మీ అభిమానాన్ని పొందగలిగే అందం నాలో వుందనా పొగడుతున్నారు?..." అంటూ లలిత అతనికి మరింత దగ్గరికి జరిగి టేబుల్ మీదున్న సిగరెట్ పేకెట్లోంచి ఒక సిగరెట్ తీసి అతని పెదాలకు అందించింది. ఆమె చేతిలోని గాజులు గలగలమంటుంటే అతని హృదయం ఝల్లుమంది. ఆమె చిరునవ్వుకు చలించి పోయాడు.

"నిన్ను పొగడడం లేదు. నిన్ను ప్రేమిస్తున్నాను. నీ సౌందర్యానికి పిచ్చివాడ్ని అవుతున్నాను. నిన్ను శాశ్వతంగా నా హృదయరాణిని చేసుకోవాలని ఆలోచిస్తున్నాను. లలితా!"

"ఇంకేవి చెప్పకండి. మాటల్లో ప్రేమవర్షాన్ని కురిపిస్తుంటే నాకు పిచ్చెక్కిపోతుంది. మీ అనురాగం లభించడం నా అదృష్టం!" లలిత సున్నితంగా అతని చెంపలని రాసింది. ఆమె స్పర్శతో అతని శరీరం జలదరించింది. ఆమె అద్వితీయమైన అందాన్ని చూస్తున్నకొద్దీ అతని మనసు స్వాధీనం తప్పుతుంది. కళ్ళకు ప్రేమనిషా ఎక్కింది.

ఆమె భుజాలపై చేతులువేసి చటుక్కున ముందుకు లాక్కుని కౌగలించుకున్నాడు. లలిత కంగారు పడింది.

"లలితా!!"

రామారావ్ శరీరమంతా ఉద్రేకంతో ఊగిపోతోంది, కిటికీ ప్రక్కనుండి.

"ఎందుకా అరుపు!" ఎదురుప్రశ్న వేసింది లలిత.

"ఛీ! సిగ్గులేదూ?"

"ఎందుకు సిగ్గుపడాలి నేను? నే నింతవరకూ తెగించానంటే చూసి సిగ్గుపడాలి. చూడలేకపోతే పిల్లిలా కళ్ళు మూసుకోవాలి."

"లలితా! అతను పెట్టే ఆశలకు లొంగిపోయి యింత నీచానికి దిగజారిపోతా వనుకోలేదు. ఇంతవరకూ నీవు పవిత్రురాలవు అనుకున్నాను."

"మీ చేతగానితనానికి సిగ్గుపడుతూ యింతవరకూ నేను, నా పిల్లలు ఆకలితో అలమటించిపోయాము. చేతగాని మొగుడ్ని పెట్టుకొని ఎన్నాళ్ళు ఆకలిబాధకు గురికావాలి? మీరు నన్నూ, పిల్లల్ని ఎలాగూ పోషించలేని అసమర్థులని తెలుసుకున్నాను. ఇప్పుడు భగవంతుడు నాకు దారి చూపించాడు. బాస్ నామీద ఎంతో అనురాగాన్ని చూపిస్తున్నారు. వారి ఆదరణ వున్నంతవరకు నేను, నా పిల్లలే కాదు, మిమ్మల్నికూడా పోషించగలను."

"లలితా! నేనీ గదిలో ఉండబట్టి బ్రతికిపోయావ్. నీ రక్తం త్రాగుతా!"

"ఆట్టే వాగక నోరుమూసుకొని పడివుండండి!"

"లలితా!" బాస్ దగ్గరికివచ్చి ఆమె భుజంపై చెయ్యి వేశాడు. లలిత కసురుకోలేదు. అతని చెయ్యి అందుకొని మృదువుగా నొక్కింది. అతను ఎంతో తియ్యని అనుభూతిని ఫీలయ్యాడు. "లలితా! నువ్వు ఊఁ అంటే ఈ క్షణమే

నీ భర్తను యమపురికి పంపిస్తాను. మనం పువ్వుల తావిలా హాయిగా జాలీలైఫ్ లీడ్ చెయ్యొచ్చు!" అన్నాడు రామారావుకేసి కసిగా చూస్తూ.

"నో డియర్ బాస్, తొందరపడి అంత పని చెయ్యకండి. నేను విధవనయితే పరపురుషుడితో ప్రణయవిహారం చెయ్యడానికి సంఘం ఒప్పుకోదు. భర్త చాటుగా తిరిగే స్త్రీని చూసినా ఆ విషయం గురించి అంతగా పట్టించుకోదు. వారి కిష్టమైతే మన నీడన పడివుంటారు. లేకుంటే విడాకులిస్తారు. అప్పుడు వారికై వారే మన మధ్యనుండి తొలగిపోతారు."

"లలితా! ఛీ! కులటా!" రామారావ్ హృదయం అవమానాగ్నిలో దహించుకుపోతుంది. "అబ్బా! ఈ ఘోరం నేను చూడలేను." తలను కిటికీ ఊచలకేసి బాదుకున్నాడు ఆవేశాన్ని నిగ్రహించుకోలేక.

అంతలో___

"బాస్!" అంటూ ఒకతను పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఏమిటి? ఎందుకు కంగారు పడుతున్నావ్?"

"మిస్టర్ జాన్, మిస్. రోజిని హత్యచేశాడు బాస్!"

బాస్ గుండెలు అదిరాయి. లలితను విడిచిపెట్టి ఆగంతకుడి దగ్గరికి విసురుగా వచ్చాడు. "వాట్ ఆర్ యూ టాకింగ్ నాన్ సెన్స్," అతని చెంప పగిలేట్లు కొట్టాడు.

"నన్ను శిక్షించకండి బాస్, యిందులో నా తప్పేమీ లేదు. డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్‌ను బంధించాలనుకున్న ప్లాన్ చెడిపోయింది. ప్రేమ్‌కుమార్ రోజిని పట్టుకున్నాడు. మిస్టర్ జాన్ తొందరపడి ప్రేమ్‌కుమార్‌ను అంతం చెయ్యాలని రివాల్వర్ ప్రేల్చాడు. అది రోజికి తగిలింది. మిస్టర్ జాన్ అయినా మిస్. రోజిని హత్య చెయ్యా

లనుకొని చేయలేదు బాస్. మిస్. రోజీ మర్డర్ బ్లైండ్ గా జరిగిపోయింది.'!

"మిస్టర్ జాన్ ఎక్కడ?" కోపంతో నిప్పులుతొక్కిన కోతిలా చిందులువేస్తూ అడిగాడు.

"అతను అక్కడ్నించి ప్రేమ్‌కుమార్‌కు చిక్కకుండా తప్పించుకొని పారిపోయాడు బాస్!"

"ఆల్ రైట్! మిస్టర్ జాన్ ఎక్కడున్నా వెంటనే నా దగ్గరికి పంపించు."

"అలాగే బాస్."

"నువ్వెళ్ళు!" అతను వెళ్ళిపోయాడు.

"లలితా! గంట తర్వాత నీకు భోజనం వస్తుంది. ప్రక్కగదిలో నున్న నీ పిల్లలకు పెట్టి నువ్వు తృప్తిగా భోంచేసి పడుకో! నిద్ర పట్టకుంటే ఆ పై గదిలోకి వెళ్ళు! చదువుకోడానికి నీకొక్కవలసిన పుస్తకాలుంటాయి. నేను అర్జంటుగా బయటికి వెళ్ళాలి. రెండుమూడు గంటల్లోగా వచ్చేస్తాను," అని అక్కడ్నించి గబగబా వెళ్ళిపోయాడు.

# 8

రాత్రి 10 గంటలు దాటింది.

మాధవికి నిద్ర రాలేదు. సరోజను తలచుకొని పసిపిల్లలా కుమిలి కుమిలి ఏడ్వసాగింది. ఇంత రభస జరిగిం తరువాత రెండుమూడు రోజుల్లో ఢిల్లీనుంచి రాబోయే భర్తకు ఎలా తెలియకుండా వుంటుంది. తెలిస్తే కలిగే పర్యవసానమేమిటో ఊహించుకుంటే మాధవి గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. మనసు సరోజకేం అపాయం జరుగుతుందోనని తపించిపోతోంది.

రామారావ్ ఎంత మోసం చేశాడు? తనను ప్రేమించి నందుకు నమ్మించి యింతటి దారుణానికి ఒడిగట్టాడు.

తలుపు చప్పుడయ్యేసరికి ఉలికిపడి తలెత్తి ద్వారంకేసి చూసిన మాధవికి గుండె ఆగినంత పనైంది. నోట మాట రాలేదు. ఎదురుగా ఊహించని విధంగా ప్రత్యక్ష మయ్యాడు నల్లసూటు వ్యక్తి! అతని కోటుకు తెల్లగులాబీ వుంది. తలనుండి గడ్డం క్రిందికి ఎర్రటి మఫ్లర్ చుట్టు కున్నాడు. తలపై నల్లటి ఫెల్ట్ హేట్ వుంది.

అతన్ని చూసి వెంటనే లేవలేకపోయింది మాధవి. "ఎ...వ...? ఎవరు?" అన్న మూడక్షరాల మాటను ఒక్కొక్కటిగా ఉచ్చరించినా మూడో అక్షరం పెదాల నుండి బయటికి రాక ముందే అతను రివాల్వర్ బయటికి తీశాడు.

"అరిచావంటే బుల్లెట్ సూటిగా నీ గుండెల్లోంచి దూసుకుపోతుంది. నువ్వేం అడుగుతావో నాకు తెలుసు! నా పేరు నువ్వు తెల్సుకోలేవు. నన్ను నీ పూర్వ ప్రియుడు రామారావు పంపించాడు. నువ్వు డిటెక్టివ్‌ల సహాయం పొందినంత మాత్రాన రామారావ్ తన ప్రయత్నం విర మించడని యిప్పటికైనా అర్థమయ్యే వుంటుంది. కనుక, అరవకుండా లక్షరూపాయలు ఎంచి ఈ బ్రీఫ్‌కేసులో పెట్టి యివ్వు!" అని అతను ఎడమచేతిలో నున్న ఖాళీ బ్రీఫ్ కేసు మంచంపైకి విసరి ముందుకు రాసాగాడు.

మాధవి లతలా వణికిపోయింది.

వెంకయ్య బయట వరండాలో నిద్రపోతున్నాడు. అరిస్తే లేచి వస్తాడు. తనకేదైనా సహాయం చెయ్యగలడు. కాని, కేకవేస్తే ఆగంతకుని చేతిలోని రివాల్వర్ పేలి పోవచ్చు!

"ఊఁ. లేచి బ్రీఫ్‌కేసు చేతికి తీసుకొని సేఫ్ దగ్గరికి నడూ!"

మాధవి చేసేది లేక లేచి నిలబడింది. అయినా ఆమె కాళ్ళు సన్నగా ఒణుకుతున్నాయి. గుండె దడ తగ్గడమే లేదు. మెల్లగా బ్రీఫ్ కేసు అందుకుంది.

"ఒక్క మాట!" అంది మొండిధైర్యాన్ని తెచ్చుకొని.

"నువ్వు ఎన్నిమాటలు చెప్పినా డబ్బుకావాలి ముందు."

"ఒక లక్షరూపాయలు కాదు. ఇంకా పాతిక వేలు ఎక్కువగా యిస్తాను. కాని, నా కూతురు?..."

"డబ్బు రామారావుకు అందగానే, నీ కూతురును క్షేమంగా యిల్లు చేర్చే బాధ్యత నాది."

"అంతే కాదు. ఆ ప్రేమలేఖలు నాకు ఇవ్వాలి మీరు."

"తప్పకుండా అవికూడా నీకు అందుతాయి."

"నన్నెలా నమ్మమంటావు?"

"అంటే?..." కోపంగా చూశాడు మాధవికేసి.

మాధవి ఏదో చెబుతున్నంతలో—

"అంటే?...తర్వాత నన్ను అడుగు చెబుతాను" అన్న ఒక పురుషస్వరంతో బాటు అతని మెడకు రివాల్వర్ చల్లగా తగిలింది.

"ఐసీ...హూ ఆర్ యూ?" అన్నాడు ఆగంతకుడు.

"...కనుక, రివాల్వర్ను క్రింద పడవెయ్ మిస్టర్ జాన్!"

"ప్రేమ్‌కుమార్! నన్ను నువ్వు వెంటాడుతున్నావని గ్రహించలేకపోయాను" అన్నాడు జాన్ తిరిగి చూడకుండానే.

"ప్రేమ్‌కుమార్ గారు నిన్ను వెంటాడివుంటే యింత దూరం నిన్ను రానిచ్చేవారు కాదు. ఆయన కంటికి కనిపించకుండా మాయమైనా, బాస్ వెనగ్గా హోటల్

రాక్సీనుండి ఫాలో అవుతున్న నా దృష్టిపథంనుండి నువ్వు తప్పించుకోలేకపోయావు.''

''ఐ అండర్‌స్టాండ్, యువార్ మిస్టర్ చంద్రకుమార్.''

మాధవికి వెయ్యేనుగుల బలం వచ్చినట్లయింది.

జాన్ తనవేదైనా మోసంచేసి రివాల్వర్ స్వాధీనం చేసుకుంటాడేమోనని భావించిన చంద్రకుమార్ క్షణం ఆలస్యం చెయ్యకుండా బూటుకాలు అతని వీపుకు ఆనించి ముందుకు జాడించాడు. జాన్ దూరంగా తూలి వెల్లకిలా పడిపోయాడు. ఎర్రటి నేత్రాలతో చంద్రకుమార్ కేసి చూశాడు.

''మిస్టర్ జాన్! మిస్. రోజిని నువ్వు హత్యచేశావు. మిస్. రోజి నీ బాస్ ప్రియురాలు! ఆమె హత్య నీవల్ల జరిగిందని బాస్‌కు తెలిస్తే వెంటనే నిర్దాక్షిణ్యంగా నిన్ను కైలాసానికి పంపిస్తాడని నీకు తెలుసు. అందుకే అతని సమక్షానికి వెళ్ళే ధైర్యంలేక ప్లాన్ వేసి యిక్కడికి వచ్చావు.

నువ్వు బాస్ కంటబడితే నీ ప్రాణాలు ఎగిరిపోతాయి. పోలీసుల కంటబడితే జైలుకు వెళతావు. కనుక అందరి దృష్టిపథంనుండి తప్పించుకొని ఎటో పారిపోవాలని నిశ్చయించుకున్నావు. పోయే ముందు మాధవిని బెదిరించి, రామారావు పంపించాడని ఆమెతో లక్షరూపాయలు తీసుకుపోవాలని వచ్చావు.

మిస్. రోజీ హత్య నీ చేతులమీదుగా ఎప్పుడు జరిగిందో నువ్వు ఏ విధంగా మారుతావో ఊహించాను. నువ్వు తప్పకుండా నీ బాస్‌కు తెలియకుండా మాధవి దగ్గరికి వస్తావని నాకు తెలుసు. అందుకే 8 గంటలనుంచీ ఎవరికీ తెలియకుండా బంగళా ప్రక్కనున్న మల్లెపొదలో మాటువేశాను. మిస్టర్ జాన్! నువ్వు నా చేతుల్లోంచి

తప్పించుకొని పోలేవు. చెప్పు! ఎవరు నీ బాస్?"

"తెలియదు."

"అబద్ధాలు చెబితే మిస్టర్ జాన్! నా చేతిదెబ్బ ఎంత రుచిగా వుంటుందో చవిచూస్తావు."

"నీకున్న బలం నాకూ వుంది మిస్టర్ చంద్రకుమార్."

"అయితే నీ బలమేమిటో నేను చూస్తాను" అంటూ చంద్రకుమార్ అతని దగ్గరగా వెళ్ళి ముఖంమీద గుద్దబోయే లోగా, జాన్ రెప్పపాటుకాలంలో అతని రివాల్వర్ గురి తప్పించి ఎగిరి, చంద్రకుమార్ చేతికేసి తన్నాడు. చంద్రకుమార్ చేతిలోని రివాల్వర్ ఎగిరిపోయిందనుకున్న జాన్‌కు ఆశాభంగమే అయింది. రివాల్వర్ ఎగిరి పడలేదు.

కాని, రివాల్వర్ పట్టుకున్న చేత్తోనే జాన్ దవడమీద గుద్దాడు చంద్రకుమార్. ఆ దెబ్బతో జాన్ మెలికలు తిరిగిపోయాడు. రెండు పళ్లు ఊడి వెంటనే క్రిందపడ్డాయి. భొళ్ళుమని నోటినుండి రక్తం కారింది.

"ఇడియట్! నన్ను మోసం చెయ్యలేవని ముందే అన్నానుగా? చెప్పురా ఫూల్! నీ బాస్ యెక్కడున్నాడు? అతని పేరేమిటి?" అంటుండగానే బయట కిటికీలోంచి ఓ బుల్లెట్ దూసుకువచ్చి జాన్ గుండెలో దిగబడింది.

జాన్! "అబ్బా" అంటూ, గుండెల్లోంచి రక్తం కారుతోంటే అలాగే నేలకొరిగిపోయాడు. చంద్రకుమార్ తలెత్తి కిటికీవైపు చూసేసరికి, రివాల్వర్ పట్టుకున్న హస్తం వెనక్కి జరిగిపోయింది.

ఆ భయంకర దృశ్యం చూసి మాధవి శిలావిగ్రహంలా నిలబడిపోయింది.

చంద్రకుమార్ గాలిలో బయటికి దూసుకుపోయాడు. కిటికీ దగ్గరికి వచ్చేసరికి చీకట్లో అతనికెవరూ కనిపించ

లేదు. హంతకుడు దొరుకుతాడన్న ఆశ అతనికి లేదు.

వెంటనే యింట్లోకి వచ్చాడు. ప్రాణాలు పోయే ముందయినా జాన్ ఏదైనా చెబుతాడేమోనని జాన్ దగ్గరికి వచ్చాడు, అప్పటికే జాన్ తేలకళ్ళు వేశాడు.

"జాన్!...జాన్!!" భుజం తడుతూ అతని ముఖంలోకి చూస్తూ పిలిచాడు. ఏమీ ప్రయోజనం లేకపోయింది. జాన్ కళ్ళు మూతలు పడ్డాయి. తలను ప్రక్కకి వాల్చేశాడు.

చంద్రకుమార్ లేచి నిలబడ్డాడు. నేలమీద జాన్ రక్తంతో వ్రాసిన అక్షరాలకేసి చూడసాగాడు. 'D. R. M. C.' ఇంగ్లీషులో వ్రాసిన ఈ నాలుగు అక్షరాలను నోట్ చేసుకున్నాడు.

DRMC అన్న నాలుగు అక్షరాలకు అర్థం తెలుసుకుంటే హంతకుడు ఎవరైనది, వాళ్ళ బాస్ యెవరో తెల్సుకోవచ్చు!

చంద్రకుమార్ ఆ అక్షరాలను నోట్ చేసుకొని వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేశాడు. "చంద్రకుమార్ గారూ! ఈ జాన్ ఎవరు?" అడిగింది మాధవి.

"రామారావు ముఠాలోని ఒక ముఖ్యమైన వ్యక్తి!"

"మరి యితన్నెందుకు హత్యచేశారు?"

"జాన్ మిస్. రోజిని బ్లయిండ్ మర్డర్ చేశాడు. హంతకుడిగా అతని బాస్ ఎదురుగా వెళ్ళే ధైర్యంలేదు. కనుక, అతను యిక్కడికి రావచ్చని, అధికారులకు చిక్కితే రహస్యాలు బయట పెట్టవచ్చుననే అనుమానంతో బాస్ యీ హత్య చేయించివుంటాడు. జాన్ రివాల్వర్ దెబ్బ తిన్నాక ఎటూ తను బ్రతకనని గ్రహించి ప్రాణాలు

పోయే ముందు ఏదో కోడ్ నెంబరు తెలిపాడు. అదేమిటో తెలుసుకోవాలి.''

మాధవికి అంతా అగమ్యగోచరంగా తోచింది.

# 9

''లలితా! జాన్, మిస్. రోజిని చంపిండే గాకుండా నన్నే మోసం చేయదలిచాడు. వెంటనే వాడ్ని ఒక్క రివాల్వర్ షాట్‌తో ఎగురగొట్టాను'' అన్నాడు బాస్ లలిత దగ్గరగా వస్తూ.

''గంట కొకరు చావడమేగాని, మాధవినుండి డబ్బు సాధించలేకుండా వున్నారు. మిమ్మల్ని పట్టుకోడానికి డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్, చంద్రకుమార్‌లు తీవ్రంగా కృషిచేస్తున్నారు. ఏ సమయంలో వాళ్ళిక్కడ ప్రత్యక్షమవుతారోనని నాకు భయంగా వుంది బాస్'' అంది లలిత అతని ప్రక్కన కుర్చీ హేండ్‌పై కూర్చుంటూ.

బాస్ ఆమె నడుం చుట్టూ చెయ్యివేశాడు. ఆమె సున్నితమైన ఎర్రటి పెదాలపై ముద్దు పెట్టుకోబోయాడు.

''బాస్!'' లలిత ఈసారి విసురుగా తల పైకి తీసుకుంది. ''ముద్దుకోసం ప్రయత్నించే ముందు మాధవినుండి ఒక లక్ష...సాధించే ప్రయత్నం ఎంత త్వరగా చేస్తే అంత మంచిది,'' అంది.

''ఏం చెయ్యాలో నాకేమీ తోచడంలేదు, మాధవి మొండికెత్తింది'' అన్నాడు బాస్ చిన్నబుచ్చుకుంటూ.

''నాకో ఐడియా!'' అంది లలిత చిటికవేసి.

''ఏమిటో చెప్పు!''

''సరోజను యిక్కడికి తీసుకురండి. ప్లాన్ నేను చెబుతాను.''

"సరే" అంటూ బాస్ కాలింగ్ బెల్ కొట్టాడు. వెంటనే ప్రక్కగదిలోంచి ఒక వ్యక్తి వచ్చాడు. "ఎస్. బాస్" అన్నాడు.

"సరోజను యిలా తీసుకురా!"

అతను అక్కడ్నించి బాణంలా దూసుకుపోయాడు.

వెంటనే తిరిగివచ్చి "బాస్!" అన్నాడు కంగారుగా.

"సరోజ ఏదీ?"

"గదిలో సరోజ కనిపించడంలేదు బాస్!"

స్ప్రింగ్ లా లేచాడు బాస్.

"వాట్ ఆర్ యూ బార్కింగ్ యిడియట్?"

"రామారావు, అతని పిల్లలుకూడా లేరు బాస్!"

"విలియం!?" పిచ్చికుక్కలా అరుస్తూ బూటుకాలుతో అతన్ని తన్నాడు.

"క్షమించండి బాస్!"

"క్షమించడమా? మా ప్లాన్స్ అన్నీ సర్వనాశనం చేశావు. నీకు తెలియకుండా వాళ్ళు యెలా బయటికి వెళ్ళారు?" అంది కోపంగా లలిత.

"నిజం మేడమ్! నాకేమీ తెలియదు."

అంతలో!

టెలిఫోన్ మ్రోగింది.

బాస్ రిసీవర్ అందుకొని, "ఎస్...ఎవరు?" అన్నాడు తన ఉనికిని చెప్పకుండా.

"నువ్వు పేరు చెప్పనంత మాత్రాన నువ్వెవరో నాకు తెలీదు అనుకోకు!..."

"నాన్ సెన్స్! ఎవరు నువ్వు?" కోపంగా అడిగాడు బాస్.

"ఫోన్ లో మాట్లాడుతున్నావు కాబట్టి సరిపోయింది.

ఆ మాటన్నందుకు నీ ముఖం పచ్చడి చేసివుందును. డిటెక్టివ్ చంద్రకుమార్ సంగతి నీకు తెలియదు. మిస్టర్! ఎదురుపడినప్పుడు తెలుస్తుంది నీకు...నీ ఫోన్ నెంబరు తెలుసుకోగలిగినవాడిని నిన్ను గుర్తించలేనని అనుకోకు! త్వరలోనే నీ చేతులకు బేడీలు అలంకరించడానికి ఇన్‌స్పెక్టర్‌తో ప్రత్యక్షమవుతాను."

"నో మిస్టర్ చంద్రకుమార్. అది నీ తరం కాదు. నా పేరే నీకు సరిగా తెలియదు. నన్ను నువ్వేం పట్టుకుంటావ్? అది నీ చేత గాదు. డిటెక్షన్ మానుకోమని ప్రేమ్‌కుమార్‌కు చెప్పు!..."

"అధిక ప్రసంగం కట్టిపెట్టు! సరోజను, రామారావును, అతని పిల్లల్ని సురక్షితంగా నీ బంగళానుంచే తీసుకు వచ్చాను. సరోజను రక్షించడానికి...లలిత నీ పక్షమై పోయింది. ఆ సమయం లలిత కనిపించియుంటే ఆమెను కూడా తీసుకొనివచ్చివుందును. మర్యాదగా లలితను పంపించెయ్ మిస్టర్! పోతే...నీ దగ్గరున్న ప్రేమలేఖలు మాధవి చేతుల్లో పడ్డాయి."

ఆ మాటకు బాస్ వికటంగా నవ్వాడు.

"మాటలతో నన్ను మోసం చెయ్యలేవు. అవి భద్రంగా నా దగ్గరే ఉన్నాయి."

"ఆత్మవంచన చేసుకొని మోసపోకు! మాధవి యిక మీలాంటి బ్లాక్ మెయిలర్‌లకు భయపడదు. ఆ ప్రేమ లేఖల్ని మా ఎదురుగానే కాల్చివేసింది. ఆ బూడిదను మురికికాలువలో వేసింది. నీ పీడ ఆమెకు విరగడై పోయింది."

బాస్ జవాబు చెప్పలేదు. వెంటనే రిసీవర్‌ను దించేశాడు కోపంగా.

"బాస్! చంద్రకుమార్ చెబుతున్నది నిజమేనా?" అని అడిగింది లలిత నిరుత్సాహంగా.

బాస్ లలిత మాటలు వినిపించుకోకుండా బీరువా తెరిచి ఫైల్స్ లాగాడు. ఎన్ని ఫైళ్ళు వెతికినా ప్రేమ లేఖలు కనిపించలేదు. అతను కంగారుపడ్డాడు. ఎంతో జాగ్రత్తగా దాచివుంచిన ప్రేమలేఖలు - చంద్రకుమార్ చేతుల్లో ఎలా పడ్డాయి? అతను ఎప్పుడు వచ్చాడు? ఎలా రాగలిగాడు? ఇంతమంది కళ్ళుగప్పి అంతమందిని ఎలా విడిపించుకుపోయాడు? అనే ప్రశ్నలు ఉత్పన్నమై వాటికి సమాధానం చిక్కక అతని మస్తిష్కం వేడెక్కి పోయింది.

"లలితా!" కోపంగా పిలిచాడు.

"ఎస్, బాస్... లేఖలు కనిపించలేదా?"

"అవి ఎలా మాయమయ్యాయి?"

"అవి మీరు ఎక్కడ దాచివుంచారో ఎవరికీ తెలియదు. మీరు తప్ప ఈ గదిలోకి ఎవ్వరూ రారు. ఆ బీరువా తాళంచెవులు ఎప్పుడూ మీ దగ్గరే వుంటాయి కదా బాస్! అవి మీకు తెలియకుండా మాయమయ్యాయంటే చాలా విచిత్రంగా వుంది బాస్!"

"లలితా! అంతా మాయగారడీలా జరిగిపోయింది... కాదు. మన మనుష్యుల్లోనే ఎవరో పరోక్షంగా ఆ డిటెక్టివ్ ద్వయానికి సహాయపడివుంటారని నాకు అనుమానం వేస్తోంది. ఆ రాస్కెల్స్ ఎవరో తెలుసుకుంటే వెంటనే షూట్ చేసి చంపేస్తాను."

"మన అసిస్టెంట్స్ నందరినీ పిలిపించి, ఆ స్వామి ద్రోహులెవరో అంతంచెయ్యండి. ఇన్ని వివరాలు తెలిసిన ఆ అపరాధపరిశోధకులకు మన గుట్టు కూడా తెలిసి

వుంటుంది. వాళ్ళు ఏ క్షణంలోనైనా యిక్కడ ఊడి పడొచ్చు! మనం వీలైనంత త్వరలో మకాం మార్చి వేయాలి.

మిమ్మల్ని నా దైవంలా నమ్ముకున్నాను. నన్ను అన్యాయం చెయ్యకండి. నా భర్తను, పిల్లల్ని వదులుకొని మీ ప్రేమభిక్షకోసం, మీ చల్లని చూపుకోసం... బాస్! నిన్న రాత్రి సేట్ గోపీచంద్ భార్యను బ్లాక్ మెయిల్ చేసి రెండు లక్షలు తెచ్చారు. మనం ఈ ఊరు విడిచి ఎక్కడికైనా వెళ్ళి చిలకాగోరింకల్లా జీవించడానికి మనకా డబ్బు చాలు!...

మిమ్మల్ని పోలీసులో, ఆ డిటెక్టివ్ బృందమో పట్టుకుంటే నా జీవితం అంధకారమైపోతుంది. మీ బంగారు బ్రతుకు జైలుగోడల్లో మ్రగ్గిపోతుంది.'' లలిత బాస్ వీపు మీద తల ఆన్చి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

అతను యిటు తిరిగాడు. ఏడుస్తున్న లలితను యిటు త్రిప్పుకున్నాడు. తనమీద లలితకున్న ప్రేమకు ఎంతో ఆశ్చర్యపడ్డాడు. చేతిరుమాలుతో ఆమె కన్నీటిని తుడిచాడు. ''పిచ్చి లలితా! నామీధ నీకెంత ప్రేమ! నువ్వన్నట్లు మనం తెల్లారేలోగా మకాం మార్చేద్దాం. రేపు సాయంత్రానికల్లా విమానంలో ఏ కలకత్తా...కాశ్మీర్ కో వెళ్ళిపోదాం. డార్లింగ్! నువ్వేమీ భయపడొద్దు. నన్ను మోసం చేసిన ఆ దుర్మార్గులెవరో తెలుసుకోవాలి. రా లలితా! హాల్లోకి వెళ్ళి అందర్నీ పిలిపించి అడుగుదాం.''

ఇద్దరూ హాల్లోకి వచ్చారు.

# 10

డేంజర్ లైటు వెలిగించి బెల్ నొక్కాడు బాస్.

నలుగురు వ్యక్తులు క్షణాలమీద వచ్చి నిలుచున్నారు

ఎదురుగా.

"బాస్! ఏం జరిగింది?" అని అడిగారు ఆదుర్దాగా, అందర్నీ ఎందుకు పిలిపించాడో అర్థంగాక.

"ఎందుకు పిలిపించానో చెబుతాను," అని బాస్ రివాల్వర్ తీశాడు. సిగరెట్ తీసి నేలమీద వేశాడు. దాన్ని బూటుకాలుతో రాస్తూ "మిస్టర్ విలియమ్స్!" అని పిలిచాడు, అతని వేపు చూస్తూ.

"ఎస్. బాస్!"

"కమ్ హియర్!"

అతను భయపడుతూ దగ్గరికి వచ్చాడు. "నేనేం తప్పు చేశాను బాస్?"

"షటప్! ఏమీ అడగకముందే ఏమిటా సమర్థింపు? చెప్పిన పని చెయ్యి. అందరి దగ్గరున్న ఆయుధాలు తెచ్చి ఆ టేబిల్ మీద వుంచు!" అన్నాడు.

విలియమ్స్ అందరివద్దనున్న రివాల్వర్స్ తెచ్చి టేబిల్ మీద వుంచాడు.

"నువ్వెళ్ళి వాళ్ళతో బాటు నిలుచో!"

విలియమ్స్ బాస్ చెప్పినట్లు వెళ్ళి నిలుచున్నాడు.

"నా గదిలో భద్రంగా దాచివుంచిన ప్రేమలేఖలు డిటెక్టివ్ చంద్రకుమార్ చేతుల్లో పడ్డాయి. అంతేకాదు; అవసరానికి ఉపయోగపడతారని బంధించివుంచిన రామారావు, సరోజలతో బాటు లలిత పిల్లలు కూడా రహస్యంగా తప్పించబడ్డారు. ఇదంతా మీలో ఏ ఒక్కరికీ తెలియకుండా జరగడానికి వీల్లేదు. ఆ యిద్దరు డిటెక్టివ్ లకు పరోక్షంగా సహాయపడి నాకు ద్రోహం చేసినవాళ్ళు మీలోనే వున్నారు. ఈ మోసం ఎవరు చేశారో ఒప్పుకోండి!—లేకుంటే?...అందర్నీ వరుసపెట్టి చంపేస్తాను." చింత

నిప్పుల్లాంటి నేత్రాలతో ఉరిమిచూస్తూ అడిగాడు బాస్.

బాస్ అలా అడుగగానే నలుగురూ ఒకరి ముఖా లొకరు చూసుకోసాగారు భయంతో. వెంటనే ఏ ఒక్కడూ సమాధానం చెప్పలేదు.

"చెప్పండి!" గద్దించాడు బాస్.

"మాకేమీ తెలియదు బాస్!" అన్నారు అందరూ ఒక్కసారి.

"షటప్! ఒక్కొక్కరినే అడుగుతాను. మిస్టర్ విలియమ్స్! నీకు కూడా తెలియదా?"

"నాకేమీ తెలియదు బాస్!"

"నిజంగా నీకేమీ తెలియదా?" అతని ముందుకు నడుస్తూ, తీక్షణంగా చూస్తూ అడిగాడు.

"నన్ను నమ్మండి బాస్!"

బాస్ బూటుకాలుతో అతని డొక్కలో తన్నాడు. అతను 'అమ్మా' అంటూ బాధగా అరుస్తూ ఉండచుట్టుకు పడిపోయాడు. "ఊఁ—గెటప్! యూ డర్టీ డాగ్!..." అని అతని కాలు గట్టిగా తొక్కాడు.

"బా...స్!...నన్ను కొట్టకండి బాస్!...ఇందులో నా తప్పేమీ లేదు. దీనికంతా కారణం మిస్టర్ రాబర్ట్ అని నాకు తెలుసు." అంటూ కడుపు చేత్తో పట్టుకొని వణుకుతూ లేచి నిలబడ్డాడు.

"ఓహ్! మిస్టర్ రాబర్ట్! చంద్రకుమార్‌కు సహాయపడ్డ ఘనుడివి నువ్వా?" అంటూ రాబర్ట్ దగ్గరకి వచ్చాడు బాస్.

"నో, బాస్! దెబ్బలు తప్పించుకోడానికి విలియమ్స్ అబద్ధాలు చెబుతున్నాడు. నాకేమీ తెలియదు బాస్!"

రివాల్వర్ చేత్తో రాబర్ట్ ముఖంమీద గుద్దాడు బాస్. అతని ముక్కు అదిరి రక్తం కారింది. "రాస్కెల్! నన్ను మోసం చేస్తావా?"

"బాస్! వీళ్ళిద్దరూ తోడుదొంగలు! ఒకరిమీద ఒకరు చెప్పుకుంటున్నారు. ఈ నలుగురిలో అసలు దొంగ ఎవరో వారు చూపులనిబట్టి గ్రహించాను."

"లలితా! ఏమిటి నువ్వంటున్నది?"

"ఆ స్వామిద్రోహిని ఎలాటి ప్రశ్నలు వేయకుండా ఒక్క దెబ్బతో ప్రాణాలు తీస్తాను. రివాల్వర్ యిలా యివ్వండి!" అని, బాస్ చేతిలోని రివాల్వర్ అందుకుంది లలిత.

"ఎవరా దుర్మార్గుడు?"

లలిత బాస్‌కు సమాధానం యివ్వకుండా వాళ్ళ ముందుకు వెళ్ళి నిలుచుంది. "మిస్టర్ రాబర్ట్ తప్ప మిగతా వాళ్ళంతా గోడకు ఆనుకొని నిలబడండి!" అని ఆదేశించింది.

రాబర్ట్ తప్ప అందరూ అలాగే వెళ్ళి నిలుచున్నారు.

"రాబర్ట్!" పిలిచింది లలిత.

"ఎస్. మేడమ్!"

"అక్కడ టేబుల్ క్రింద తాడు వుంది తీసుకురా!"

రాబర్ట్ తాడు తీసుకొచ్చాడు.

"ఆ నీచుడ్ని బంధించు!" అని బాస్‌కేసి క్రోధంగా చూస్తూ, చెయ్యి చాచి చూపింది.

బాస్ లలిత మాటలకు నిర్ఘాంతపోయాను.

"లలితా! నీకు మతిపోయిందా? నన్ను బంధించమంటున్నావేం?" అని అన్నాడు, లలిత ధోరణి ఏమీ అర్థంగాక కోపంగా.

లలిత బిగ్గరగా నవ్వింది!

"లలితా!? ఏమిటీ మోసం?"

"మోసాన్ని మోసంతోనే జయించాలి మిస్టర్ రఘునాథ్! మా యింటి ప్రక్కన కాపురముంటూ, ఎప్పుడో ఏదో మాటవరసకి మావారు మాధవిని ప్రేమించిన విషయం స్నేహితుడివని చెబితే ఎవరూలేని సమయం కనిపెట్టి మాధవి నా భర్తకు వ్రాసిన ప్రేమలేఖలు తస్కరించావు. అవకాశం చూసి నా భర్తను బంధించావు. లక్షలు గడించాలని మావారిని బెదిరించి మాధవికి ఉత్తరం వ్రాయించావ్.

ఉత్తరం చూసి మాధవి నా దగ్గరికి వచ్చి సహాయం కోరింది. నేను మాధవికి సహాయం చేయ పూనుకున్నానని తెల్సుకొని నన్నూ, నా పిల్లల్ని కూడా బంధించి ఇక్కడికి తీసుకొచ్చావు. నేను ఎంతో అందంగా వున్నానని నా మీద కన్నువేశావు. నువ్వు లేని సమయంలో నా భర్త అనుమతి పొంది, నీ దగ్గరున్న ప్రేమలేఖలు స్వాధీనం చేసుకోడానికి వేరే మార్గం కనిపించక నీతో ప్రేమించి నట్లు నటించాను."

"లలితా! నా కిప్పుడంతా అర్థమైంది. నీ భర్తను, సరోజను, నీ పిల్లల్ని నువ్వే బయటికి పంపించావు. నన్ను బాగా బ్రాందీ త్రాగించి, నేను కైపులో పడిపోయి నప్పుడు బీగాలు తీసుకొని ప్రేమలేఖలు తస్కరించి చంద్రకుమార్‌కు అందించావ్. వగలాడీ! నువ్వు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావని నమ్మి మోసపోయాను. ఆ డిటెక్టివ్‌లకు నా ఉనికిని నువ్వే తెలిపివుంటావు. నిన్ను చిత్రవధ చేస్తాను." పళ్లు పటపట కొరుకుతూ ఉద్రేకంతో ఊగిపోతూ అన్నాడు రఘునాథ్.

"లలితను చిత్రవధ చెయ్యలేవు. ముందు నీ గతి చూసుకో!" అన్నాడు రాబర్ట్ ముందుకు వస్తూ.

"మిస్టర్ రాబర్ట్!"

"నీ అనుచరుడు రాబర్ట్ ఈపాటికి జైల్లో కూర్చొని నీ కోసం ఎదురుచూస్తూ వుంటాడు. నేను డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్‌ను. నువ్వు మాధవిని బ్లాక్ మెయిల్ చేయడానికి వెళ్ళిన మిస్టర్ జాన్‌ను హత్యచేసి పారిపోతుండగా ఆమె యింటికి వెనుకవైపు సందులో నిలబెట్టిన నీ కారు డిక్కీలో కూర్చొని వచ్చాను.

నీ కారు నెంబరు ఎం.ఎస్.వై. 3001. లలిత యింటి దగ్గర ఒక పెద్దమనిషిలా ఏమీ తెలియని అమాయకుడిలా మాట్లాడుతూ ఎం.ఎస్.క. 1102 కారు నెంబరు ఇచ్చావు. విచారించగా ఆ నెంబరుగల కారు సేట్ ధనీరామ్‌దని, నెలరోజులనుండి అది షెడ్‌లోనే పడివుందని తెలిసింది.

మిస్టర్ రఘునాథ్! మిస్టర్ జాన్ చనిపోయేముందు రక్తంతో 'డి.ఆర్.ఎమ్.సి.' అన్న అక్షరాలు వ్రాశాడు. దాన్నిబట్టి 'డైరెక్టర్ రఘునాథ్ మెర్రిలాండ్ క్లబ్' అని చంద్రకుమార్ డీకోడ్ చేశాడు.

చిన్న గడ్డం, బొద్దుమీసాలు, ముక్కుదగ్గర పులిపిరి, గిరిజాల జుట్టుగల రాబర్ట్ బయటినుండి బంగళాలోకి వెళ్తుండగా అతని నోరు నొక్కి బంధించాను. పట్టి చూస్తే అతనిది వేషం అని తెలిసింది. అతని మేకప్ అంతా ఊడదీసి వెంటనే రాబర్ట్‌నయ్యాను. నిరభ్యంతరంగా బంగళాలోకి వచ్చాను. నీకు తెలియకుండా లలితను కలుసుకొన్నాను. నీకు, నీ అనుచరులకు మత్తుమందిచ్చి, ప్రేమలేఖలు సంపాదించాము, అందరినీ విడిపించి చంద్రకుమార్

తెచ్చిన కారులో ఎక్కించి పంపించాము. నిన్నూ, నీ ముఠాను ఒక్కరు మిగలకుండా అందరినీ ఒకేసారి బంధించాలని ఇంతా యిక్కడే వున్నాను," అన్నాడు ప్రేమ్ కుమార్ వేషాన్ని తీసేస్తూ.

అంతలో చంద్రకుమార్ పోలీసు బలగంతో వచ్చాడు.

ఇన్‌స్పెక్టర్ రామనాథ్ హంతకుడు, బ్లాక్ మెయిలర్ అయిన రఘునాథ్ చేతులకు బేడీలు వేశాడు. అతని మనుషులను నిర్బంధంలోకి తీసుకున్నాడు.

"మిసెస్ లలితా! సాటి స్త్రీ కాపురం నిలబెట్టడం కోసం సాహసించి అద్భుతంగా నటించారు. మీ నటన రఘునాథ్‌కు ఏమాత్రం అనుమానానికి ఆస్కారం యివ్వ లేదు. మిమ్మల్ని అనుమానించియుంటే ఎప్పుడో మీ ప్రాణాలు తీసేవాడు. స్త్రీజాతికి వన్నె తెచ్చారు." అన్నాడు డిటెక్టివ్ ప్రేమ్‌కుమార్, లలితను అభినందిస్తూ.

—: ఐపోయింది :—

# ప్రేమ పూజారులు!

వసుంధర

"గీతా—నువ్వు అందని పళ్ళకోసం అర్రులు చాస్తున్నావు. నీ ఈ కోరిక మూలంగా మనమిద్దరం ఎప్పటికీ ఒకటవలేమేమో — నీ మనసు మార్చుకో" అన్నాడు కిరణ్.

"అంటే—నీవు డబ్బు సంపాదించలేనంటావ్?" సూటిగా అడిగింది గీత.

"నావల్ల కాదు గీతా, నేను అత్యంత సామాన్యుణ్ణి. కానీ మనం, వివాహం చేసుకుంటే మన జీవితం స్వర్గ ధామంలా ఉండగలదని మాత్రం నీకు మాటిస్తున్నాను. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను. నీకే కష్టమూ కలగనివ్వను. ఆ మాత్రపు ఆర్థికస్తోమతుంది నాకు"

అన్నాడు కిరణ్ ఆవేశంగా.

గీత అదోలా నవ్వింది. "నన్ను పువ్వుల్లో పూజించే భర్త కావాలి నాకు. కానీ అవి మామూలు పువ్వులు కాకూడదు. బంగారుపువ్వులు. జీవితం స్వర్గధామంలా ఉంటే చాలదు. ఇల్లుకూడా ఇంద్రభవనంలా ఉండాలి" చెబుతూంటే గీత కళ్ళలో కనబడుతున్న మెరుపువంక నిరాశగా చూశాడు కిరణ్. గీత అడిగింది–"నీకు నామీద ప్రేమ వుంటే ఆ స్థాయికి ఎదగడానికి ప్రయత్నించు. అప్పుడు నేనే నీకు అందుతాను. ఎందుకంటే నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను కనక."

కిరణ్ అనాసక్తతతో నవ్వాడు. "బహుశా అది నావల్ల కాని పని అనుకుంటాను."

గీత కిరణ్ వంక అదోలా చూసి, "చూడు కిరణ్, నేను ఆశాజీవిని. నిరాశ, నిరుత్సాహం మనిషిని తినేసి నిర్వీర్యుణ్ణి చేస్తాయి. జీవితంలో పైకి రావాలంటే ఒక లక్ష్యం వుండాలి. అదీ పెద్ద లక్ష్యం" అంది.

"కానీ గొంతెమ్మకోరికయి నెరవేర్చుకోవడం లక్ష్య సాధన అనుకునేవాళ్ళకు నేనేం చెప్పేది?"

"ఈ ప్రపంచంలో అసాధ్యమైనదంటూ ఏదీ లేదు. నీవు సాధించకపోతే నేను సాధిస్తాను. నామీద నాకా నమ్మకముంది. రెండు సంవత్సరాలు వేచివుండు. బహుశా అప్పటికి నేనా అంతస్తు చేరుకుంటాను. అప్పుడు నిన్ను నా జీవితంలోకి ఆహ్వానిస్తాను" అంది గీత మాటల్లో గర్వాన్నీ, అతిశయాన్నీ మిళితంచేస్తూ.

"నీకోసం రెండుసంవత్సరాలేం కర్మ, ఎంతకాలమైనా వేచివుంటాను" అన్నాడు కిరణ్.

"కానీ, ఒక్కమాట. నేను కోరుకునే అంతస్తు చేరు

కున్నాక, నిన్ను నా జీవితంలోకి ఆహ్వానించాలనే అను కుంటున్నాను. కానీ అలా అని గ్యారంటీ మాత్రం ఇవ్వ లేను. ఎందుకంటే, ఆ అంతస్తు చేరుకునే లక్ష్యసాధనలో నేను మరొకరి సొత్తయిపోతే చేసేదేమీలేదు. కాకుండా ప్రయత్నిస్తాను. కానీ నీకు తెలుసుకదా, నేను అన్నిటి కంటె జీవితాన్ని ప్రేమిస్తున్నాను. జీవితం డబ్బులో ఉందని నా నమ్మకం."

"నాకు మాత్రం నువ్వే జీవితం" అన్నాడు కిరణ్.

"అందుకే జీవితం తర్వాత నేను ప్రేమించేది నిన్నే మరి" అని ఒకసారి టైమ్ చూసుకుని, "బాప్ రే నాలుగై పోయింది. ఇంట్లో అమ్మా, నాన్న కంగారు పడుతూం టారు, వస్తాను!" అంది గీత, పార్కు నుండి బయటకు కదులుతూ.

## 2

"ఈ ఉద్యోగం నాకు చాలా అవసరం. నామీద ఆధారపడ్డవాళ్ళు చాలామంది ఉన్నారు" అంది ఉమ.

గీత నవ్వింది, "మీలాంటివాళ్ళకిలాంటి ఉద్యోగాలు రావు. ఇలా అన్నానని ఏమీ అనుకోకండి."

"ఎందుకో తెలుసుకోవచ్చా?" ఉమ కాస్త ఉక్రోషంతో అడిగింది.

"అబ్వియస్, మీకేమో ఇంట్లో లక్ష సమస్యలు. ఈ ఉద్యోగం చురుకైన వాళ్ళకోసం. చలాకీగా ఆడుతూ, పాడుతూ నవ్వగలిగుండాలి. మీరు నవ్వగలిగినా, ఆ నవ్వులో జీవముండదు. కంపెనీ మానేజర్‌కి సెక్రటరీ అంటే మాటలు కాదు."

ఉమ నిరాశ పడిపోయింది, "చూద్దాం" అంది.

"చూసేదేం లేదు. రెండునెలలుగా మీ వుద్యోగం దొరక్కపోతే నన్ను మీరు మళ్ళీ ఈ ఆఫీసులోనే కలుసుకోండి. అప్పటికి నేను బహుశా మీకు సహాయపడగల స్థితిలో ఉంటాననుకుంటాను" అంది గీత.

ఉమ అనుమానంగా గీత వంక చూసింది. "మీకేమైనా రికమెండేషనుందేమిటి? చాలా నమ్మకంగా చెబుతున్నారు" అంది.

"నాకే రికమెండేషనూ లేదు. నామీద నాకే నమ్మకం" అంది గీత.

ఉమ నిట్టూర్చి, "సినిమా స్టార్లా ఉన్నారు. ఆ నమ్మకముండడంలో ఆశ్చర్యంలేదు" అంది.

"నాకూ, సినిమా స్టార్స్‌కీ పోలికేమిటి లెండి. నాది సహజ సౌందర్యం" అంది గీత దర్పంగా.

ఉమకు పిలుపు వచ్చింది. ఆమె లోపలకు వెళ్ళింది. గీత టైము చూసుకుని ఓసారి చుట్టూ చూసుకుంది. ఇంకా నలుగురున్నారు తను కాక. ఉమతో కలిపి ఇంతవరకూ నలుగురు లోపలకు వెళ్ళారు. ఒక్క పోస్టుకు తొమ్మండుగురిని పిలిచారు. ఆ నవగ్రహాలలోనూ తనే సూర్యుడు. మిగతావాళ్ళంతా దివిటీల్లాగున్నారు.

గీత అహంకారి కాదు. గర్విష్టి కాదు. కానీ అప్పుడప్పుడు అనుకున్న ఆశయాలు సిదింప చేసుకోవడానికి తగినంత ధైర్యం లభించాలనుకుంటే, ఎవరైనాసరే యీ రెంటినీ ఆశ్రయించవలసింది. అహంకారం, గర్వం - ఆత్మస్థయిర్యాన్ని పెంచడానికి బాగా పనికొస్తాయి. కానీ, ఆత్మస్థయిర్యానికవే పునాదులైనప్పుడు మాత్రం పతనానికి దారితీస్తాయి.

ఉమ వచ్చింది. ఆమె ఉత్సాహంగా లేదు. "సెలక్షన్ ఆల్ రెడీ ఐపోయినట్లుంది. చాలా కాజువల్ గా ప్రశ్నించి పంపేశారు" అని చెప్పి వెళ్ళిపోయింది ఉమ.

గీతకు అందరికంటె ఆఖర్న పిలుపు వచ్చింది. గీత మహా రాణిలా లేచి నిలబడింది. తాచుపాములా చరచరా కదిలింది. పడగవిప్పిన నాగులా ఇంటర్వ్యూ బోర్డు మెంబర్సు ముందు నిలబడింది.

"కూర్చోండి!" అన్నాడు ఓ యువకుడు. గీత మహా రాణిలా కూర్చుంది. ఓ పర్యాయం చుట్టూ చూసింది. తన ప్రజల వంక రాణీ చూస్తున్నట్లున్నాయా చూపులు.

మొత్తం ముగ్గురున్నారు అక్కడ. గీతకు యెదురుగా సుమారు పాతికేళ్ళ యువకుడున్నాడు. అందంగా, హుందాగావున్నాడు.అతనే బహుశా మేనేజరయుండాలి. అతని కటూ ఇటూ ఇద్దరు నడివయస్కులున్నారు.

ఏవో ప్రశ్నలు వేశారు. ఏవో జవాబులు చెప్పింది గీత.

ఒక పదినిముషాలు గడిచేక యువకుడన్నాడు. "మిస్ గీతా! అందరికంటె ఆఖర్న మిమ్మల్ని పిలవడానికి కారణం తెలుసా?"

గీత పెదవి కదపలేదు. నవ్వింది. ఆ నవ్వులో జవాబుంది.

ఆ నవ్వు యువకుణ్ణి ముగ్ధుణ్ణి చేసింది. "మొట్టమొదటే మిమ్మల్ని పిలిస్తే, మిగతా వాళ్ళని ఇంటర్వ్యూ అయినా చెయ్యకుండా పంపేయవలసి వస్తుందేమోనని" అన్నాడు.

గీత ముఖం సంతోషంతో వెలిగింది.

"సరిగ్గా మీవంటి అమ్మాయికోసమే వెతుకుతున్నాము. మీ ఫోటో, మీ క్వాలిఫికేషన్సు చూసేక ఇంటర్వ్యూ అనవసరమనిపించింది. కానీ ఏదో ఫార్మాలిటీ."

ఉమకీ విషయం తనెప్పుడో చెప్పింది. గీత కది తొలి

విజయం. నెలకు నాలుగువందల రూపాయిలు జీతం. జీతమంతా బ్యాంకులో వేసేస్తే ఏడాదికి అయిదువేలొస్తాయి, అనుకుందామె మనసులో. మరోసారి తనకు కాబోయే బాస్‌ని చూసింది.

"నా పేరు రవిశంకర్. కానీ, ఎక్కువమంది నన్ను శంకర్ అనే పిలుస్తూంటారు" అన్నాడు అతను.

# 3

"మిస్ గీతా!" అన్నాడు రవిశంకర్.

"యెస్ సర్" అంది గీత.

శంకర్ డిక్టేషనిచ్చాడు. గీత తీసుకుంది. ఓ పది నిముషాల్లో అది టైపుచేసి మళ్ళీ అతని కందించింది. చదువుకుని తృప్తిగా నిట్టూర్చాడు. "ఆఖరికి మీ టైపింగ్ కూడా అందంగా ఉంటుంది" అన్నాడు.

"లేకపోతే నా ఉద్యోగముండదు గదా మరి" అంది గీత.

"ఏమన్నారు?" అన్నాడు రవిశంకర్.

"ఈ ప్రపంచంలో జీవితమంతా అందాన్ని మెయింటైన్ చేయగలగడంలోనే ఉంది. నా టైపింగ్ అందంగా ఉండకపోతే—నా ఉద్యోగం ఉండదు గదా మరి" అంది గీత మళ్ళీ.

"అయితే నిన్ను నువ్వు కేవలం ఒక టైపిస్టుగా భావిస్తున్నావన్నమాట."

"భావించడం కాదు. ఇటీజే ఫాక్ట్!" అంది గీత అందంగా నవ్వుతూ.

"నా సెక్రటరీ పదవికే ఇది అవమానం. కేవలం టైపిస్టుగా ఉండడానికి సెలక్ట్ చేసుకోలేదు నేను నా సెక్రటరీని" అన్నాడు రవిశంకర్.

గీత తమాషాగా నవ్వి, "మీరు నన్ను నువ్వంటారు,

నేను మిమ్మల్ని మీరంటాను. ఏదో కాకతాళీయంగా రోడ్డు మీద కలుసుకుని ఉంటే ఇద్దరూ ఒకరినొకరు మీరని మన్నించుకుని ఉండేవాళ్ళం. ఎందుకంటే అప్పుడు ఒకరి అంతస్తు ఒకరికి తెలియదు కనుక. కానీ, ఇప్పుడు నా అంతస్తు మీకు తెలుసు. మీ సంబోధనే చెప్పక చెబుతుంది, నేను కేవలం మీ టైపిస్టునని'' అంది.

రవిశంకర్ ముఖం గంభీరంగా అయిపోయింది. ''మిస్ గీతా! మనిషి సంబోధనకూ, మనిషి వ్యక్తికిచ్చే గౌరవానికీ అన్ని పర్యాయాలూ సంబంధముండదు. హృదయానికి అతి చేరువలో ఉన్న మనిషిని మీరని మన్నించడం నావల్ల కాదు. నన్ను నువ్వు మన్నిస్తున్నా వారించకపోవడానికి కారణంకూడా ఈ ఆఫీసులోని మామూలు ప్రాక్టీసుకి భిన్నంగా కనిపించి నలుగురు ప్రత్యేక దృష్టిలోనూ పడకూడదని'' అన్నాడు.

''నేనేమీ ఎక్స్‌ప్లనేషన్ అడగలేదు. తప్పందనీ చెప్పలేదు. ఉన్నమాటొకటి మాటవరసకి అన్నాను'' అంది గీత ఇంకా నవ్వుతూ. ఆ నవ్వులో వెయ్యి సమ్మోహనాస్త్రాలున్నాయ్.

రవిశంకర్ అప్పటికి మాట్లాడలేదు.

## 4

గీత, రవిశంకర్ గురించి చాలా సమాచారం సేకరించింది. అతగాడు బంగారు పిచ్చిక. కొద్దిగా ధనగర్వమున్నప్పటికీ విశాలభావాలుకూడా ఉన్నాయని చెప్పవచ్చు. అతగాడికి చెప్పుకోదగ్గ వ్యసనాలున్నట్లు లేదు. నలుగురిలో మంచిపేరుంది.

ప్రత్యేకించి రవిశంకర్ తనపట్ల ఆకర్షితుడు కావడానికి గీత ప్రయత్నించలేదు. తన పనిని అమితశ్రద్ధతో చేసే

దామె. అతన్ని వ్యక్తిగా పూర్తిగా నిర్లక్ష్యం చేసింది. ఎన్నో పర్యాయాలతను ఆమెకు తనపట్ల గల భావాలు తెలుసుకుందామని ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఈ అనాసక్తత అతని అహాన్ని సవాలు చేస్తూండేది.

రవిశంకర్ కూడా గీత ఆర్థికస్థాయి గురించి వాకబు చేశాడు. ఆమె చాలా సాదా మనిషని అతనికి తెలిసి పోయింది. కానీ అందంమాత్రం అపూర్వం.

క్రమంగా రవిశంకర్ ఆమెపట్ల ఆకర్షితుడౌతున్నాడు. ఆ ఆకర్షణ అతని చూపుల్లో వ్యక్తమౌతూనే వుంది. ఆ ఆకర్షణని గీత గమనించకపోలేదు. కానీ ఆమె గమనించనట్లే ఊరుకుంది.

"ఈ రోజు సాయంత్రం కొన్ని అర్జంటు ఉత్తరాలు ఫైనలైజ్ చేయవలసుంటుంది. బహుశా ఇంటికి వెళ్ళేసరికి ఆలస్యం కావచ్చునేమో" అన్నాడు రవిశంకర్ ఒక రోజున.

"ఆఫీసు వ్యవహారానికి సంబంధించినంతవరకూ ఓవర్ టైం చేయడానికి నాకు అభ్యంతరంలేదు. ఇంకా డబ్బు వస్తుంది గదా" అంది గీత.

అంతకుమించి కుతూహలాన్ని చూపకపోవడం రవిశంకర్ కు నిరుత్సాహం కలిగించింది.

ఆ రోజు సాయంత్రం అయిదుగంటల ఇరవై నిముషాలకు ఆఫీసులో ఇద్దరంటే ఇద్దరున్నారు. రవిశంకర్, గీత!

గీత కాగితం, పెన్సిలు పట్టుకుని సిద్ధంగా వుంది.

"గీతా, నేనో ప్రశ్న అడుగుతాను. జవాబు చెబుతావా?" అన్నాడు రవిశంకర్.

"అడగండి."

"నేనెలా వుంటాను."

"అవసరానికి మించి పరీక్షించడం నా కలవాటులేదు. నాకు తెలిసిందల్లా ఆఫీసు వ్యవహారాలకు సంబంధించినంత వరకూ మీరు నాతోనూ, మిగతా స్టాఫ్‌తోనూకూడా చాలా ఉదాత్తంగా వుంటారని!" అంది గీత నిర్లిప్తంగా.

"నే నడిగింది దదికాదు. ఎలా వుంటానంటే చూడ్డానికి నా రూపురేఖ లెలాగుంటాయని?" ఈసారి ఇంకా స్పష్టంగా అడిగేడు రవిశంకర్.

"ఇందాక నే చెప్పాను గదా. అవసరానికి మించి పరీక్షించడం నా కలవాటులేదని. నా ఉద్యోగానికీ, మీ రూపురేఖలకూ సంబంధంలేదు. వాటిగురించి నే నాలోచించలేదు" గీత అబద్ధం చెప్పింది.

"పోనీ, ఇప్పుడాలోచించు."

"అర్జంటు ఉత్తరా లాలశ్యమైపోతాయి. డిక్టేషన్ మొదలు పెడతారా" అంది గీత.

రవిశంకర్ గొంతు సవరించుకుని, "రాసుకో!" అన్నాడు గీత రెడీ అయింది.

"డియర్ గీతా, యూ ఆరే వండ్రఫుల్ గర్ల్. అయామ్ జస్ట్ బి కమింగ్ మాడ్ సీయింగ్ యూ..." అని, "అరే-నువ్వేం రాస్తున్నట్లు లేదే. ఈ ఉత్తరం అర్జంటుగా ఫైనలైజ్ చేసి రేపు పోస్టుచేయాలి" అన్నాడతను.

"రాయ నవసరంలేదు. ఉత్తరం ఎవరికి రాస్తున్నారో ఆమె ఎదురుగానే వుంది" అంది గీత నెమ్మదిగా.

"గీతంటే నువ్వేనేమిటి? చాలామంది వుంటారు. అందులో నాకు తెలిసిన గీత..."

"నేనేనని నాకు తెలుసు. వండ్రఫుల్ గర్ల్, అయామ్ జస్ట్ బికమింగ్ మాడ్ సీయింగ్ యూ అన్న వాక్యాలు

వర్తించే గీత ఈ ఊరి మొత్తానికి నేను తప్ప మరెవ్వరూ కానేరదు" అంది గీత హుందాగా.

"చాలా గర్వముంది నీకు" అన్నాడు రవిశంకర్.

"గర్వం సంగతి తెలియదు. కానీ ఉన్నమాట అన్నప్పుడల్లా చాలామంది నన్నిలాగే అంటూంటారు."

"అందానికి గర్వంకూడా ఒక అందమే. ఇంతకీ నా ఉత్తరానికి జవాబెప్పుడొస్తుంది?"

"తెలియదు. నాకొచ్చిన ఇటువంటి ఉత్తరాలను నాన్నగారి కిస్తాను. ఆయన జవాబెప్పుడిస్తే అప్పుడొస్తుంది."

రవిశంకర్ దెబ్బతిన్నట్లు కనబడ్డాడు. "నా దగ్గర పని చేస్తున్నావు కదా. నామీద కొన్ని అభిప్రాయాలంటూ ఏర్పడివుండాలి మరి. అవి చెప్పొచ్చుగా" అన్నాడు.

"నేను అయిదువారాలుగా మీ దగ్గర పనిచేస్తున్నాను. ఎప్పుడూ ఒక్క పర్యాయంకూడా రాజీనామా గురించి ఆలోచించవలసిన అవసరం రాలేదు. అదే మీకు సర్టిఫికెట్" అంది గీత నిర్లక్ష్యంగా.

రవిశంకర్ తన సీట్లోంచి లేచి గీతవద్దకు వచ్చాడు. ఒక్క_క్షణం తటపటాయించి ఆమె చేయి పట్టుకుని, "ఒకవేళ ఇలా నేను హద్దుమీరితే రాజీనామా ఇస్తావా?" అనడిగాడు.

గీత ఒక్క_ ఉదుటున చేయి విడిపించుకుంది. "రాజీనామా సంగతి తర్వాత ఆలోచిస్తాను. ముందు నామీద చేయి వేసినవాడి ప్రాణాలు తీస్తాను."

"చూస్తాను_ఎలా తీస్తావో?" అంటూ రవిశంకర్ మళ్ళీ చేయి పట్టుకున్నాడు.

గీత బలంగా అతని చేయి విదిలించి దూరంగా వెళ్ళింది. ఆమె చేతిలో ఇప్పుడు చిన్న కైజారుంది. "నా

జాగ్రత్తలో నేనుండగలను-" అందామె రొప్పుతూ.

"శభాష్-పులిపిల్లవి నువ్వు గీతా!" అన్నాడు చప్పట్లు కొడుతూ.

"నా చెయ్యి పట్టుకోవడానికి ఎంత ధైర్యం. అందుకు కావలసిన అర్హత లాలోచించారా?" అంది గీత తీవ్రంగా.

"అందరి అర్హతలూ తెలుసు నాకు." అన్నాడు రవి శంకర్.

"తెలిస్తే మిమ్మల్నిలా తక్కువ అంచనా వేసుకొని బలవంతంగా నా చేయి పట్టుకునేవారు కారు మీరు. అందుకు సంఘం ఆమోదించిన పద్ధతి ఒకటుంది." అంది గీత.

సమాధానం నోటి చివరివరకూ వచ్చినా అనలేదు రవి శంకర్. ఆవేశంలోని గీత ముఖం అతన్ని మరింత ముగ్ధుణ్ణి చేస్తోంది.

# 5

"నన్ను క్షమించు గీతా!" అన్నాడు రవిశంకర్.

"ఎందుకు?" అంది గీత.

"అసలీ రోజు నువ్వు మళ్ళీ ఆఫీసుకు వస్తావనుకోలేదు. రాజీనామా పంపిస్తావనుకున్నాను."

"నేను పిరికిదాన్ని కాదు. ఎవర్నిలా ఎదిరించి బ్రతకాలో నాకు తెలుసు. రాజీనామా ఇవ్వలేదు కదా అని మీ చర్యల కామోదముద్ర లభించిందనుకొని పొరబడ్డారో—అసహాయస్థితిలో నన్ను పులిపిల్లన్నారు చూడండి-అందులో నిజాన్ని ప్రత్యక్షంగా చూడగలుగుతారు."

రవిశంకర్ ముఖం ముడుచుకొని "నన్ను క్షమించ

లేవా?'' అన్నాడు.

గీత మాట్లాడలేదు.

''రాత్రల్లా నేను బాగా ఆలోచించాను. నేను నిన్ను పెళ్ళి చేసుకోదల్చాను.'' అన్నాడు సూటిగా.

గీత ఆశ్చర్యంగా అతనివంక చూసింది. ''మిమ్మల్ని క్షమించడమే కాదు. అభినందిస్తున్నాను కూడా. కానీ చిన్న విషయం గుర్తుంచుకోండి. మన పెళ్ళి అసాధ్యం.'' అంది.

''ఎందువల్ల?'' అన్నాడతను దెబ్బతిని.

''మీకూ, నాకూ అంతస్తులో చాలా తేడా ఉంది.''

ఆమె ఇంకా ఏదో అనబోతూండగా అతనందుకుని ''ఆడవాళ్ళ అంతస్తుని వివాహం మార్చేస్తుంది.'' అన్నాడు.

''కావచ్చు. కానీ ఎవరికైనా అందంమీద మోజు అందనంతవరకే. అందేక ఆ అందాన్ని చిన్నచూపు చూస్తారు. అందులోనూ ఆ అందం ఐశ్వర్యం లేనిదైతే...'' ఆమె కావాలనే ఆగిపోయింది.

''నేనటువంటివాణ్ణి కాదు.'' అన్నాడతను.

''మీ రెటువంటివారో నాకెలా తెలుస్తుంది? నాకు తెలిసిన నిజమల్లా ఒక్కటే. ఏ బంధాలూ ఏర్పరచుకోకుండా నన్ను మీ సొంతం చేసుకోవాలనుకున్నారు. అది కుదరదని తెలిసాకనే వివాహం ఆలోచన వచ్చింది మీకు. నా అంతస్తు మీకు నా ఒంటిమీద చేయి వేయగల ధైర్యాన్నిచ్చింది. నా అందం మిమ్మల్ని వివాహానికి పురిగొల్పింది. ఈ రెంటినీ కలుపుకుని ఆలోచిస్తూంటే భవిష్యత్తు ఇంకోలా కనబడుతోంది.''

అతను ఒక్క క్షణం ఆలోచించినట్లు కనబడ్డాడు.

"పోనీ ఏం చేయాలో చెప్పు."

"ఏమీ చేయవద్దు. నన్నిలా వదిలిపెట్టండి. వీలుంటే నా జీతం పెంచండి. నా జీతాన్ని నేను బ్యాంకులో నిల్వచేస్తున్నాను. నా భర్తను నేను కొనుక్కునే స్థాయికి ఎదగాలని నా ఆశయం." అంది గీత.

"ఐసీ." అన్నాడతను. "పోనీ ఒక పని చేస్తాను. వివాహం కాగానే నీ పేరున కొంత డబ్బు వేస్తాను."

"కొంతంటే?"

"నువ్వడిగినంత! కానీ లక్ష రూపాయలకు తక్కువ మాత్రం కాదు."

ఆమె అతనివంక తమాషాగా కవ్విస్తున్నట్లు చూసింది. "పోనీ ఆ పని వివాహానికి ముందే చేయకూడదూ? అప్పుడు నేనొక లక్షాధికారిణిగా మిమ్మల్ని వివాహం చేసుకో గలుగుతాను."

అతను తడబడ్డాడు. నోట మాట రాలేదు.

గీత నవ్వింది. ఆ నవ్వులోనే వ్యంగ్యం ధ్వనించింది. "నేను ముందే చెప్పాను మన వివాహం అసంభవమని. వివాహం అనంతరం నా పేరున డబ్బు వేస్తారని నేను నమ్మాలి తప్పితే—ముందుగా డబ్బిస్తే నేను మిమ్మల్ని మోసంచేయనని మీరు నమ్మరు. నేను మోసంచేసే రకాన్నయితే వివాహానంతరం మాత్రం మోసంచేయనని నమ్మకమేమిటి? కానీ మీలో ఏదో ధైర్యముంది. అంటే ఏదో మోసపుటాలోచన ఉందన్నమాట."

"నేను కోటీశ్వరుణ్ణనుకోవచ్చు. నిన్ను వివాహం చేసుకునేందుకు సిద్ధపడ్డానంటే—ఒక్క దెబ్బతో నీ అదృష్టం తిరిగి అఖండైశ్వర్యానికి వారసురాలివి కాబోతున్నావు. కానీ నిన్నా వారసత్వం ఆకర్షించడంలేదు. ముందుగా

డబ్బు కావాలంటున్నావు. అంటే నేనేమనుకోవాలి. నీలో ఏదో ఇతర ఆలోచనలున్నాయనేగదా!"

"అంతస్తుల పొర మీ కళ్ళని కప్పేసింది. నన్నఖండై శ్వర్యానికి వారసురాలిని చేస్తున్నానని గర్వపడుతున్నారు తప్పితే–ఆ నిర్ణయమెందుకు చేసుకున్నారో ఆలోచించడం లేదు. అద్భుత సౌందర్యాన్ని స్వంతం చేసుకొనే ప్రయత్నంలో మీరు తీసుకొన్న నిర్ణయమది. నన్ను వివాహం చేసుకోవాలనుకుంటూనే నన్ను నమ్మలేకపోతున్నారు. పరస్పర అవగాహన లేనివారి మధ్య వివాహబంధముండకూడదు. పరస్పర అవగాహన కావాలంటే ఒకసారి అంతస్తులు మరిచిపొండి. నన్ను మీరు నమ్మలేకపోవడం నా అహాన్ని దెబ్బతియ్యదా? అహంకారం ఐశ్వర్యవంతుల కొక్కరికే ఉంటుందనుకోకండి."

"గీతా! మాటలతో నన్ను రెచ్చగొడుతున్నావ్." అన్నాడతను చిరాగ్గా.

"మీరు నన్ను మిస్ గీతా అని పిలవండి. నేను ఎస్ సర్ అంటాను. ఎవరూ రెచ్చిపోవలసిన అవసరముండదు. అదే సరైన అనుబంధం మనకు." అంది గీత.

# 6

"మిస్ గీతా!"

"ఎస్ సర్!"

"డిక్టేషన్ తీసుకుంటావా?"

"ఊఁ!"

రవిశంకర్ ఒక్క క్షణం ఆగి చెప్పడం మొదలు పెట్టాడు. "డియర్ గీతా–ఐ వాంటెడ్ టూ ప్రూవ్ మై లవ్ ఫర్ యూ. నౌ యూ విల్ రియలైజ్ వాట్ ఐ మీన్..." అని ఆగి "రాయడంలేదేం?" అనడిగాడతను.

"అవసరం లేదనిపించింది."

"అవసరమా నా కాదా అన్నది నేను తేల్చాలి."

"కాదు. నేనే తేల్చాలి."

రవిశంకర్ గీత ముఖంలోకి చూస్తూ మాట్లాడకుండా ఉండిపోయాడు. ఎలా సృష్టించబడిందో ఈమె? ఇటు వంటి సౌందర్యం భూమ్మీద మరో చోట ఉండివుండదు. ఆమె గర్వం, అతిశయం, అహంకారం, ఆవేశం. పొగరుబోతు తనం అన్నీ అందానికి వన్నె తెచ్చాయి. తన నిర్ణయంలో పొరబాటేమీ లేదు. ఈమె తనకు భార్యయితే జీవితంలో తనకు మించిన అదృష్టవంతుడుండడు.

"మిస్ గీతా!" అన్నాడతను కఠినంగా.

"ఎస్." అందామె నిర్లిప్తంగా.

"మన మిప్పుడు బయటకు వెడుతున్నాం." అన్నాడతను.

"ఎందుకు?"

"నన్నేమీ అడగవద్దు. నాతో రా." అన్నాడతను గంభీరంగా. అది చాలా ఖచ్చితమైన ఆజ్ఞ. గీత మరి మాట్లాడలేదు. అతన్ని అనుసరించింది.

ఇద్దరూ కారెక్కారు. అతను ముందు సీట్లో, గీత వెనుక సీట్లో. ఎక్కడికని అడగలేదు డ్రైవర్. అన్నీ తెలిసున్నవాడిలా కారు పోనిచ్చాడు.

గీత మెదడులో రకరకాల ఆలోచనలు పరుగెడు తున్నాయి. ఇప్పుడితను తన నెక్కడికి తీసుకెడతాడు? ఆమె ఒకసారి తన వ్యానిటీబ్యాగ్ తెరిచి అందులోనున్న పిస్టల్‌ను చూసుకొని తృప్తిగా బ్యాగ్ మూసింది.

ఆమె అనుమానాలను అబద్ధం చేస్తూ కారు ఒక పెద్ద భవనం ముందు ఆగింది. అది బ్యాంక్ ఆఫ్ ఇండియావారి

మెయిన్ బ్రాంచి ఆఫీసు.

ఇద్దరూ కారు దిగారు. ఆఫీస్‌లోకి వెళ్ళారు.

అక్కడ చకచకా పనులు జరిగిపోయాయి. గీత తన కళ్ళను తనే నమ్మలేక ఒకసారి ఒళ్ళు గిల్లి చూసుకుంది. తననుకున్న పని ఇంత సులభంగా సాధ్యపడుతుందనుకో లేదు.

గీత పేరున రవిశంకర్ లక్ష రూపాయలకు అకౌంట్ ఓపెన్ జేశాడు. అది అబద్ధం కాదు. నిజం – గీత చేతిలో ఇప్పుడు చెక్కు పుస్తకం ఉంది.

"హలో శంకర్!"

రవిశంకర్ వెనక్కు తిరిగాడు. "అరే – నువ్వా గోపాల్!" అన్నాడు.

"ఏమిటి కథ? చాలా హుషారుగా ఉన్నావ్. పక్క నెవరో..."

"ఉష్!" అన్నాడు రవిశంకర్. "ఇంతకీ ఎప్పు డొచ్చావ్ నువ్వు. అమెరికా వెళ్ళావన్నారు వామధ్య!"

"సరిగ్గా పదిరోజులైంది. నీ పక్కనున్నామె ఎవరు?"

"గీతా!" రవిశంకర్ పిలిచాడు.

గీత నెమ్మదిగా నడిచి రవిశంకర్ దగ్గరకు వచ్చింది. "ఈమె మిస్ గీత! నా పర్సనల్ సెక్రటరీ." అన్నాడు.

"గ్లాడ్ టూ మీట్ యూ." అతను చేయి చాపాడు.

గీత "నమస్తే!" అంది చేతులు జోడించి.

"వాటే బ్యూటీ!" అన్నాడు గోపాల్. రవిశంకర్ గర్వంగా నవ్వాడు.

"నా స్నేహితుడు. హరనాథ్ ఎంటర్‌ప్రైజెస్ ప్రొప్రైటర్ గారబ్బాయి గోపాలకృష్ణ. బిజినెస్ వ్యవహా రాలో స్పెషల్ ట్రైనింగ్ కోసం అమెరికా వెళ్ళి ఓ

నాలుగు నెల్లుండి పది రోజుల క్రితమే వచ్చాడు."

గీత మౌనంగా తలాడించింది.

"నా సెక్రెటరీ అట్టే మాట్లాడదు. బెస్ట్ యట్ వర్క్ అండ్ ఆల్వేస్ యట్ వర్క్."

"చాలా అదృష్టవంతుడివి." అన్నాడు గోపాలకృష్ణ. అతనింకా గీతవంకే చూస్తున్నాడు.

అదృష్టమంటే గోపాలకృష్ణ ఉద్దేశ్యంలో ఏమిటయ్యుంటుందీ అని ఆలోచించకుండా "థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్." అన్నాడు రవిశంకర్.

# 7

"నిజం!" అన్నాడు కిరణ్ నమ్మలేనట్లు.

"నమ్మలేకపోతే రేపు బ్యాంకాఫిండియాకు వెళ్ళి వెరిఫై చేసుకో." అంది గీత.

"అవసరంలేదులే! నీ సౌందర్యమటువంటిది. అయితే మీ పెళ్ళి తాంబూలాలవరకూ వచ్చేసిందన్నమాట." అన్నాడు కిరణ్ దీనంగా.

"ఏడిసినట్లుంది. నేను రవిశంకర్‌ని పెళ్ళాడుతానని ఎలాగనుకుంటున్నావ్?" అంది గీత.

"మరి..." అన్నాడనుమానంగా కిరణ్.

"అతని దగ్గర్నుంచి డబ్బు సంపాదించడమే నా ఉద్దేశ్యం. అంతే!"

"అంత సులభంగా వ్యవహారం ముగియదు. లక్ష రూపాయలు నీ పేరున వేశాడంటే నిన్నెంతగా ప్రేమిస్తున్నాడో చూడు. అతన్ని నువ్వు తప్పించుకోలేవు."

"కిరణ్! నీకు ప్రేమించగల హృదయముంది. ప్రేమించబడగల రూపమూ, మనసూ ఉన్నాయి. కానీ మెదడు మాత్రం లేదు." అంది గీత నవ్వుతూ.

కిరణ్ మాట్లాడలేదు.

"నేను డబ్బు సంపాదించగలనన్నప్పుడు నా మాట నమ్మలేదు నువ్వు. అతి సులభంగా సంపాదించేను. ఆడదానికోసం రాజ్యాలు నాశనమైపోయాయని చరిత్రలో చదివావు. నా అందం ఆ చరిత్రలోని ఆడవాళ్ళకు తీసిపోతుందంటావా?"

"తీసిపోదు. అందుకే భయపడుతున్నాను - రవిశంకర్ నిన్నొదిలిపెట్టడని. అయినా అతనికి మాత్రం తక్కువే మొచ్చింది. రూపముంది, గుణముంది, అన్నింటికీ మించి డబ్బుంది!"

"అవును. కానీ నాక్కావలసినదింకొకటుంది. అతనికి ప్రేమించే హృదయముండవచ్చు. కానీ ప్రేమించడానికి సమయంలేదు. నన్ను బంగారు పువ్వులతో పూజించగల స్తోమతుండవచ్చు. కానీ పూజించడానికి సమయముండదు. పెళ్ళయి ఏడాది గడిచిందంటే నేనొక సామాన్య గృహిణినైపోతాను. నా భర్త తన పూర్తి సమయాన్ని నా గురించి వినియోగించగలగాలి. అతనికి ఆర్థిక ఇబ్బందులుండకూడదు. ఇదీ నా కోరిక!"

"బాగుంది గీతా! ఎప్పటికైనా నీ కోరిక సిద్ధించగలదని ఆశిస్తున్నాను." అన్నాడు.

"నాకోసం నువ్వు మరికొంతకాలం వేచివుండగలవా కిరణ్?" అడిగింది గీత.

"రోజులు కాదు. యుగాలు వేచివుండగలను. కానీ ఇన్ని తెలివితేటలు, ఇంత సౌందర్యం ఉన్న నీకు నామీద ప్రేమ ఎందుకు గీతా!" అన్నాడతను.

"ఎందుకా?" అని నవ్వింది గీత. "ఇప్పుడు నేను చెప్పిన వివరాలు విన్న ఏ మగవాడైనా అసలు రవిశంకర్

నీకు లక్ష రూపాయ లెందుకిచ్చాడు? ఏ పద్ధతిలో ఈ డబ్బు సంపాదించావ్? అని ప్రశ్నలు వేస్తారు. అది ప్రేమవల్ల కలిగిన అసూయ కాదు. స్వార్థంతో కూడిన అనుమానం. అది నాకు చాలా అసహ్యం. నిజమైన ప్రేమలో అనుమానాలకూ, ఆగ్రహాలకూ తావులేదు. నమ్మకమూ, క్షమ ఈ రెండే ప్రేమ ఇవ్వగలిగేది. అవి ఇవ్వని నాడది ప్రేమ కాదు."

కిరణ్ అభినందిస్తున్నట్లుగా అన్నాడు. "నీ తెలివి తేటలకు నా జోహారు గీతా! నీలా ఆలోచించగల శక్తి నాకు లేదు. నాకు తెలిసిందల్లా ఒక్క విషయం మాత్రం. నువ్వు అగ్నితో సమానం. నిన్ను తాకినవాళ్ళు బూడిదేనా అయిపోతారు లేదా శుద్ధి అవుతారు."

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" అంటూ గీత లేచింది.

## 8

"మిస్ గీతా!"

పిలుపు విని ఉలిక్కిపడి వెనక్కితిరిగిందామె. మనిషిని కూడా ఆమె గుర్తుపట్టింది. అతను గోపాలకృష్ణ.

"గుర్తున్నానా?" అన్నాడతనామెను సమీపించి.

"ఆఁ బ్యాంకాఫీండియాలో ఒకసారి కలుసుకున్నాం" అంది గీత.

"ఇక్కడేం చేస్తున్నారు?"

"బస్సుకోసం ఎదురుచూస్తున్నాను" అంది గీత.

"వాట్. మీరు ఇంటికి బస్సులో వెడతారా?" అన్నాడు గోపాలకృష్ణ.

"అవును" అంది గీత ముక్తసరిగా.

"తన సెక్రటరీని ఎలా ట్రీట్ చేయాలో తెలియదన్న మాట రవిశంకర్‌కి. మీలాంటివారు బస్సులో ప్రయాణం

చేయడమా, ఛాఛా'' అన్నాడు గోపాలకృష్ణ.

గీత నవ్వి, ''మీకు తెలియదేమో, సెక్రటరీలెప్పుడూ బస్సుల్లోనే ప్రయాణంచేస్తారు. సెక్రటరీలను పెట్టుకున్న వాళ్ళు మాత్రమే కార్లలో వెడతారు'' అంది.

''కాదు. ఏమాత్రం కాదు. సెక్రటరీ బస్సులో వెడితే యజమాని హోదా తగ్గిపోతుంది. నేనైతే నా సెక్రటరీ కోసం ఒక కారుని ప్రత్యేకించేవాడిని'' అన్నాడు గోపాలకృష్ణ దర్పంగా.

''ఈజిట్'' అంది గీత అతనివంక చూస్తూ.

గోపాలకృష్ణ గర్వంగా తల ఊపి, ''అదిసరే, ఇంతకీ శంకర్ మీకు జీతమెంతిస్తున్నాడు'' అనడిగాడు.

''నాలుగొందల యాభై.''

''నాలుగొందల యాభైయా. ఛా, ఎక్స్ప్లాయిటేషన్- మియర్ ఎక్స్ప్లాయిటేషన్-నేనైతే...'' ఎందుకయినా మంచిదని అంకె చెప్పలేదు గోపాలకృష్ణ. ''పోనీ, ఇంక్రిమెంట్లేమైనా ఇచ్చాడా?''

''నేనుద్యోగంలో చేరి ఇంకా రెండునెలలు పూర్తి కాలేదండీ'' అంది గీత సౌమ్యంగా.

''కావచ్చు. కానీ, మీలాంటి సెక్రటరీకి నెలనెలకీ ఇంక్రిమెంట్లివ్వాలి. అందుల్లోనూ అంత తక్కువ జీతంలో ఎంప్లాయ్ చేసినప్పుడు'' అన్నాడు గోపాలకృష్ణ.

''బాగుందండీ. ఇలా ఐతే మీ వ్యాపారం మూణ్ణాళ్ళ ముచ్చటే అవుతుంది'' అంది గీత నవ్వి.

''అహహహహా...'' అని నవ్వేశాడు గోపాలకృష్ణ. 'నా వ్యాపారం మూన్నాళ్ళ ముచ్చటేమిటండీ. మూడు పువ్వులూ ఆరుకాయలుగా ఉంటూంటేనూ'' అని కాస్త స్వరం తగ్గించి, ''మీతో మాట్లాడాలి. ఆ కనపడుతున్న

పార్కులోకి వెడదాం, వస్తారా'' అనడిగాడు.

గీత ఒకసారి టైము చూసుకుంది.

''ఫర్వాలేదండి. మిమ్మల్ని నా కార్లో డ్రాప్ చేస్తాను.''

''ఆ పనిమాత్రం చేయకండి, పదండి'' అంది గీత.

ఇద్దరూ పార్కులో ఒకచోట కూర్చున్నారు.

''చెప్పండి!'' అంది గీత.

''ఏమీలేదు. నాకో పర్సనల్ సెక్రటరీ కావాలి. నెలకు ఎనిమిది వందలిస్తాను. మీ ఎరికలో...''

''ఉంది. ఉమ అని ఒకమ్మాయి. రవిశంకర్ దగ్గర ఉద్యోగానికి నాతోపాటు ఇంటర్వ్యూకి వచ్చి సెలక్టు కాక నిరుత్సాహపడి పోయింది. అప్పుడామె అడ్రస్ తీసుకున్నాను. పాపం డబ్బుగురించి ఇబ్బందుల్లోకూడా ఉందామె!''

గోపాలకృష్ణ ముఖం చిట్లించి, ''ఎవరో తెలియని వాళ్ళయితే కష్టమండీ. పనీ అదీ ఎలాచేస్తారో తెలియదు'' అన్నాడు.

''బాగుందండీ, ఉద్యోగంలోకి తీసుకోకుండా ఎఫిషియన్సీ ఎలా తెలుస్తుంది?'' అంది గీత.

''ఎలా తెలుస్తుందో వేరే చెప్పాలా. ఉదాహరణకు మీరే వున్నారు!'' అన్నాడు గోపాలకృష్ణ.

''ఆ మాట ముందే అనవలసింది మీరు. ఐనా అయాం వెరీ సారీ. నేను రవిశంకర్ గారి దగ్గర కంట్రాక్ట్ బేసిస్ మీద జేరాను'' అంది గీత.

''ఏమిటండీ, వాడిచ్చే నాలుగొందల యాభై రూపాయలకి కంట్రాక్టొకటా?''

''అయన్ను మరీ అలా తీసిపారేయకండి. నేను కంట్రాక్టులో ఉండగలందులకుగాను ఆయన, నా పేరున లక్ష

రూపాయలు బ్యాంకులో వేశారు. ఆ వ్యవహారం జరిగిన సందర్భంలోనే మనం బ్యాంకాఫిండియాలో కలుసుకున్నాం'' అంది గీత.

గోపాలకృష్ణ ప్రాన్పడిపోయాడు.

"మీకు ఇష్టమైతే చెప్పండి. నా స్నేహితురాలు ఉమకీరోజే ఉత్తరం రాసిపారేస్తాను'' అంది గీత.

గోపాలకృష్ణ మనుషుల్లోకి వచ్చాడు. గీతవంక మరో పర్యాయం పరీక్షగా చూశాడు. 'నిజమే, ఈ అద్భుత సౌందర్యాన్ని నేను చాలా తక్కువ అంచనా వేశాను. రవిశంకర్ నాకంటే తెలివైనవాడే' అనుకున్నాడు.

గీత లేవబోయింది. "ప్లీజ్, ఒక్క క్షణం ఆగండి'' అన్నాడు గోపాలకృష్ణ. నాకు ఉమావద్దు, రమావద్దు. మీరే కావాలి. ఎంత జీతం కావాలో చెప్పండి'' అన్నాడతను బ్రతిమాలుతున్న ధోరణిలో.

"నేనే ఎందుకు?'' అంది గీత.

'ఎందుకంటే యేమి చెప్పను, అందుకేనని యెలా చెప్పను?' అని మనసులో పాడుకున్నాడు గోపాలకృష్ణ. పైకిమాత్రం "చెప్పడం కష్టం, నాకు మీరు నచ్చారు'' అన్నాడు.

"ఏ కారణంతో రవిశంకర్‌ను వదిలిపెట్టను? నెలజీతం ఇస్తున్నారు. నా పేరున లక్షరూపాయలు బ్యాంకులో వేశారు.''

గోపాలకృష్ణ ఏదో ఆలోచిస్తున్నట్లు ఒక్క క్షణం ఆగాడు. తర్వాత నెమ్మదిగా, "ఒక్కసారి నాతో బయల్దేరి వస్తారా, మనం ఒక భవనం చూద్దాం'' అన్నాడు.

"ఎందుకు?'' అంది గీత.

"ఆ భవనం ఖరీదు కనీసం మూడు లక్షలుంటుంది''

ఆగాడు గోపాలకృష్ణ.

"అయితే?"

"మీకు నచ్చితే, అది మీ కిచ్చేస్తాను" అన్నాడు గోపాలకృష్ణ మామూలుగా.

గీత ఉలిక్కిపడింది. రెండునిముషాల తర్వాత లేచి నిలబడి, "పదండి_వెడదాం" అంది.

పార్కులోంచి కార్లోకి, కార్లోంచి ఒక అద్భుత భవనంలోకి వెళ్ళారిద్దరూ.

"ఇది నా ప్రత్యేక నివాసగృహం. నా సరదాలకోసం అన్ని హంగులతో కట్టించుకున్నది" అన్నాడు గోపాలకృష్ణ.

గీత ఆశ్చర్యంగా చూస్తోంది. ఎంత అందమైన భవనమది. అది తన స్వంతం కాబోతుందా?

నేలమీద ఖరీదైన తివాచీలు పరచబడి వున్నాయి. భవనంలోని ఫర్నిచర్ చాలా ఖరీదైనదని యెవ్వరైనా చెప్పగలరు. అసలు భవనంలో అడుగుపెట్టగానే ఒక అద్భుతమైన పరిమళం మత్తు కలిగిస్తోంది. ఇద్దరూ మెట్లు ఎక్కుతున్నారు. మెట్ల పొడుగునా పరిచిన మెత్తని కంబళీ, వాళ్ళ పాదాలకు హాయిని కలిగిస్తోంది.

"ఇది నా పడకగది" అన్నాడు గోపాలకృష్ణ.

గదిలో వృత్తాకారంలో వున్న ఒక పెద్ద మంచం వుంది. నాలుగుగోడలకీ వున్న అద్దాల్లో మంచంమీద కూర్చుని తమ ప్రతిబింబాలను చూసుకునే విధంగా వుంది. మంచంమీద మెత్తని పరుపులు. పరుపుమీద పరిచిన దుప్పటీలకు అందమైన డిజైనులు. గదిలో చక్కని పరిమళం, పరవశం కలిగించే పరిమళం.

"నచ్చిందా, ఇది మీ సొంతం కాబోతుంది" అన్న

గోపాలకృష్ణ మాటలు విని, ఈ లోకంలోకి వచ్చింది గీత. ఆమె ఉలిక్కిపడింది. గోపాలకృష్ణ చేయి తన నడుంమీద వుంది. ఆమె అతన్ని దూరంగా తోసింది.

గోపాలకృష్ణ వెళ్ళి మంచంమీద పడ్డాడు. అతని ముఖంలో నవ్వు వుంది. "భయంలేదు. తలుపులు వేశాను" అన్నాడతను.

"అంటే, మీ ఉద్దేశ్యం?" అంది గీత కోపంగా.

"అది మీకూ, నాకూ తెలిసినదే. ఎందుకు మళ్ళీ నాచేత చెప్పించడం" అన్నాడు గోపాలకృష్ణ.

"నేనెవరో తెలుసా?" అంది గీత.

"ఆహా, అందమైన పడుచుదానివి" అన్నాడు గోపాలకృష్ణ.

"కాదు, అగ్నిజ్వాలను. మరోసారి నా వంటిమీద చేయివేసి చూస్తే తెలుస్తుందా సంగతి."

"ఒక్కసారేం కర్మ. కొన్ని గంటలసేపు నీ వంటిమీంచి నా చేయి తీయనుకూడా" అంటూ లేచాడు గోపాలకృష్ణ.

గీత తన కుడిచేయి ముందుకు జాపింది. "చూశావా, నా చేతివేళ్ళకున్న తొడుగులు. అవి పదునైనవిమాత్రమే కాదు. వాటి చివర విషంకూడా వుంది. నా జోలికి వచ్చావా, నీ ప్రాణాలు దక్కవు. భవనంలోకి వచ్చేముందు ఎందుకైనా మంచిదని వాటిని ధరించాను."

గోపాలకృష్ణ అనుమానంగా ఆమె చేతివంక చూశాడు. ఆమె గోళ్ళు చాలా పొడవుగా కన్పిస్తున్నాయి. అవి మనిషి గోళ్ళులా కూడా లేవు. "నేను నమ్మను" అన్నాడతను.

"నమ్మకపోతే నిజం తెలుసుకున్నాక, మరి నువ్వీ లోకంలో వుండవు" అంది గీత.

గోపాలకృష్ణ ఆవేశం చల్లారింది.

"నన్నెందుకు అనుమానించేవు?"

"ఆడదానికి అది సహజం. కానీ నువ్వు నన్ను తక్కువ అంచనా వేయడం నువ్వు మూర్ఖుడవని చెప్పక చెబుతోంది. తను ఏ ప్రయత్నమూ చేయకుండానే రవిశంకర్ నా పేరున లక్షరూపాయలు బ్యాంకులో వేస్తాడనుకున్నావా? మరే దారీ లేదని తెలిశాకనే అతనాపని చేశాడు" అంది గీత.

"అయితే నిన్ను సొంతం చేసుకోడానికి లక్షరూపాయలు ఖర్చుపెట్టాలంటావ్?"

"సొంతం చేసుకోవడమంటే నీ ఉద్దేశ్యంలో ఏమిటో నాకు తెలియదు. నా ఉద్దేశ్యంలో మాత్రం పదిమంది ఎదుట పెళ్ళి చేసుకోవడం!" అంది గీత.

"శంకర్ నిన్ను పెళ్ళి చేసుకుంటాడా?" ఆశ్చర్యంగా అన్నాడు గోపాలకృష్ణ.

"అవును. కాబట్టి మరెన్నడూ మిత్రద్రోహం తలపెట్టవద్దు" అంది గీత.

# 9

"నువ్వు గీతను పెళ్ళి చేసుకుంటావా?"

"అవున్రా గోపాల్" అన్నాడు రవిశంకర్.

"అదేమిట్రా, ఎక్కడా పిల్లే దొరకలేదా నీకు."

"నిజమే. గీతలాంటి పిల్ల ఎక్కడా దొరకలేదు నాకు."

"ఏమిటో కూటికిలేక ఉద్యోగానికి వచ్చిందాన్ని వివాహం చేసుకోవడం నాకు నచ్చలేదు."

"ఆమె కూటికి లేనిదికాదు. బ్యాంకులో ఆమెపేరున లక్షరూపాయలున్నాయి."

"తెలుసున్రా, అదీ నీ ధర్మమే కదా."

"అలా తీసిపారేయకు. ఈ రోజు నేను కోటికి పడగ

లె త్తినవాణ్ణి కావచ్చు. కానీ మా తాతగారి ఊరు కట్టు గుడ్డలతో వచ్చారు. వాళ్ళదగ్గరా, వీళ్ళదగ్గరా అడిగి డబ్బుతీసుకుని వ్యాపారం మొదలుపెట్టారు. తెలివితేటలకు అదృష్టం కలిసివచ్చి ఈనాడు ఆయన మనవణ్ణి ఈ స్థాయికి చేరుకున్నాను.''

''బాగుంది. ఆయన దగ్గర సామర్థ్యం ఉంది. పచ్చిమిరప బజ్జీలమ్మే ప్రతివాడూ పదిమేడలు కట్టగలుగుతున్నాడా? సంపాదనే మనిషి తెలివితేటలకూ, అంతస్తుకూ కొలబద్ద'' అన్నాడు గోపాలకృష్ణ.

రవిశంకర్ నవ్వాడు. ''నీ దృక్పథం వేరు, నా దృక్పథం వేరు. ఎలా గొప్పవాణ్ణయ్యానో నాకు తెలుసు. అదీ కాక అందానికి అంతస్తులతో పనిలేదు. పేదవాడి దొడ్లో పూచినా, గొప్పవాడి దొడ్లో పూచినా గులాబిపూవు అందం ఒక్కటే. అయితే ఆ పువ్వునుంచిన చోటునిబట్టి దాని అంతస్తు మారుతుంది. ఓ ముష్టిదాని తల్లో ఉంటే దానికి గుర్తింపుండదు. అదే ఖరీదైన ఫ్లవర్ వాజ్‌లో పెడితే నలుగురికళ్ళూ పడతాయి. అందం ఎక్కణ్ణించి వచ్చిందన్న ప్రశ్నకంటె, ఎవరిచేతిలో పడిందన్న ప్రశ్నే ముఖ్యమైనది. గీత అందం నన్నాకర్షించింది. ఆ అందానికి సరైన స్థానం కల్పించాలనుకుంటున్నాను.''

''అబ్బా, చాలా గొప్పగా చెప్పావే. సరేకానీ, ఆ పువ్వుని నాబోటిగాడు ఆల్‌రెడీ వాసన చూసేసి వుంటే.''

''మిస్టర్ గోపాల్'' అన్నాడు రవిశంకర్ కోపంగా. ''గీత ఎవరనుకుంటున్నావు-మందే నిప్పు. ఆమె యెటువంటిదో అనుభవపూర్వకంగా నాకు తెలుసు.'' రవిశంకర్ స్వరంలోని తీవ్రతను తగ్గించి, ''నీ గురించి గీత నాకు

చెప్పింది. నీ బారినుంచి తనెలా తప్పించుకున్నదీకూడా చెప్పింది. మరోసారి ఆమెగురించి ఆలోచించావా, ఆమె జోలికి వెళ్ళావా—మనమధ్య స్నేహబంధముండదు. శతృత్వంకూడా ఉండదు. ఒకడు హంతకుడు, రెండోవాడు హతుడు—అంతే!" అన్నాడు.

"అయాం సారీ" అన్నాడు గోపాలకృష్ణ. కానీ అతని ముఖంలో పశ్చాత్తాపం కనిపించడంలేదు.

# 10

"నా పేరు సీతాపతి. కానీ మా ఆవిడ పేరు సీత కాదు." అన్నాడాయన. ఆయన వయసు సుమారు యాభై సంవత్సరాలుంటుంది. మనిషి పొడగరి. గుబురు మీసాలు. అందమైన, హుందాతనంగల ముఖం. జుట్టు మరీ ఎక్కువగా నెరియలేదు. ఇంకా బట్టతల కూడా రాలేదు. కానీ జుట్టు మాత్రం కాస్త పలచగా ఉంది.

గీత మౌనంగా నవ్వింది.

"ఈ రోజు ఆయన ఆఫీసుకు రారు. ఆయన స్థానంలో నేను వచ్చాను."

అర్థమైందన్నట్లు తలూపింది గీత.

పనులన్నీ చకచకా జరిగిపోయాయి. రవిశంకర్ లేని వెలితి ఫీలయింది గీత. కాని ముసలాయన చురుగ్గా ఉన్నాడు. చాలా పని రాబట్టాడు.

"మిస్ గీతా! ఈ రోజు నీవు మరో గంటసేపుండాల్సొంటుంది." అన్నాడు ముసలాయన.

గీత మౌనంగా తలూపింది.

అంత పెద్ద ఆఫీసులో గీత, సీతాపతి మిగిలారు.

"రవిశంకర్ స్థానంలో ఈ రోజు నేను రావడానికి కారణం తెలుసునా?" అనడిగాడు సీతాపతి.

"ఆయన సెలవులో ఉన్నారు కనుక." అంది గీత.

సీతాపతి లేచి ఆమె దగ్గరకు వచ్చి "ఆయన సెలవులో ఉన్నా ఆయన కార్యక్రమాలకు సెలవులేదు. అన్నీ యధా విధిగా జరిగిపోతాయి." అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు.

గీత చేయి వదిలించుకోలేదు. "అంటే?" అంది అమాయకంగా ముఖంపెట్టి ముసలాయన ముఖంలోకి చూస్తూ.

"ఈ సీతాపతి ఈ క్షణంలో గీతాపతి." అన్నాడాయన ఆమెను దగ్గరగా లాక్కుంటూ.

హాఠాత్తుగా చాచిపెట్టి కొట్టింది గీత. సీతాపతి చేయి అప్రయత్నంగా ఆమె నడుంమీదనుంచి తన దవడమీదకు వెళ్ళింది. ఆయన గీతను వదిలిపెట్టాడు.

"గీతంటే ఏమనుకున్నావ్?" అంది గీత కోపంగా.

సీతాపతి కళ్ళు ఎర్రబడ్డాయి. "ఏమనుకుంటేనేం? ఒక అసహాయురాలని తెలుసు. ఈ క్షణంలో నన్ను దాటిపోలేనిదని తెలుసు." అంటూ ఆమెని సమీపించాడు.

గీత వాచీ చూసుకుని "నీలాంటివాడికి బుద్ధి చెప్పడానికి అరగంటచాలు. ఎవరికి ఎలా బుద్ధిచెప్పాలో నాకు తెలుసు. హద్దు మీరావంటే నువ్వో నేనో చస్తాం. అలా కాక నాకేదైనా అన్యాయం జరిగిందంటే అందరి ఆడవాళ్ళలా ఏడుస్తూ కూర్చుంటాననుకోకు. నిన్ను రచ్చకీడ్చి తీరాను. ముందుగా పోలీసుస్టేషనుకు వెడతాను. నీ అన్యాయాన్ని ఋజువుచేయడానికి డాక్టరుపరీక్షకూడా సిద్ధపడతాను. ఏమైనా వదులుకుని బ్రతకగలవుకానీ పరువు వదులుకుని బ్రతకలేవు నువ్వు." అంది.

"ఓహ్! అంతపెద్ద పథకం వేశావన్నమాట. ఒకసారి

కాలు జారి స్త్రీకానీ మీ ఆడవాళ్ళ పొగరణగదు." అంటూ ఆయన ముందడుగు వేశాడు.

"ఆగు!" అంది గీత. ఆమె వానిటీబ్యాగులోంచి పిస్టల్ తీసింది. "ఇది పేల్చవలసిన అగత్యం నాకు కలగనివ్వకు."

"నన్ను క్షమించు గీతా! నీ శీలాన్ని రక్షించుకునేందుకు నువ్వు తీసుకునే జాగ్రత్తలు చూస్తూంటే ముచ్చటేస్తోంది. నీలాంటి ఆడదాన్ని పొందడంకోసం రెండుమూడు లక్షలు ఖర్చుపెట్టినా బాధనిపించదు." అన్నాడు సీతాపతి.

గీత చురుగ్గా సీతాపతి కళ్ళలోకి చూసింది. "ఈ వయసులో పెళ్ళి గురించి ఆలోచిస్తున్నారా మీరు?"అంది.

"ఛ ఛ - నాకు పెళ్ళేమిటి? మా ఆవిడ విందంటే కోర్టుకీడుస్తుంది." అన్నాడు సీతాపతి.

"నన్ను స్వంతం చేసుకోవడానికి ఎవరైనా లక్షలు ఖర్చుపెట్టాల్సిందేననుకోండి. కానీ ఇంకా ముఖ్యమైన దేమిటంటే అంత ఖర్చుపెట్టేక పెళ్ళి కూడా చేసుకోవాలి." అంది గీత.

సీతాపతి ముచ్చటగా గీత ముఖంలోకి చూస్తున్నాడు. ఎవరీ అమ్మాయి? ఎంత నిర్భయంగా, నిస్సంకోచంగా మాట్లాడుతుంది? అందం, అందానికి తగ్గ గుణం - గుణానికి తగ్గ ధైర్యం, ధైర్యానికి తగ్గ సమయస్ఫూర్తి—

"చూడు గీతా! ప్రస్తుతానికి నీ కర్థంకాదు. నా ప్రాపకంకోసం ఎంతోమంది ఎదురుచూస్తూంటారు. పెళ్ళి గురించి ఆలోచించకు. అంతగా కావాలంటే ఎవడో లోఫర్‌గాణ్ణి పెళ్ళాడు. కానీ అడిగినప్పుడల్లా నన్ను కాదనకూడదు. నీ పేరున బ్యాంకులో రెండు లక్షలుంటాయి. నువ్వు తిరగడానికి కారుంటుంది..."

"మిస్టర్ సీతాపతీ! ఎంతోమంది మీ ప్రాపకంకోసం ఎదురుచూస్తున్నారంటున్నారు కదా! నేను ఒకరి ప్రాపకంకోసం ఎదురుచూసేదాన్ని కాదు. మీవంటి వాళ్ళను చూస్తూంటే మగవాళ్ళమీద ద్వేషం పెరిగి పోతోంది నాకు. లక్షలు కుమ్మరించినా, కాళ్ళమీద పడి మొక్కినా ఈ గీత ఎవరికీ స్వంతం కాదు. పెళ్ళి ఒక్కటే మార్గం. అదైనా అందరిలాకాదు. నాకోసం ఏమైనా చేయాలనుకునేవాడినే చేసుకుంటాను." అంది గీత తీవ్రంగా.

సీతాపతి ముఖం ప్రసన్నంగా మారిపోయింది. ఆయన టెలిఫోన్ రిసీవర్ తీసి ఒక నంబర్ డయల్ చేశాడు.

"హలో - గోపాలకృష్ణా! నేను సీతాపతిని మాట్లాడు తున్నాను. గీతలో నువ్వు చెప్పిన లక్షణాలు కనబడ లేదు. మా రవి అదృష్టవంతుడని తోస్తోంది నాకు. గీత మా ఇంటి కోడలు కావడానికి నాకేం అభ్యంతరం కనిపించడం లేదు," అని ఫోన్ పెట్టేశారాయన.

గీత ఆశ్చర్యంగా ఆయన ముఖంలోకి చూస్తూ "మీరు...మీరు..." అంది.

"రవిశంకర్ తండ్రిని. అన్నీ చెప్పాడు వాడు నాకు. కానీ రెండ్రోజుల క్రితం గోపాలకృష్ణ అని నా మిత్రుడి కొడుకు నీ గురించి మరో రకంగా చెప్పాడు. అందులో నిజానిజాలు తెలుసుకునేందుకు స్వయంగా నేనే ఆఫీసుకు వచ్చాను. ఆ గోపాలకృష్ణ అలా ఎందుకు చెప్పాడో తెలి యదు. బహుశా..." అని ఆగి గీత ముఖంలోకి చూసి నవ్వేడాయన.

# 11

"నా పేరు గోపాలకృష్ణ." అన్నాడు గోపాలకృష్ణ.

"చిత్తం - తమర్నెప్పుడూ చూసిన గుర్తులేదండి."

అన్నాడు గీత తండ్రి నరసయ్య.

"మీరు నన్ను చూడలేదు. అయినా నేను మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను."

"ఎందుకో?" అన్నాడు నరసయ్య ఖరీదైన అతని దుస్తుల్నీ, ఆగిన అతని కారునీ మార్చి మార్చి చూస్తూ.

"మీరు నన్ను చూడకపోయినా నా గురించి వినే ఉంటారు, హరనాథ్ ఎంటర్ ప్రైజెస్ మాదే."

హఠాత్తుగా నరసయ్య శరీరంలో వణుకు వచ్చింది. ఊళ్ళో పేరుమోసినవాడు హరనాథ్. ఆయనకి ఊళ్ళో ఇంకా చాలా వ్యాపారాలున్నాయి.

"చిత్తం. విన్నానండి. కానీ మీరెందుకు వచ్చారో?" నీళ్ళు నమిలాడు నరసయ్య.

"మీరు డబ్బు కిబ్బందిపడుతున్నట్లు తోస్తోంది - మీ కేమైనా సహాయం చేయాలనిపిస్తోంది."

నరసయ్య ముఖం చిన్నబోయింది. "ఏవో మా యిబ్బందులు మాకుంటాయిలెండి కానీ- అవసరంకోసం ఎవర్నీ యాచించేవాళ్ళం కాదు." అన్నాడు.

"అబ్బే. నా ఉద్దేశ్యమది కాదండీ..." నసిగాడు గోపాలకృష్ణ. "చూడండి. మీరు పెద్దవారు. నేను కుర్రాణ్ణి. మాట్లాడ్డం నాకు చేతకాదు. నేనేమన్నా ఉద్దేశ్యపూర్వకంగా కాదని గ్రహించాలి మీరు - మీ పేరున ఒకలక్ష రూపాయలు బ్యాంకులో వేస్తాను. ఊరికే కాదు లెండి. ప్రతిఫలం కోరుతున్నాను."

"లక్ష రూపాయల విలువచేసే ప్రతిఫలం నేనెక్కణ్ణించి తేగలనండీ!" అన్నాడు నరసయ్య ఉలిక్కిపడి.

"మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళిచేయండి" అన్నాడు గోపాలకృష్ణ.

నరసయ్య భృకుటి ముడతలు పడింది. "ఏమి టన్నారూ?" అన్నాడు నమ్మలేనట్లు.

"లక్షల విలువచేసే ప్రతిఫలం మీ అమ్మాయే!"

నరసయ్య తమాయించుకున్నాడు. "ఇలాంటి విషయాలు పెద్దలతో సంప్రదించవలసినవి. మీ తలిదండ్రులు వస్తే బాగుంటుంది."

"మా ఇంట్లో నా మాటకు ఎదురులేదు. నా నిర్ణయానికి తిరుగులేదు. అనుకున్నది సాధించడం తప్ప మరొకటి తెలియదు నాకు. అనుకున్నది సాధించడంకోసం ఏం చేయడానికీ వెనుదీయను నేను."

"కావచ్చు. కానీ, మనకూ కొన్ని సాంప్రదాయాలంటూ ఉంటాయి గదా. పెళ్ళంటే కులం, గోత్రం చూసుకోవాలి. ఇరుపక్షాలకీ అన్నీ నచ్చుబాటు కావాలి. జాతకాలు సరిపడాలి. అందుకే సంప్రదింపులకు పెద్దవాళ్ళ అవసరం."

"మీరెప్పుడో పూర్వకాలపు మాటలు చెబుతున్నారు. పెళ్ళికవేమీ అవసరం లేదిప్పుడు. పెళ్ళి చేసుకునేదెవరు? ఒక అబ్బాయీ, అమ్మాయీ. పెళ్ళయ్యాక ఒకచోట చేరి కాపురంచేసేదీ వాళ్ళే. వాళ్ళిద్దరకూ నచ్చుబాటైతే అంతకంటే కావలసిందేముంది? బాగా ఆలోచించుకోండి. మా ఇద్దరికీ ఈడూ జోడూ సరిపోయింది. నాకు పిల్ల నచ్చింది. లక్షలకొద్దీ కట్నంతో వస్తున్నపిల్లలను కాదని, మీకే ఎదురుగా లక్ష ఇచ్చి పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను."

నరసయ్య క్షణం ఆలోచించి, "ఇంకా ఏమైనా ఆలోచించే ముందు అమ్మాయి ఇష్టాయిష్టాలను విచారించవలసి వుంది" అన్నాడు.

గోపాలకృష్ణ తటపటాయిస్తున్నట్లు అన్నాడు. "మీకు

తెలియదని కాదు. కానీ, వయసులోవున్న ఆడపిల్లల పెళ్ళి విషయం జాప్యంచేయడం మంచిదికాదు. మీ అమ్మాయి రవిశంకర్ దగ్గర పనిచేస్తోంది. వాడు నాకు చిన్నప్పట్నించీ తెలుసును. వాడి బుద్ధి లెలాంటివో కూడా యెరుగుదును. వాడిదగ్గర ఏ పిల్లా సెక్రటరీగా రెండుమూడు నెల్లకంటే పనిచేయదు. ఒకవేళ చేసిందంటే వాడి వల్లో పడిందనే అనుకోవాలి. ఇందులో మీరు నన్ను అపార్ధం చేసుకో కూడదు. మీ ముందుజాగ్రత్తకోసం చెబుతున్నాను."

గోపాలకృష్ణ వెళ్ళిపోయేక నరసయ్యా, వెంకాయమ్మ గారూ కూతురి భవిష్యత్తుగురించి చాలా సేపు చర్చించారు.

"ఈ రోజుల్లో అంతా డబ్బులో వుంది. కులం, గోత్రం అంటూ పట్టింపులు పెట్టుకుని వచ్చే లక్ష్మిని ఆపకూడదు. కుర్రాడు లక్షణంగా వున్నాడు..." అంది వెంకాయమ్మ చివరకు. నరసయ్యాగా రాశ్చర్యంగా భార్య ముఖంలోకి చూశాడు. ఇంచుమించుగా ఆయనకూ అలాంటి ఆలోచనే తోచినట్లుంది.

సాయంత్రం కూతురు రాగానే వాళ్ళిద్దరూ నెమ్మదిగా పెళ్ళి ప్రసక్తి తీసుకొచ్చారు.

"నడ్డి నొప్పిగా ఉందని ఆఫీసుకు సెలవెట్టానా? అది నీ పెళ్ళి నిశ్చయించడంకోసమే అన్నట్లు ఓ పెళ్ళికొడుకు వెతుక్కుంటూ ఇంటికి వచ్చాడు." అన్నాడు నరసయ్య.

గీత ఆశ్చర్యంగా వింటోంది. తండ్రి కులగోత్రాలను గురించి తన ఆదర్శభావాలను వ్యక్తపరిచేక గీత హఠాత్తుగా అడిగింది. "నాన్నా! అయితే పెళ్ళికవేమీ అడ్డు కాదం టారా?"

"అవేం అడ్డు. అది మన మూర్ఖత్వం-అంతే!" అన్నాడు నరసయ్య.

"అయితే ఇంతకాలం మీ దగ్గర చెప్పకుండా దాచిన నిజమొకటుంది నాన్నా! నేనో అబ్బాయిని ప్రేమించాను. అతనిది మన కులం కాదు. ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటున్నాడు. చాలా మంచివాడు. నన్ను తన ప్రాణంకంటె ఎక్కువగా చూసుకుంటాడు."

వెంకాయమ్మ మండిపడింది. ఆడవాళ్ళను చదివించడం వల్ల వచ్చే నష్టాలివేనంది. మొగుణ్ణి స్వయంగా వెతుక్కోవడమే కాకుండా ఇలా సిగ్గులేకుండా తల్లిదండ్రుల ముందు చెప్పడం తమ రోజుల్లో ఎరగం అంది. నరసయ్య కూడా కలగజేసుకొని కులంగోత్రం చూడనప్పుడు ఆ స్త్రీ అంతస్తూ చూడవలసిన అవసరముందన్నాడు.

గీత తల్లికేసి చూసి "పూర్వపు రోజుల్లో ఇలాంటి వేరగం అంటున్నావు-స్వయంవరాలుండేవి కదా!" అంది.

"అవా-అవి రాజుల కూతుళ్ళకి." అంది వెంకాయమ్మ తడుముకోకుండా.

"పొరపాటమ్మా! స్వయంవరం ఎందుకంటే అందమైన అమ్మాయిని చాలామంది మగవాళ్ళు పెళ్ళి చేసుకోవాలనుకుంటూంటే - అప్పుడు ఎన్నికను అమ్మాయికే వదిలిపెట్టేవారు. రాజు కూతుళ్ళకే కాదు. అన్ని కులాల్లోనూ ఈ ఆచారముండేది. ఎటొచ్చీ రాజులు డబ్బున్నవాళ్ళు కాబట్టి వాళ్ళ కథలు పైకి వచ్చాయి. మిగతావాళ్ళ కథలు పైకి రాకుండా ఉండిపోయాయి. అయినా ఆ రాజు కూతుళ్లెలాగుండేవారో నాకు తెలియదు - నాకంటే అందంగా మాత్రం ఉండివుండరని చెప్పగలను."

వెంకాయమ్మ బుగ్గలు నొక్కుకొని "ఔరా! ఎంత గర్వమే నీకు?" అంది.

నరసయ్య నెమ్మదిగా "చూడమ్మా! ఇలాంటి విష

యాల్లో స్వయంనిర్ణయం పనికిరాదు. పెద్దవాళ్ళు చెప్పినట్లు వినాలి. లేకపోతే తర్వాత విచారిస్తావు.'' అన్నాడు.

''ఇంతకీ మీకిష్టమైన ఆ అబ్బాయెవరు?'' అంది గీత.

''పేరు గోపాలకృష్ణ. హరనాథ్ ఎంటర్‌ప్రైజెస్...''

''చెప్పకండి. అన్నీ నాకు తెలుసు. అతనికింత మంచి ఉద్దేశ్యముందని ఇన్నాళ్ళు నాకు తెలియదే. అప్పుడప్పుడు నన్ను కలుసుకొని మాట్లాడ్డానికి ప్రయత్నిస్తే రౌడీ అనుకున్నాను.'' అంది గీత.

''నీకు తెలుసునన్నమాట. ఏమైనా ఇలాంటి విషయాల్లో పెద్దల జోక్యం అవసరం. అందుకే అతను మర్యాదగా మనింటికి వచ్చాడు.''

''నాన్నా!'' అంది గీత తీవ్రంగా. ''మీ నిర్ణయమే సమంజసమైందనుకుంటే నా నిర్ణయం సంగతి ఏమిటి? రవిశంకర్ నన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. వాళ్ళ అంతస్తు గురించి నేను వేరే చెప్పవలసినదేమీ లేదు కదా. అతను నా పేరున అప్పుడే లక్ష రూపాయలు వేశాడు. ఎందుకో తెలుసా?'' అంటూ కొన్ని సంఘటనలను తొలగించి జరిగినది చెప్పింది గీత.

నరసయ్య, వెంకాయమ్మ ఇద్దరూ కూడా మ్రాన్పడిపోయారు. వాళ్ళిద్దరూ కూతురివంకనే చూస్తూన్నారు. ఈ గీత నిజంగా తమ కూతురేనా అనిపించసాగింది వాళ్ళకి.

పేరుపొందిన ఇద్దరు వ్యాపారస్థులు. గీతను వివాహం చేసుకోవడంకోసం ఇద్దరూ ఎగబడుతున్నారు. గీత విలువ తమకు తెలియడంలేదు కానీ...

''నాన్నా! మీకు తెలియకుండా ఏ సంగతీ దాచను. మీ జోక్యం లేకుండా నా పెళ్ళి జరుగదు. మీరు మాత్రం కంగారుపడి ఏ ఒక్కరికీ మాటివ్వకండి. నేనెటువంటి దాన్నో మీకు తెలుసు గదా, మీ కూతుర్నే.'' అంది గీత.

# 12

రిసీవర్ ఎత్తి "హలో!" అన్నాడు రవిశంకర్.

"శంకరేనా! నేను గోపాలకృష్ణని మాట్లాడుతున్నాను."

"నువ్వా? ఏమిటి నాయనా విశేషం!"

"చాలా ముఖ్యమైనదే - నిన్నడగాల్సింది. గీత విషయంలో నీ నిర్ణయమేమిటి?"

"ఆ విషయం ఎప్పుడో ఫైనలైజయిపోయింది."

"బాగా ఆలోచించుకునే తీసుకున్నావా ఈ నిర్ణయం?"

"ఒరేయ్ గోపాల్! భగవంతుడు నాకు అన్నీ ఇచ్చాడ్రా! గీతవంటి అందమైన భార్య దొరికితే నా జీవితానికింక సంపూర్ణత లభిస్తుందనిపిస్తోంది. అదృష్టంకొద్దీ ఆమె నా కళ్ళబడింది. వదులుకోలేనింక."

"బాగా ఆలోచించరా శంకర్! మరొక్కసారి."

"ఎందుకింత పట్టుదలగా ఉన్నావు నువ్వు. ఆమె నీకేం అపచారం చేసింది?"

"అపచారం కాదురా. నువ్వేమీ అనుకోనంటే నిజం చెబుతాను."

"చెప్పు."

"గీతను నేను పెళ్ళాడాలనుకుంటున్నాను..."

"యూ..." అన్నాడు రవిశంకర్ కోపంగా.

"ఆలోచించరా. బాగా ఆలోచించు. గీతను చూశాకనే నా ఆలోచన పెళ్ళిమీదకు మళ్ళింది. ఆమె నాకు దక్కకపోతే బహుశా నేను బ్రతకనేమోననిపిస్తోంది."

తమాయించుకున్నాడు రవిశంకర్. "అది నీ తప్పు కాదురా. గీత అందం అటువంటిది. కానీ ఒకసారి పెళ్ళి

నిశ్చయమైపోయాక ఆమె గురించి ఎటువంటి చెడుతలం పులూ పెట్టుకోగూడదు. మనమిద్దరమూ స్నేహితులం. గీతకూ, నీ పెళ్ళికి ఇంక ఏ సంబంధమూ ఉండకూడదు. ఆమెను నీ మిత్రుడి భార్యగా గుర్తించు."

"పెళ్ళయాక చేస్తాను ఆ పని. ఒకవేళ ఏ కారణం చేతనైనా గీత నన్ను పెళ్ళిచేసుకుందనుకో, నువ్వు కూడా ఆ విషయం గుర్తుంచుకోవాలి."

# 13

"చెప్పండి." అంది గీత.

"బాగా ఆలోచించి మరీ మీ సమాధానం ఇవ్వాలి." అన్నాడు గోపాలకృష్ణ.

"అయితే మీరడగదల్చుకున్నది ప్రశ్న అన్నమాట." అంది గీత.

"అవును. మీ సమాధానం సూటిగా ఉండాలి!"

"ప్రశ్న సూటిగా ఉంటే సమాధానమూ అలానే ఉంటుంది."

"అయితే చెప్పండి. మీరు నన్నసహ్యించుకుంటున్నారా?"

"లేదు."

"అమ్మయ్య! నా గుండెబరువు కొంచెం తగ్గించారు. మీరు రవిశంకర్‌ని ప్రేమిస్తున్నారా? ఈ ప్రశ్నకు కూడా సూటిగానే జవాబివ్వండి."

"లేదు."

గోపాలకృష్ణ ముఖం వెలిగింది. "చాలా చక్కని హాయైన జవాబిచ్చారు. ఇంకొక్క ప్రశ్న."

"దానికీ సూటిగానే జవాబు కావాలా?" అడిగింది గీత.

"అవును."

"అయితే అడక్కండి. జవాబు నాకు తెలియదు."

"అదేమిటి? అడక్కుండానే తెలియదంటారు?"

"మీరడగబోయే ప్రశ్న, 'నన్ను మీరు ప్రేమించగలరా?' అని అంతేగా? దానికి జవాబు నాకు నిజంగా తెలియదు. తెలుసుకోవలసిన అవసరం కూడా లేదు."

"ఎందుకు లేదు?"

"నా వివాహం నిశ్చయం కాబోతోంది. అందువల్ల."

"అందుకే నాకు సమాధానం అవసరం. నన్ను మీరు ప్రేమించగలరన్న ధైర్యం నాకుంటే మీ వివాహం నాతో జరుగుతుంది."

"అసాధ్యం." అంది గీత.

"ఎన్నో అసాధ్యాలను సాధించాడీ గోపాలకృష్ణ. మీరు 'ఊఁ' అంటే చాలు. తర్వాత వ్యవహారం నేను చూసుకుంటాను."

"క్షమించండి. నేను 'ఊఁ' అనలేను. అయినా తెలియక అడుగుతాను. నా గురించి మీకింత పట్టుదలెందుకు?"

"జవాబు నిజంగా నాకు తెలియదు. చిన్నతనంనుంచీ గారాబంగా పెరిగాను నేను. కోట్ల ఆస్తికి ఏకైక వారసుణ్ణి నేను. మిమ్మల్ని చూసిన క్షణంలో—మీరు నాకు కావాలనుకున్నాను. పథకం వేశాను. మీరు నా కందలేదు. నా ఊహ కంటే ఎన్నోరెట్ల గొప్పతనం మీలో ఉంది. అది నన్ను మీపట్ల పూర్తిగా ఆకర్షితుణ్ణి చేసింది. మిమ్మల్ని స్వంతం చేసుకోవాలన్న పట్టుదల కూడా పెరిగింది. మీకోసం ఏం చేయడానికైనా సిద్ధంగా ఉన్నాను. కానీ మీరు నాకందడంలేదు. మొదటిసారిగా జీవితంలో ఓటమి ఎదురయ్యేలాగుంది. ఊహలో కూడా పరాజయం నేను సహించలేను." నిట్టూర్చాడు గోపాలకృష్ణ.

గీత నిట్టూర్చి "నాకు రవిశంకర్ మీద ప్రత్యేకమైన

ప్రేమంటూ ఏమీ లేదు. నేను కోరేదల్లా నన్ను బంగారు పువ్వులతో పూజించగల భర్త. అందుకవసరమైన ప్రేమా, అర్థికస్థితీ నా భర్త కుండాలి" అంది.

గోపాలకృష్ణ కళ్ళు మెరిశాయి. "మిస్ గీతా! ఒక్క చిన్న ప్రశ్న. ఒకవేళ ఏ కారణంచేతనైనా రవిశంకర్ మిమ్మల్ని వివాహం చేసుకోలేదనుకోండి. అప్పుడు నన్ను అంగీకరించడానికి అభ్యంతరమా?"

"అదెలా సాధ్యం?"

"సాధ్యాసాధ్యాల ప్రసక్తి మీకు లేదు. రవిశంకర్ మిమ్మల్ని వివాహం చేసుకోలేకపోతే నన్ను కరుణించ గలరా అన్నదానికి సూటిగా జవాబు చెప్పండి."

"ప్రస్తుతానికి చెప్పలేను. ఎందుకంటే అతను నన్ను నమ్మి నా పేరున లక్ష రూపాయలు బ్యాంకులో వేశాడు. నా వ్యక్తిత్వానికిచ్చిన గౌరవమది. అంత గౌరవం మీరు నాకివ్వగలరో లేరో నాకు తెలియదు."

"తెలుసుకునే రోజు ముందుంది. మీకోసం ఏమైనా చేయగలనని అతి త్వరలో తెలుసుకుంటారు మీరు." అన్నాడు గోపాలకృష్ణ.

## 14

"ఈ రోజు ఆఫీసుకి సెలవు."

"ఎందుకు?"

"నిజంగా మీకు తెలియదా? మేనేజర్ రవిశంకర్ చనిపోయారు."

"ఆఁ..." షాక్ తింది గీత.

ఆమెవంక ఆశ్చర్యంగా చూసి "నిజంగా మీకు తెలియదా అమ్మా?" అన్నాడు ఆఫీసు ముందున్న ప్యూన్.

"ఎలా జరిగింది? నిన్న ఆరోగ్యంగానే ఉన్నారు

గదా!" అంది గీత.

"అంతా దురదృష్టమమ్మా! చావు వెతుక్కుంటూ వచ్చిందాయన్ను..." ఫ్యాన్ కంఠం గాద్గదికమైంది.

"కాస్త వివరంగా చెప్పు." అంది గీత. ఆమె ఇంకా విషయాన్ని నమ్మలేకపోతోంది.

"చెప్పడానికేముందమ్మా! అయ్యగారికి కాస్త మందు అలవాటుంది. రోజూ రాత్రి మందు వేసుకు నేపడుకుంటారు. నిన్న వేసుకున్నదాంట్లో ఏదో విషం కలిసిందట."

"విషమా? ఏం విషం?"

"అవన్నీ సరిగ్గా తెలియవమ్మా నాకు. దిక్కుమాలిన పాడలవాటు అయ్యగారి ప్రాణాలను బలిపుచ్చుకుంది." ఫ్యాన్ కళ్ళలోంచి నీళ్ళు వచ్చాయి.

గీత అక్కడ క్షణం కూడా నిలబడలేదు. తనకోసం ఎన్నో కలలుగన్న రవిశంకర్ మరి లేడు. అతని వద్దనుంచి డబ్బు సంపాదించేక ఎలాగో అలా అతన్ని వదుల్చుకోవాలని తనకున్న మాట నిజం. కానీ ఈ విధంగా మాత్రం కాదు. భగవంతుడు తనకు సాయంచేసి ఉండవచ్చు. కానీ ఈ విధంగా జరగడం ఆమె కేమాత్రం సంతోషాన్ని కలిగించలేదు.

గీత రవిశంకర్ ఇంటికి ఎన్నడూ వెళ్ళలేదు. కానీ చాలా పర్యాయాలు బయటనుంచి చూసింది. ఆ ఇంటికి తనని యజమానురాల్ని చేయాలని రవిశంకర్ అనుకున్నాడు. కాని అతనిప్పుడు లేడు. అందుకు పరామర్శించడానికా అన్నట్లు వెడుతోంది ఆ ఇంట్లో కిప్పుడు.

ఇంట్లోంచి ఏడ్పులు వినిపిస్తున్నాయి. గీత ప్రవేశించింది ఇంట్లోకి. ఆ ఇంటి అందాలామెను చలింపజేయడం లేదిప్పుడు. ఏదో స్మశానంలా ఉందామెకా ప్రదేశం.

"హాలో మిస్ గీతా!"

ఆ కంఠం గోపాలకృష్ణది. అతని ముఖంలో విషాదం ఉట్టిపడుతోంది. "మన రవిశంకర్ ఇంక లేడు గీతా!" అన్నాడతను బాధగా.

"విన్నాను. ఏం జరిగిందసలు? ఏదైనా హత్యా ప్రయత్నమా?"

"అబ్బే అలాంటిదేం కాదు. అతను రాత్రిళ్ళు పడుకోబోయేముందు కాస్త ద్రవపదార్థం పుచ్చుకుంటాడు. అందులో ఎలా కలిసిందో నూటికి తొంభైపాళ్ళు మిథైల్ ఆల్కహోలు కలిసింది."

"ఎవరన్నా కావాలని..."

"ఇంపాసిబుల్. ఇంపోర్టెడ్ లిక్కర్. రహస్యంగా తీసుకునేవాళ్ళకి రిస్కు ఉంటూనే వుంటుంది. ఒకోసారి మోసం జరిపోతూంటుంది. మీరు విన్నారో లేదో ఒక నగరంలో కొన్ని వందలమంది చనిపోయారు."

"అవును. ఇది జరిగి ఎన్నాళ్ళో కాలేదు. నేనూ పేపర్లో చదివాను." అంది గీత.

రవిశంకర్ శవం చుట్టూ ముఖ్య బంధువులు కాబోలు వున్నారు. అక్కడే గీత సీతాపతిగారిని కూడా చూసింది. సీతాపతిగారి కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయి. ఆ క్షణంలో ఆయన అత్యంత సామాన్యుడిలాగున్నాడు. ఆయనన్నా, రవిశంకర్‌నీ, అక్కడి వాతావరణాన్నీ చూస్తూంటే గీతకు ఆపుకోలేని దుఃఖం వచ్చింది. చేతుల్లో ముఖం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చిందామె.

అలా కొద్ది నిముషాలు ఏడ్చాక మనసుకు కాస్త ఉపశమనం కలిగినట్లుంది. ఆమె నెమ్మదిగా కళ్ళు తుడుచుకుని ఒక పర్యాయం శవంవంక చూసింది. నిండా తెల్లని గుడ్డ

కప్పబడివుంది. ఆ గుడ్డ క్రింద నిన్నటివరకూ చలనముండి తన జీవితాధ్యాయంలో సంచలనం కలిగించిన వ్యక్తి, ఈ రోజు అతను పడుకున్న మంచానికీ, అతనికీ ఏమీ తేడాలేదు _ విలువలో తప్ప. అతనికంటె ఆ మంచమే విలువైన దీ రోజు! నిట్టూర్చింది గీత.

## 15

రవిశంకర్ చనిపోయి నెలరోజులైంది.

పార్కులో కూర్చుంది గీత. ఆమె ముఖకవళికల్నిబట్టి ఎవరికోసమో ఎదురుచూస్తున్నదని చెప్పవచ్చు. అప్పుడప్పుడు టైము చూసుకుంటోంది. అసహనంగా చుట్టూ పరికిస్తోంది. అసహనం మితిమీరినపుడు ఒకోసారి లేచి నిలబడి అటూ ఇటూ పచార్లుచేసి మళ్ళీ కూర్చుంటోంది.

"హల్లో మిస్ గీతా!" అన్న పరిచిత కంఠం విని వెనక్కు తిరిగిందామె.

"హల్లో _ మీరా?" అంది.

"మిస్ గీతా! ఇంకా ఎన్నాళ్ళు నేనిలా వేచి ఉండడం?"

"చూడండి మిస్టర్ గోపాలకృష్ణా! పేరుకు తగ్గట్లుగానే మీరు గోపాలకృష్ణులనుకోండి. రాధలా పది మందితో నా నాథుణ్ణి పంచుకోలేను. రావణాసురుడి దగ్గరున్నా సరే _ అడ్డదారులు తొక్కకుండా నాకోసం మాత్రమే తపించిపోయే రాముడిలాంటివాడు నాక్కావాలి. మీరు రాముడవునో కాదో తెలుసుకునేందుకు నాకు కొంత వ్యవధి కావాలి." అంది గీత తాపీగా.

"నా ప్రేమకు నిదర్శనంగా మీ పేర బ్యాంకులో రెండు లక్షలు వేశాను కదా! ఈ నెల రోజుల వ్యవధీ చాలలేదా మీకు?" అన్నాడు గోపాలకృష్ణ.

నవ్వింది గీత. "ప్రేమపూజారి అనే పదానికి అర్థం తెలుసా మీకు?" అనడిగింది తాపీగా.

"ప్రేమను పూజించేవాడనో, ప్రేమపువ్వులతో ప్రియురాలి పూజచేసేవాడనో అయ్యుంటుంది."

"అదేం కాదు. పూజారికీ, మనకీ తేడా తెలుసు గదా మీకు. పూజారి భగవంతుడికి ప్రతి రోజూ పూజచేస్తాడు. మనం అవసరమైనప్పుడు అప్పుడప్పుడు చేస్తూంటాం. ఉదాసీనత వహించకుండా ప్రియురాలిని నిత్యం పూజించగలవాడు ప్రేమపూజారి. నేను కోరుకునేది ప్రేమపూజారిని."

"నేను ప్రేమపూజారి నే!"

అదోలా నవ్వింది గీత. "రవిశంకర్ ప్రేమ హృదయంలోంచి పుట్టుకొచ్చింది. అందుకే అతను నా పేరున లక్ష రూపాయలు బ్యాంకులో వేయగలిగాడు. నన్ను నమ్మాడు. నేనే సర్వస్వమని అనుకున్నాడు. మనిషి మనసును అతని చర్యలే చెప్పక చెబుతాయి. అతడు నా పేర బ్యాంకులో డబ్బు వేశాడు కాబట్టి, మీరూ వేశారు. మీకు నాపైన ఉన్నది తాత్కాలిక వాంఛయో, ప్రేమయో అన్నది తెలుసుకునే అవకాశం నాకివ్వలేదు మీరు."

"ఏం చేస్తే నమ్ముతారు మీరు?"

"అది మీకే తెలియాలి."

ఒక్క నిముషం తటపటాయించాడు గోపాలకృష్ణ. "మీకు తెలియదు కానీ నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానన డానికి ప్రబల నిదర్శనముంది."

"అంటే _ రవిశంకర్‌ని మీరు..."

"నో నో నో..." అన్నాడు గోపాలకృష్ణ కంగారుగా. "రవిశంకర్ మరణానికి కారణం నేను కాదు."

"మరి...?" ఆశ్చర్యంగా అడిగింది గీత.

"ఇప్పుడు నేను చెప్పేది మీ మనసులోనే ఉంచుకోవాలి. పొరపాటున కూడా ఎవరికద్దా అనకూడదు. ఈ రహస్యం చెప్పడం ద్వారా నా ప్రాణాలు కూడా పోయే ప్రమాదముంది. అయినా నా ప్రేమను నిరూపించుకునేటందుకంతకంటె ప్రబల నిదర్శనముండదనే ఉద్దేశ్యంతో చెప్తున్నాను. నన్ను సహృదయంతో అర్థంచేసుకుని నాకు జీవిత సహచరిణి కాగలరని ఆశిస్తున్నాను." గోపాలకృష్ణ నిట్టూర్చాడు.

"రవిశంకర్, నేనూ స్మగ్లింగ్ వ్యాపారంలో భాగస్థులం. మా ఇద్దరివీ వేర్వేరు వ్యాపారసంస్థలైనప్పటికీ అండర్ గ్రౌండ్లో ఇద్దరిదీ ఒకటే వ్యాపారం. ఈ వ్యాపారంలో ఒక విదేశంతో పరిచయం ఏర్పడింది. కొన్ని ముఖ్య విషయాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి తమకందజేయవలసిందిగా ఆ దేశం కోరింది. అందుకుగానూ మాకు చాలా పెద్ద ప్రతిఫలం లభించింది. లక్షాధికారులం, కోటీశ్వరులం కాగలిగాం. మా డబ్బు దేశంలో మా పలుకుబడిని పెంచి పెద్దపెద్ద పరిచయాలను కలిగించింది. అతి సులభంగా సమాచారం సేకరించి ఆ దేశాని కందజేస్తూండేవాళ్ళం.

మా కొక రహస్య కార్యాలయముంది. విదేశానికి సంబంధించిన ప్రతినిధులు మమ్మల్నిక్కడ కలుసుకుంటూ ఉండేవారు. కొద్ది నెలల క్రితం ఎలా తెలిసిందో మన ప్రభుత్వానికి మా కార్యాలయం గురించి తెలిసింది. ఒక రోజు మేము సమావేశంలో ఉండగా మెరుపుదాడి జరిగింది. అందరమూ తెలివిగా తప్పించుకోగలిగాం - ఒక్కడు తప్ప. అక్కడ అందరం మారువేషాల్లో కలుసు

కుంటూంటాం. అందువల్ల ఎవరెవ్వరో మాలో మాకే చాలా మందికి తెలియదు.

ఆ దొరికిన ఒక్కరూ మా గురించి చెప్పగల రహస్యాలేమీ లేవు. తను చేసే పని మాత్రం చెప్పగలడు. మొన్న మొన్నటివరకూ అతను పోలీసుల నిర్బంధంలో ఉన్నాడు. రవిశంకర్ చనిపోయిన ముందురోజు అతన్ని పోలీసులు వదిలి పెట్టారు.

అప్పుడే రవిశంకర్ ఒక పొరపాటు చేశాడు. అతన్ని కలుసుకుని మాట్లాడ్డానికి ప్రయత్నించాడు. అతనిమీద పూర్తి పోలీసు నిఘా ఉంటుందన్న విషయం తెలిసుండీ ధైర్యం చేశాడు. అతను గుర్తుపట్టగల మారువేషంలో అతనికి కనిపించాడు. ఇద్దరూ క్షణాలమీద మాయమయ్యారు. ఒక భారత గూఢచారి వీళ్ళని అనుసరించాడు. ఆ విషయాన్నిద్దరూ గుర్తించి కూడా గుర్తించనట్లు నటించేరు. ఆ గూఢచారిని తప్పుదారి పట్టించి, మొత్తంమీద బయటపడ్డారు.

ఆ తర్వాత నన్ను కలుసుకున్నారు. నా దగ్గర అప్పుడొక విదేశీ గూఢచారి ఉన్నాడు. అతను అప్పుడప్పుడు మాకు విదేశీ సారా తెచ్చి ఇస్తూంటాడు. అతను మా ముగ్గురికీ మూడు బాటిల్సు ఇచ్చాడు. కాసేపు కబుర్లయ్యేక వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. అప్పుడు విదేశీ గూఢచారి నాకు చెప్పాడు. "ఈ ఇద్దరి పనీ రేపటితో సరి."

"అదేం?" అన్నాను ఆశ్చర్యంగా.

"వీళ్ళు బ్రతికుండడం బ్రతికున్న మీబోటివాళ్ళకీ, మీమీద ఆధారపడ్డ మాబోటివాళ్ళకీ కూడా ప్రమాదం. వీళ్ళని ఒక భారత గూఢచారి ఫొటోలు తీశాడు. ఆ ఫొటోలోంచి రవిశంకర్ అసలు రూపం బయటపడ్డానికి ఎన్నో

రోజులు పట్టదు. ఈలోగా అతను మరణిస్తే ఎవరికీ ఏ అనుమానమూ ఉండదు. ఆ ఫోటోలో వ్యక్తికోసం బ్రతికున్న వాళ్ళలోనే వెదుకుతారు వాళ్ళు.'' అన్నాడు గూఢచారి.

''అయితే ఇప్పుడు మీరేం చేశారు?''

''మీ దగ్గరకు వచ్చేముందే నాకు వీళ్ళ ఫోటోలు తీయబడ్డ వైనం సంగతి తెలిసింది. రవిశంకర్‌లాంటి ముఖ్యమైన వ్యక్తిని కూడా పోగొట్టుకోవలసివచ్చింది. అతన్ని పోగొట్టుకోకపోతే మీరు దక్కరు. అందుకే ఇప్పుడిచ్చిన బాటిల్‌లో మిథైల్ ఆల్కహాలుంచాను.''

నేను కంగారు పడ్డాను. అప్రయత్నంగా నా చేయి నా బాటిల్ మీదకు పోయింది. ''కంగారు పడకండి. మీ బాటిల్లోది అసలైన కోన్యాక్. పోయేది వాళ్ళిద్దరూ మాత్రమే. రవిశంకర్ చావుని అతని తండ్రి ఎలాగో అలా కప్పిపుచ్చుకోగలడు. రెండోవాడి శవం బైటకు రానివ్వం. అతను అనామకుడు కాబట్టి ఎవరూ పట్టించుకోరు.'' అన్నాడా గూఢచారి.

నాకు సగం విచారం, సగం సంతోషం కలిగింది—విచారం స్నేహితుడు పోతున్నాడని. మరి సంతోషమెందుకో తెలుసా మిస్ గీతా! మిమ్మల్ని పొందగలనని. అందుకున్న ఒకేఒక అడ్డంకి తొలగిపోతోందని. మీపట్ల నాకున్న ప్రేమ నన్నత్యంత విచారకర పరిస్థితిలో నాకు సంతోషాన్నిచ్చింది. ఈ విషయాలు ఎట్టి పరిస్థితిలోనూ ఎవ్వరికీ చెప్పకూడదు. అయినా మీ మీదున్న ప్రేమతో మీకు చెప్పాను. ఇప్పటికైనా నా ప్రేమను అంగీకరిస్తారా!'' అన్నాడు గోపాలకృష్ణ.

''మిస్టర్ గోపాలకృష్ణా! అంతా బాగానే ఉంది. కానీ మీరు దేశానికి శత్రువులు. మాతృదేశానికి ద్రోహం

తలపెట్టిన దేశద్రోహి." అంది గీత ఆవేశంగా.

"గీతా! దేశం గురించి బాధపెట్టుకోకండి. మన దేశంలో అష్టయిశ్వర్యాలూ మూలిగిపోతున్నాయని ఏ దేశమూ మన దేశంమీద కన్నేయలేదు. మనది ముష్టివాళ్ళ దేశం. తిండికీ, గుడ్డకీ కరువైన దేశం. ఈ దేశాని కేదేశం వల్లా కలిగే నష్టంలేదు. మనం మన సంగతి ఆలోచించుకోవాలి. మరో విధంగా మనం'సుఖసౌఖ్యాలలో ములిగి తేలగల అవకాశముందా? మీరు నాతో కలిస్తే–మీవంటి సౌందర్యవతి సహాయంతో మన సంపదను మరింత రెట్టింపు చేసుకోవచ్చు గీతా! ఏమంటారు?" అన్నాడు గోపాలకృష్ణ ఆవేశంగా.

అప్పటివరకు చెట్ల గుబుర్ల చాటున దాగిన మనుషులు బయటికి వచ్చారు. హఠాత్తుగా గోపాలకృష్ణ మీదపడి క్షణాలలో బంధించారు అతడిని. డిటెక్టివ్ విశ్వనాథం నవ్వుతూ, తన చేతిలో ఇంకా తిరుగుతున్న టేప్ రికార్డర్ని బటన్ వత్తి ఆపేశాడు.

* * *

"కంగ్రాచ్యులేషన్స్ మిస్ గీతా! ఇందులో నీ పాత్ర చక్కగా నిర్వర్తించేవు!" అన్నాడు డిటెక్టివ్ విశ్వనాథం, గీతను అభినందిస్తూ.

"నాదేముందండీ! అంతా మీ సలహాయే గదా!" అంది గీత.

"అంతా అయోమయంగా ఉంది డిటెక్టివ్ విశ్వనాథం గారూ!" అన్నాడు కిరణ్.

"ఇదంతా నా భార్య సుధ వేసిన పథకం. ఈ నగరంలో కొందరు దేశద్రోహులున్నారని పోలీసులు ప్రయత్నిస్తున్నారు పట్టుకొనేందుకు. కానీ వాళ్ళ ఆచూకీ

తెలియలేదు.

మేము రంగంలోకి దిగాం. అతి స్వల్పవ్యవధిలో కోట్లకు పడగెత్తిన రవిశంకర్, గోపాలకృష్ణలు మమ్మల్నాకర్షించారు. వాళ్ళను పట్టుకునేందుకు సుధ మాస్టర్ ప్లాన్ వేసింది. అప్పుడే ఆమె గీతను స్పాట్ చేసింది. రవిశంకర్ సెక్రెటరీ పోస్టు అడ్వర్టయిజు చేసిన సంగతి ఆమెకు చెప్పాం. ఆత్మరక్షణకు ఆమెకన్నో ఏర్పాట్లు చేశాం.

గీతవంటి అందమైన ఆడదాని అవసరం రవిశంకర్ లాంటి దేశద్రోహులకుంటుందని మాకు తెలుసును. అందుకే మా పథకం నెరవేరింది. ఇందులో గీత తన పాత్ర చక్కగా పోషించింది.'' అన్నాడు డిటెక్టివ్ విశ్వనాథం.

''గీతను తక్కువ చేయాలని కాదు కానీ - అబ్బాయిలే ఇక్కడ తమ పాత్రలను చక్కగా పోషించారని చెప్పాలి. అందమైన ఆడదాని ముందు బలహీనులై తమకు తామే బయటపడ్డారబ్బాయిలు.'' అంది సుధ.

''ఇదంతా గీత తనే స్వయంగా చేస్తోందనుకున్నాను కానీ మీబోటివారు తెరవెనుక ఉన్నారని నాకు ఊహా మాత్రంగానైనా తోచలేదు.'' అన్నాడు కిరణ్.

''ఆ విషయం మీరు గ్రహించే విధంగా గీత ప్రవర్తించివుంటే పిట్టలెప్పుడో ఎగిరిపోయుండేవి.'' అంది సుధ నవ్వుతూ.

''ఏది ఏమైతేనేం? మీబోటి మేధావుల కారణంగా కొంతమంది దేశద్రోహులు బయటపడ్డారు. దేశానికి కొంత ప్రమాదం తగ్గింది.'' అంది గీత నిట్టూర్చి, తన ప్రేమ పూజారులను తలుచుకుంటూ.

—: ఐపోయింది :—

# సప్లిమెంట్ పోటీ - 24.

**164, 165, 166, 167, 168** — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలు చేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు నవంబరు '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తే చాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *



# క్రైమ్‌లో తమాషాలు

## గురువుని మించిన శిష్యుడు

సన్యాసిరావుగార్కి కోతలు కోయటంలో చాలా నేర్పు. అలాగే ఆయన కోసే కోతల్లో ఏదన్నా తప్పు వస్తే దాన్ని సరిదిద్ది తన బాస్ గౌరవం నిలబెట్టటంలో ఆయన అసిస్టెంట్ కన్నాలు అందెవేసిన చెయ్యి.

ఒక రోజు సన్యాసిరావుగారు ఆయన ఫ్రెండ్ పైడి తల్లితో, "ఒరేయ్ పైడి! మొన్న నేను అడవికి వేటకు వెళ్ళినపుడు, గాల్లో మూడు జింకల్ని చంపానురా" అన్నాడు మీసం మెలివేస్తూ, గిగరిపెక్ ఫోజు పెట్టి.

ఆ మాటలకి పైడితల్లి ఆశ్చర్యపోయాడు. "గాలిలో మూడు జింకల్ని చంపటం అసాధ్యం" అన్నాడు.

సన్యాసిరావుగారు అసిస్టెంట్ కన్నాలు వైపు చూసాడు, జవాబు చెప్పమన్నట్లు.

కన్నాలు గొంతు సవరించుకున్నాడు. "అయ్యగారు జింకను తరుముకుంటూ వెంటపడ్డారు. అది ఒకచోట కంచె మీదుగా గాల్లో కెగిరింది. అయ్యగారి తుపాకి కాకిలా మొరిగింది. జింక చచ్చింది. దాన్ని కోస్తే, దాని కడుపులో రెండు పిల్లలున్నాయి. మొత్తం మూడు," టక్కున జవాబిచ్చాడు.

—ఎమ్. డి. బాబ్జి, రాజమండ్రి-3

# సుఖం?

తాత తన మనవడ్ని పెళ్ళికొడుకైన సందర్భంలో ఆశీర్వదిస్తూ, "బాబూ! జీవితంలో సుఖమనేది ఏమిటో నీకు ఇకమీదట తెలుస్తుంది" అన్నాడు.

ఒక సంవత్సరము గడిచింది. ఆ మనవడికి తిరిగి ముసిలాయన కనపడగానే మండిపడుతూ ఉక్రోషంతో ఇలా అన్నాడు.

"ఇంత వయస్సు వచ్చిన నీవు ఇలా పచ్చి అబద్ధాలు చెబుతావనుకోలేదు. సంసారమంటే సుఖమేమిటో నాకు ఇపుడు పూర్తిగా తెలిసింది."

"తొందరపడకు బాబూ, సంసారంలో పెద్ద సుఖమున్నదని నేను అనలేదు. పెళ్ళికాక పూర్వం ఎంత సుఖంగా ఉన్నావో తెలుసుకుంటావని నా భావం" అన్నాడు తాత.

—బొల్లాప్రగడ సుబ్రహ్మణ్యం, విశాఖ.

# ఉదార స్వభావులు!!

చాలారోజుల తర్వాత కలుసుకొన్న మిత్రులిద్దరు సరదాగా మాట్లాడుతూ 'హోటల్ నవయుగ'లో దూరి, ఫలహారాల్ని అరగించి, డ్రింక్స్ పుచ్చుకున్నారు. సప్లయర్ బిల్లు ఇచ్చి వెళ్ళాడు. వెంటనే వాళ్ళిద్దరూ "బిల్లు నేనిస్తానంటే.... నేనిస్తానని," ఘర్షణపడ్తున్నారు.

అప్పుడే కాఫీ సేవించి వస్తున్న ఒక రాజకీయ పిపాసి-

"నాయనలారా: మీలాంటి ఉదార స్వభావుల్ని, సంఘసేవకుల్ని నేనింతవరకు చూచి ఉండలేదు. ఆ చేత్తోనే యీ

బిల్లు కూడా ఇచ్చి పుణ్యం కట్టుకోండి." అంటూ చిన్న లెక్చరిచ్చి, వాళ్ళ చేతుల్లో బిల్లుపెట్టి, బయటకు కదిలాడు.

మిత్రు లిద్దరూ ఆశ్చర్యంతో అవాక్కయారు.

—ఏ. వి. సత్యనారాయణ, తెనాలి.

## కొత్త దంపతులు

బస్సులో ప్రయాణం చేస్తున్న జంటతో ప్రక్కనే కూర్చున్న బామ్మగారు—

"మీ రిద్దరూ క్రొత్త దంపతులా అమ్మాయి?"

"అవునండీ బామ్మగారు" అమ్మాయి జవాబు.

"పార్వతీ పరమేశ్వరుల్లా ముచ్చటగా వున్నారు." అంది బామ్మగారు పొగుడుతూ.

"ఈశ్వరునికి ఇద్దరు భార్యలు. మావారికి నేనొకర్తనే" అని గయ్యమంది ఆ క్రొత్త భార్య బామ్మగారిపై.

—పంపన శ్రీనివాసరావు, శ్రీశైలం ప్రాజెక్ట్.

## నా భయం అది కాదు-?

"ఒరే రామూ! నీవు సిగరెట్ తాగుతున్నావని మీ అన్నతో చెప్పాలా?"

"వద్దురా కృష్ణ."

"అంత భయం వుంటే మరెందుకు త్రాగుతావురా?"

"భయం కాదురా? వచ్చి సిగరెట్ అడుగుతాడురా!"

—న్యాయపతి రమేష్‌బాబు, బరంపురం. ★



